శ్రీ ర స్తు

# శ్రీ భగవద్గీతామృతము

తెలుగువ్యాఖ్య

శ్రీమాన్ K.S. రామానుజాచార్యులు






సంస్కృతవ్యాఖ్య

శ్రీ మద్వరవరమునీంద్రుల గీతార్థ సంగ్రహ దీపిక

ప్రకాశకులు

శ్రీ గోదా గ్రంథమాల

మునునూరు - 521 207.

కృష్ణా జిల్లా.

శ్రీ గోదా గ్రంథమాల

శాస్త్రవాఙ్మయము - పంచమ కుసుమము

ప్రథమ ముద్రణ 1990

శుక్లమీనము

ప్రతులు 1000

వెల రు. 20-00



ప్రాప్తిస్థానము

1. K. S. రామానుజాచార్యులు
వానమామలై మఠము
మూలాపేట - నెల్లూరు-3.

2. శ్రీ గోదా గ్రంథమాల
ముసునూరు - 521 207. కృష్ణా జిల్లా.

3. శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్స్
కూకట్‌పల్లి (రామాలయంవద్ద)
హైదరాబాద్. ఆం. ప్ర.

ముద్రణ
టి. యస్. కుమార్ ప్రింటర్స్
ముంగమూరువారివీధి
నెల్లూరు.

వ్యవస్థాపకులు - ప్రకాశకులు
శ్రీ గోదా గ్రంథమాల
ముసునూరు
కృష్ణా జిల్లా.

    

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవర మునయే నమః

# శ్రీ భగవద్గీతామృతము

## ద్వితీయషట్కము



### సప్తమాధ్యాయము — విజ్ఞానయోగము.

ప్రథమషట్కమునందు జీవాత్మయొక్క స్వరూపయాథాత్మ్య దర్శనము చెప్పబడినది. అది ఆత్మజ్ఞానపూర్వకమైన కర్మానుష్ఠానముచే సాధింపదగినది. అది పరబ్రహ్మప్రాప్తికి ఉపాయమైన ఉపాసనకు అంగము - ఇక ఈ ద్వితీయషట్కమున పరబ్రహ్మస్వరూపము భక్తి శబ్దవాచ్యమైన తదుపాసనము చెప్పబడును. సప్తమాధ్యాయమునందు భగవత్స్వరూపయాథాత్మ్యము; తత్ప్రాప్తికై ప్రపత్తి; ఉపాసకులలో జ్ఞానియొక్క విశిష్టత చెప్పబడుచున్నవి.

శ్లో॥ *మయ్యాసక్తమనాః పార్థ; యోగం యుఞ్జన్ మదాశ్రయః ।*
*అసంశయం సమగ్రం మాం; యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥* 1

టీ -: హేపార్థ = ఓ అర్జునా, మత్ + ఆశ్రయః = నన్నే ఆశ్రయముగ పొందినవాడవు; మయి = నావిషయమున, ఆసక్తమనాః = లగ్నమైన మనస్సు కలవాడవునై; యోగం = భజనీయపరమాత్మవిషయక జ్ఞానమును; యుంజన్ = ప్రారంభించుచు; మాం = యోగమునకు విషయభూతుడనైన నన్ను; అసంశయం = నిస్సంశయముగ; యథా = ఎట్లు; జ్ఞాస్యసి = తెలిసికొనగలవో; తత్ = ఆ జ్ఞానమును; శృణు = వినుము.

తా - అర్జునా నాయందలి ప్రీత్యతిశయముచే నాయందే మనస్సును నిలిపి నేను తప్ప మరియొక ఆధారము లేనివాడవై భక్తియోగోపకారకమైన భజనీయతత్త్వజ్ఞానమును సంపాదింప నుపక్రమించిన నీవు ఆ యోగముచే తెలియదగిన నన్ను ఏ జ్ఞానముచే నిస్సంశయముగ సమగ్రముగ తెలిసికొనగలవో చెప్పెదను; వినుము.

దీపికా -: ఏవం ప్రథమేనాధ్యాయషట్కేన పరబ్రహ్మప్రాప్త్యుపాయభూతస్య తదుపాసనస్యాంగభూత మాత్మజ్ఞానపూర్వక కర్మానుష్ఠాన సాధ్యం ప్రాప్తుః ప్రత్యగాత్మన స్స్వరూపయాథాత్మ్యదర్శన ముక్తం । ఇదానీం మధ్యమేన షట్కేన పరబ్రహ్మస్వరూపం భక్తిశబ్దవాచ్యం తదుపాసనం చోచ్యతే । తత్ర సప్తమేఽధ్యాయే భగవత్స్వరూపయాథాత్మ్యం తస్య ప్రకృత్యా తిరోధనం తన్నివృత్తయే భగవత్ప్రపత్తి; రుపాసకభేదో; జ్ఞానిశ్రైష్ఠ్యం చోచ్యతే। హే పార్థ = అర్జున। మదాశ్రయః = అహమేవాశ్రయో యస్య స మదాశ్రయః - మయా వినా స్వాత్మధారణాఽశక్త్యా మదేకాధారః। మయి = విషయే । అసమంతాత్ సక్తం మనో యస్య సః. ఆసక్తమనాః। యోగం; యుంజన్ = కర్తుం ప్రవృత్తః। త్వం। సమగ్రం = సకలం । మాం = యోగవిషయభూతం మాం।। యథా = యేన జ్ఞానేన, అసంశయం = సంశయరహితం యథా తథా । జ్ఞాస్యసి । తత్ = జ్ఞానం। శృణు = సావధాన మాకర్ణయ ।। 1 ।।

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞానం; ఇదం వక్ష్యామ్యశేషతః ।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్; జ్ఞాతవ్య మవశిష్యతే ॥ 2

టీ -: సవిజ్ఞానం = భగవంతుడు చిదచిద్విలక్షణుడు అను జ్ఞానముతో కూడిన; ఇదం = ఈ; జ్ఞానం = నా స్వరూపజ్ఞానమును; అశేషతః = సమగ్రముగ; అహం = నేను; తే = నీకు; వక్ష్యామి = చెప్పెదను యత్ = ఏ జ్ఞానమును; జ్ఞాత్వా = తెలిసికొనిన పిదప; ఇహ = ఈ నావిషయమున; భూయః = మరల; జ్ఞాతవ్యం = తెలియదగినది; అన్యత్ = మరియొక్కటి; న + అవశిష్యతే = మిగిలియుండదో.

తా -: అర్జున; చేతనాఽచేతనవిలక్షణుడనైన నాయొక్క స్వరూపజ్ఞానమును సమగ్రముగ నీకు బోధింతును - దీనిని తెలిసినపిదప తెలియదగినది మరేదియు ఉండదు

దీపికా -: వక్ష్యమాణం జ్ఞానం స్తౌతి(జ్ఞానమితి)సవిజ్ఞానం. సమస్త చిదచిద్వస్తు జ్ఞానాద్వివిక్తాకారవిషయం జ్ఞానం = విజ్ఞానం, తేన సహితం। అశేషతః = అశేషం । ఇదం = వక్ష్యమాణరూపం । జ్ఞానం = మత్స్వరూప విషయకం జ్ఞానం। జ్ఞాత్వా । ఇహ = మయి । భూయః = పునరపి । జ్ఞాతవ్యం = జ్ఞేయం । అన్యత్ = తత్త్వం । నాఽవశిష్యతే = అవశిష్టం న భవతి ॥ 2 ॥

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు; కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 3

టీ-: మనుష్యాణాం = శాస్త్రాధికారులైనవారియొక్క; సహస్రేషు = వేలలో; కశ్చిత్ = ఒకడు; యతతి = ఫలసిద్ధిపర్యంతము ప్రయత్నించును; యతతాం = అట్లు ప్రయత్నించువారియొక్క; సహస్రేషు = వేలలో; కశ్చిత్ = ఒకడు; మాం = నన్ను; వేత్తి = తెలిసికొనును. సిద్ధా

నాం + అపి = ఆవిధముగ తెలిసికొన్నవారియొక్క; సహస్రేషు = వేలలో; కశ్చిత్ = ఒకడు; మాం = నన్ను; తత్త్వతః = యథార్థముగ; వేత్తి = తెలిసికొనుచున్నాడు.

తా -: శాస్త్రాధికారము గల వేలకొలది మనుష్యులలో ఏ ఒక్కడో ఫలసిద్ధిపర్యంతము ప్రయత్నించును. అట్టివారిలో ఏ ఒక్కడో నన్ను తెలిసికొనును; అట్లు నన్ను తెలిసికొన్నవారియందును ఏ ఒక్కడో నన్ను యథార్థముగ తెలియగలుగుచున్నాడు(భగవత్తత్త్వమును తెలిసికొనుట దుర్లభ మనిభావము.)

దీపికా -: వక్ష్యమాణ జ్ఞానదుర్లభత్వ మాహ (మనుష్యాణా మితి) మనుష్యాః = శాస్త్రాధికారిణః, తేషాం । సహస్రేషు = మధ్యే । కశ్చిదేవ, సిద్ధయే = మమ సాక్షాత్కారరూపసిద్ధిపర్యంతం । యతతి = యత్నం కరోతి । స ఏవ ప్రథమం దుర్లభ ఇత్యర్థః । యతతాం = సిద్ధిపర్యంతం యతమానానాం । సహస్రేషు । కశ్చిదేవ । మాం । వేత్తి = విదిత్వా సిద్ధయే యత్నం కరోతీత్యర్థః । అయం పూర్వోక్తాధికారిభ్యోఽపి దుర్లభః । సిద్ధానాం = మద్విషయజ్ఞానవతామపి । సహస్రేషు మధ్యే । కశ్చిదేవ । తత్త్వతః = యథావత్ । మాం । వేత్తి । తథావిధాఽధికారీ పరమ దుర్లభ ఇతి భావః ॥ 3 ॥

*శ్లో॥ భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।*
*అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥* 4

టీ -: భూమిః = భూమి; అపః = ఉదకములు; అనలః = అగ్ని; వాయుః = వాయువు; ఖం = ఆకాశము; మనః = మనస్సు; బుద్ధిః = మహత్తత్త్వము; ఇతి = అని; అష్టధా = ఎనిమిదివిధములుగా, భిన్నా = విభజింపబడిన; ఇయం = ఈ; ప్రకృతిః = ప్రకృతి; మే + ఏవ = నాదే.

తా -: భూమి జలము అగ్ని వాయువు ఆకాశము ఇంద్రియములు మహత్తత్త్వము అహంకారతత్త్వము ఇవి అన్నియు జగత్తునకు మూల మైన అచేతన ప్రకృతియొక్క రూపములు. ఇట్టి అచేతనప్రకృతి నాయది.

దీపికా -: ఏవం శ్రోతార మభిముఖీకృత్యాథ ప్రతిజాత మర్థం వక్తు మారభతే (భూమిరిత్యాది) భూమిః=పృథివీ । అపః=జలం । అనలః=అగ్నిః । వాయుః = మారుతః । ఖం=ఆకాశః । మనః= మనః ప్రభృతీంద్రియవర్గః । బుద్ధిః=మహత్తత్త్వం చ । అహంకారః= సాత్త్వికరాజసతామసభేదేన వివిధోఽహంకారశ్చ । ఇతి=అనేన ప్రకా రేణ । అష్టధా = అష్టభిః ప్రకారై ర్భిన్నా ఇయంప్రకృతిః । మే= మదీయా ॥ 4 ॥

శ్లో॥ *అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।*
*జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్॥* 5

టీ -: మహాబాహో=అర్జునా; ఇయం=ఈ అచేతన ప్రకృతి; అపరా=నికృష్టమైనది; ఇతః=ఈ అచేతనప్రకృతికంటెను; అన్యాం= విలక్షణమైన; జీవభూతాం=జీవరూపమైన; మే=నాయొక్క; ప్రకృతిం =చేతనప్రకృతిని; పరాం = ఉత్కృష్టమైనదానినిగ; విద్ధి = తెలిసి కొనుము. యయా=ఏ చేతనప్రకృతిచే; ఇదం=ఈ స్థావరజంగమాత్మక మైన; జగత్=జగత్తు; ధార్యతే=ధరింపబడుచున్నదో.

తా -: అర్జునా అచేతనప్రకృతి భోగ్యము. చేతనప్రకృతి భోక్త. ఇవి రెండును నావే. వీనిలో అచేతనప్రకృతికంటెను చేతనప్రకృతి ఉత్కృష్టమైనది. చేతనప్రకృతిచేతనే అచేతనప్రకృతి ధరింపబడు చున్నది.

దీపికా -: ఇయం=అష్టధా భిన్నా మే ప్రకృతిః, అపరా=జడత్వా న్నికృష్టా, హే మహాబాహో, ఇతః = అచేతనభూతాయాః ప్రకృతేః,

అన్యాం=విలక్షణాం, జీవభూతాం = జీవరూపాం, మే ప్రకృతిం తు, పరాం=అజడత్వాద్భోక్తృత్వాత్ప్రాధానత్వాచ్చోత్కృష్టాం.విద్ధి=జానీహి, యయా=జీవరూపయా మత్ప్రకృత్యా, ఇదం= స్థావరజంగమాత్మకం జగత్, ధార్యతే=శరీరితాయాఽన్తఃప్రవిశ్య ధ్రియతే ॥ 5 ॥

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా॥ 6

టీ -: సర్వాణి = సమస్తములైన; భూతాని = ప్రాణులు; ఏతత్ + యోనీని = ఈ రెండు ప్రకృతులను కారణముగా కలిగియున్నవి. ఇతి = అని; ఉపధారయ = తెలిసికొనుము కృత్స్నస్య = సమస్త చేతనాఽచేతన మయమైన; జగతః = జగత్తునకు; అహం = నేను; ప్రభవః = ఉత్పత్తి కారణము. తథా = అట్లే; ప్రళయః = లయకారణమునై యున్నాను.

తా -: బ్రహ్మాదిస్తంబపర్యంతము గల ప్రాణికోటి నా యీ చేతనాఽచేతనప్రకృతులవలన కలుగుచున్నది - కావున ఈ సమస్త ప్రపంచమునకు నేనే ఉత్పత్తికారణము ప్రళయకారణము అగుచున్నాను.

దీపికా -: తస్యాః ప్రకృతిత్వం దర్శయన్ తద్ద్వారా స్వస్య జగత్కారణత్వ మాహ (ఏతద్యోనీనీతి) సర్వాణి=బ్రహ్మాదీని స్తంబ పర్యంతాని భూతాని, ఏతద్యోనీని — ఏతత్ = పరాపరరూపప్రకృతి ద్వయం, యోనిః = ఉపాదానకారణం, యేషాం తాని తథోక్తాని, ఇతి = అనేన ప్రకారేణ, ఉపధారయ = జానీహి, అత ఏవ, కృత్స్నస్య= మదీయప్రకృతిద్వయమయస్య సమస్తస్య, జగతః = ప్రపంచస్య, అహం = తయోరపి యోనిభూతోఽహం, ప్రభవత్యస్మాదితి ప్రభవః = ఉత్పత్తికారణం, తథా, ప్రలీయతేఽస్మిన్నితి ప్రళయః = లయకారణం చ ॥ 6 ॥

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్; కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం; సూత్రే మణిగణా ఇవ॥ 7

టీ -: ధనంజయ = అర్జున; మత్తః = నాకంటె; పరతరం = ఉత్తమమైనది;కించిత్ + అపి = ఏదియు;నాస్తి = లేదు. ఇదం సర్వం = ఈ చేతనాఽచేతన మంతయు. సూత్రే = దారమునందు; మణిగణాః + ఇవ = రత్నసమూహములవలె; మయి = నాయందు; ప్రోతం = కూర్పబడియున్నది.

తా -: సర్వకారణకారణమైన నాకంటె శ్రేష్ఠమైనది మరియొకటి ఏదియు లేదు. ఈ చేతనాఽచేతనములన్నియు దారమునందు రత్నములవలే నాయందు గుదిగుచ్చబడియున్నవి.

దీపికా -: హే ధనంజయ, మత్తః = మదపేక్షయా, అన్యత్ పరతరం = ఉత్కృష్టతరం, కించిదపి = వస్తు, నాస్తి, సర్వం ఇదం = చిదచిద్వస్తుజాతం, సూత్రే = తన్తౌ, మణిగణా ఇవ = రత్నసమూహ ఇవ మయి, ప్రోతం = ఆశ్రితం ॥ 7 ॥

శ్లో॥ రసోఽహమప్సు కౌన్తేయ; ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవస్సర్వవేదేషు; శబ్దః ఖే పౌరుషం నృషు॥ 8

శ్లో॥ పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥ 9

శ్లో॥ బీజం మాం సర్వభూతానాం; విద్ధి పార్థ సనాతనమ్।
బుద్ధిర్బుద్ధిమతామస్మి; తేజస్తేజస్వినామహమ్॥ 10

శ్లో॥ బలం బలవతాం చాహం; కామరాగవివర్జితమ్।
ధర్మాఽవిరుద్ధో భూతేషు; కామోఽస్మి భరతర్షభ॥ 11

టీ -: హే కౌంతేయ = ఓ అర్జునా; అహం = నేను; అప్సు = ఉదకములయందు; రసః = మధురాదిరసముగ; శశిసూర్యయోః = చంద్ర

సూర్యులయందు; ప్రభా = కాంతిగ; సర్వవేదేషు = సమస్తవేదముల యందు; ప్రణవః = ఓంకారముగ; ఖే = ఆకాశమునందు; శబ్దః = శబ్దముగ; నృషు = మానవులయందు; పౌరుషం = కర్తృత్వశక్తిగ; అస్మి = ఉన్నాను పృథివ్యాం = భూమియందు; పుణ్యః = పవిత్రమైన; గంధః + చ = గంధముగను; విభావసౌ = అగ్నియందు; తేజః + చ = తేజస్సుగను; అస్మి = ఉన్నాను. సర్వభూతేషు = సకలప్రాణులయందు; జీవనం = ప్రాణధారణముగ; తపస్విషు = తపోనిష్ఠులయందు; తపః + చ = కాయక్లేశాదిరూపమైన తపస్సుగను; అస్మి = ఉన్నాను. పార్థ = అర్జునా; మాం = నన్ను; సర్వభూతానాం = సకలప్రాణులకు; సనాతనం = నిత్యమైన; బీజం = మూలముగ; విద్ధి = తెలిసికొనుము. బుద్ధిమతాం = బుద్ధిమంతులలో; బుద్ధిః = ప్రజ్ఞగ; తేజస్వినాం = శూరులలో; తేజః = శౌర్యముగ; అహం = నేను; అస్మి = ఉన్నాను. భరత + ఋషభ = అర్జున; అహం = నేను; బలవతాం = బలము గలవారిలో; కామరాగవివర్జితం = కామము (కోరిక) రాగము (ఇతోఽధికముగ అనుభవింపవలయునను కోరిక) లేని; బలం + చ = స్వధర్మానుష్ఠానసామర్థ్యముగను; భూతేషు = ప్రాణులయందు; ధర్మ + అవిరుద్ధః = ధర్మమునకు విరుద్ధము కాని; కామః = కోరికగను; అస్మి = అగుచున్నాను.

తా :- అర్జునా; సకలపదార్థములయందును సారము నేనే అగుచున్నాను.

దీపికా :- సమస్త చిదచిద్వస్తు శరీరిణః స్వస్మాదన్యస్యాభావాత్స్వయమేవ సర్వ మిత్యాహ పంచభిః శ్లోకైః, హే కౌంతేయ, అప్సు = జలేషు, రసః మధురాదిః, అహమేవ, శశిసూర్యయోః = చంద్రసూర్యయోః, ప్రభా = కాంతిః అహం అస్మి, సర్వవేదేషు, ప్రణవః అహమేవ, ఖే = ఆకాశే, శబ్దః, అహమేవ, నృషు = మనుష్యేషు, పౌరుషం = ఉద్యోగః, అహం పృథివ్యాం, పుణ్యః = సురభిః, గంధశ్చ, విభావసౌ = అగ్నౌ. తేజశ్చ, అహం అస్మి, సర్వభూతేషు = సర్వప్రాణిషు, జీవనం =

ప్రాణధారణం, తపస్విషు=వానప్రస్థాదిషు, తపః=కాయక్లేశాదిరూప తపశ్చ, అహం అస్మి; హే పార్థ, సర్వభూతానాం, సనాతనం=ఉత్తరోత్తరకార్యేష్వనుస్యూతతయా నిత్యం, బీజం = సజాతీయకార్యారంభ సామర్థ్యం, మాం విద్ధి, బుద్ధిమతాం=ప్రజ్ఞావతాం, బుద్ధిః=ప్రజ్ఞా చ, అహం అస్మి, తేజస్వినాం=పరాభిభవనసామర్థ్యం చ; అహం కామరాగవివర్జితం - కామః=అప్రాప్తవస్తుష్వభిలాషః, రాగః=అభిలషితార్థలాభేపి పునరధికార్థే తృష్ణా, తాభ్యాం వివర్జితం, బలవతాం - జనానాం, బలం=సర్వస్వధర్మానుష్ఠానసామర్థ్యం చ అహం, హే భరతర్షభ, భూతేషు=దేవమనుష్యాదిషు, ధర్మావిరుద్ధః = ధర్మస్యాప్రతికూలః, కామశ్చ, అహం అస్మి ॥ 8, 9, 10, 11 ॥

*శ్లో॥ యేచైవ సాత్త్వికా భావాః; రాజసాస్తామసాశ్చ యే ।*
*మత్త ఏవేతి తాన్విద్ధి; న త్వహం తేషు తే మయి ॥* 12

టీ -: సాత్త్వికాః=సత్త్వగుణప్రధానములైన యే భావాః=ఏ శమదమాదులు గలవో; రాజసాః=రజోగుణప్రధానములు; తామసాః+చ=తమోగుణప్రధానములు నైన; యే భావాః=హర్షగర్వాదులు - శోకమోహాదులు నైన ఏ భావములు గలవో; తాన్=వానిని; మత్తః+ఏవ+ఇతి=నావలన ఏర్పడిన వని; విద్ధి=తెలిసికొనుము. అహం తు=నేనుమాత్రము. తేషు=ఆ భావములయందు; న=లేను. తే=ఆ భావములు; మయి=నాయందు కలవు.

తా -: అర్జున; శమదమాది సాత్త్వికభావములు హర్షగర్వాది రాజసభావములు శోకమోహాది తామసభావములును నావలననే పుట్టుచున్నవి. అభావములు నా అధీనములు. నేను వానికి అధీనుడనుకాను.

దీపికా -; సాత్త్వికాః = సత్త్వప్రధానాః, యే భావాః=శమదమాదయః పదార్థాః సన్తి, రాజసాః = రజోగుణప్రధానాః, యే చ భావాః హర్షదర్పాదయః సన్తి, తామసాః=తమోగుణప్రధానాః, యే చ,

భావాః = శోకమోహాదయః, సన్తి, తాన్ = సర్వానేవ భావాన్, మత్త ఏవేతి విద్ధి = మత్సకాశాదేవ జాతాన్విద్ధి, అహం తు తేషు, న = తదాయత్తస్థితిర్నభవామీత్యర్థః, తే = భావాః, మయి, మదాయత్తస్థితికా ఇత్యర్థః ॥ 12 ॥

శ్లో॥ త్రిభిర్గుణమయైర్భావై ; రేభిస్సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి; మామేభ్యః పర మవ్యయమ్ ॥ 13

టీ -: ఇదం = ; సర్వం జగత్ = సకలప్రపంచము; త్రిభిః = మూడు విధములైన; ఏభిః = ఈ; గుణమయైః = సత్త్వరజస్తమోగుణమయములైన; భావైః = పదార్థములచేత; మోహితం = మోహింపజేయబడినదై; ఏభ్యః = ఈ పదార్థములకంటె; పరం = విలక్షణుడనై; అవ్యయం = నాశరహితుడనైన; మాం = నన్ను; న + అభిజానాతి = తెలియలేకున్నది.

తా -: ఈ ప్రపంచమంతయు సత్త్వరజస్తమోగుణాత్మకమైనది. కావున నన్ను తెలియ లెకున్నది. నేను త్రిగుణాతీతుడను, నిర్వికారుడను.

దీపికా -: గుణమయైః = సత్త్వాదిగుణప్రచురైః, త్రిభిః = త్రివిధైః, ఏభిః = పూర్వోక్తైః, భావైః, ఇదం = దేవమనుష్యాద్యాత్మకం, సర్వం జగత్, మోహితం సత్, ఏభ్యః = భావేభ్యః, పరం = విప్రకృష్టం, ఏభి రస్పృష్టమితి యావత్, అవ్యయం = సదైకరూపం మాం, నాభిజానాతి = జ్ఞాతుం న శక్నోతి ॥ 13 ॥

శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ ; మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే ; మాయా మేతాం తరన్తి తే ॥ 14

టీ -: గుణమయీ = సత్త్వరజస్తమోగుణాత్మకయై; దైవీ = భగవంతుడనైన నాచే (లీలకై) సృజింపబడిన, ఏషా = ఈ; మమ =

నాయొక్క; మాయా=ప్రకృతి; దురత్యయా హి=అతిక్రమింపశక్యము కానిది కదా. యే=ఎవరు; మాం+ఏవ=నన్నే; ప్రపద్యన్తే=శరణు పొందుదురో; తే=అట్టివారు; ఏతాం=ఈ; మాయాం = ప్రకృతిని; తరన్తి=దాటుచున్నారు.

తా -: సత్త్వరజస్తమోగుణాత్మకయైన ఈ ప్రకృతిని క్రీడార్థము భగవంతుడనైన నేనే సృజించితిని. (చిత్రవిచిత్రములైన కార్యములను చేయుటచే ప్రకృతి 'మాయ' అనబడుచున్నది.) నన్ను శరణుపొందిన వారు తప్ప ఇంకెవ్వరును దీనిని దాటలేరు.

దీపికా -: తర్హి త్వాం కే వా జానన్తీత్యత్రాహ (దైవీతి) గుణ మయీ = సత్త్వరజస్తమోమయీ, దైవీ - దైవేన - క్రీడాప్రవృత్తేన, మయైవ నిర్మితా ఏషా మమ మాయా=ప్రకృతిర్హి. దురత్యయా=దురతి క్రమా, తర్హి తద్విమోచనోపాయః క ఇత్యత్రాహ (మామేవేతి) యే మామేవ ప్రపద్యన్తే=శరణం వ్రజన్తి, తే ఏతాం = మదీయాం, మాయాం, తరన్తి=అతిక్రమ్య మామేవోపాసత ఇత్యర్థః ॥ 14 ॥

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।
మాయయాఽపహృతజ్ఞానాః ఆసురం భావ మాశ్రితాః ॥ 15

టీ -: మూఢాః=నా స్వరూపమును ఎఱుగనివారును; నర+అధ మాః=ప్రాకృతభోగములయందే ఆసక్తిగలవారును; మాయయా=నా స్వరూదికములను తెలిసినను యుక్త్యాభాసములచే; అపహృతజ్ఞానాః= ఆ జ్ఞానము నశించినట్టివారును; ఆసురం భావం=అసురస్వభావమును; ఆశ్రితాః = పొందినవారును అయిన; దుష్కృతినః=పాపకర్ములు; మాం=నన్ను; న ప్రపద్యన్తే= సేవింపరు.

తా -: పాపాత్ములు నన్ను సేవింపరు. వారు నాలుగువిధములుగ నుందురు. 1. నా స్వరూపమును ఎఱుగనివారు 2. ఎఱిగియు అందు

అసక్తి లేక ప్రాకృతభోగములయందే అసక్తులైనవారు, 3. యుక్త్యాభాస ములచే పరమాత్మవిషయకజ్ఞానమును పోగొట్టుకొనినవారు 4. పరమాత్మ యొక్క గుణవిభూత్యాదులను తెలిసికొని ద్వేషించువారు. వీరిలో ఉత్త రోత్తరము మరింత పాపిష్ఠులు.

దీపికా-: ఏవంవిధాం భగవత్ప్రపత్తిం సర్వేఽపి కిమితి న కుర్వత ఇత్యత్రాహ (న మామితి) దుష్కృతినః=పాపకర్మాణః; అత ఏవ, మూఢాః=అవిదితమత్స్వరూపాః, నరాధమాః = తతోపిదుష్కృతాధి క్యేనమత్స్వరూపాపరిజ్ఞానాత్ ప్రాకృతేష్వేవ భోగేషు సక్తాః పురుషా పశదాః, మాయయాపహృతజ్ఞానాః = సామాన్యతో మత్స్వరూపజ్ఞానే జాతేపి పూర్వేభ్యో దుష్కృతాతిశయాద్యుక్త్యాభాసరూపయా మాయయా నష్టమద్విషయజ్ఞానాః, అసురం=అసురసంబంధినం, భావం=స్వభా వం, ఆశ్రితాః = పూర్వేభ్యోపి దుష్కృతాతిశయాన్మద్విషయం మదై శ్వర్యవిషయం చ జ్ఞానం యేషాం మయి ద్వేషాయైవ భవతి త అసుర స్వభావా ఇత్యర్థః, ఏతే చత్వారః మాం న ప్రపద్యంతే ॥ 15 ॥

శ్లో॥ చతుర్విధా భజన్తే మాం; జనాస్సుకృతినోఽర్జున ,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ; జ్ఞానీ చ భరతర్షభ ॥ 16

టీ -: భరత + ఋషభ=భరతశ్రేష్ఠుడవైన; అర్జున=ఓ అర్జున; ఆర్తః=నశించిన ఐశ్వర్యమును మరల పొందగోరువాడు; అర్థ + అర్థీ= లేని ఐశ్వర్యమును కోరువాడు; జిజ్ఞాసుః = కేవలము ఆత్మప్రాప్తిని (కైవల్యమును) కోరువాడు; జ్ఞానీ చ=సర్వశేషినైన నన్ను పొందగోరు వాడును అను; చతుర్విధాః=నాలుగు విధములైన; సుకృతినః=పుణ్య శీలురు; మాం=నన్ను; భజన్తే= సేవింతురు.

తా - అర్జున పుణ్యాత్ములు నన్ను సేవింతురు. వారు నాలుగు విధముల నుందురు. 1. పోయిన ఐశ్వర్యమును మరల పొందగోరు వాడు 2, క్రొత్త ఐశ్వర్యమును కోరువాడు 3. కేవలాత్మానుభూతిరూప

మైన కైవల్యమును కోరువాడు 4. నేను సర్వశేషి నని తెలిసి నన్ను పొందగోరువాడు. వీరిలో ఉత్తరోత్తరము పుణ్యతములు.

దీపికా -: హే భరతర్షభ=భరతశ్రేష్ఠ అర్జున, సుకృతినః=పుణ్యకర్మాణః, చతుర్విధాః = సుకృతతారతమ్యేనోత్తరోత్తర మధికతయా చతుఃప్రకారాః, జనాః, మాం = మామేవ, భజంతే=శరణవరణ పూర్వక ముపాసతే, తానేవ చతుఃప్రకారా నాహ, ఆర్తః=నష్టైశ్వర్యః; అర్థాఽర్థీ=అప్రాప్తైశ్వర్య స్తత్ప్రాప్తికామః, జిజ్ఞాసుః=ప్రకృతివియుక్త జ్ఞానైకస్వరూప కేవలాత్మ ప్రాప్తీచ్ఛుః, జ్ఞానీ=మచ్ఛేషతైకరసాత్మస్వరూపజ్ఞానవత్తయా మత్ప్రాప్తికామశ్చ ॥ 16 ॥

శ్లో॥ *తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే ।*
*ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః ॥* 17

టీ -: తేషాం=(పై నాలుగు విధముల నుండు) ఆ పుణ్యశీలురలో; నిత్యయుక్తః=నాతో నిత్యసంబంధము కలవాడు; ఏకభక్తిః=నా ఒక్కనియందే భక్తి గలవాడు అయిన; జ్ఞానీ=జ్ఞాని; విశిష్యతే=విశిష్టుడగుచున్నాడు; అహం=నేను; జ్ఞానినః=జ్ఞానికి; అత్యర్థం=మిక్కిలి; ప్రియః+హి=ఇష్టుడనుగదా; సః+చ=ఆ జ్ఞానియు; మమ=నాకు; అత్యర్థం=మిక్కిలి; ప్రియః=ఇష్టుడు.

తా -: నన్ను ఆశ్రయించువారిలో జ్ఞాని సర్వశ్రేష్ఠుడు. తక్కిన వారు ఫలప్రాప్తిపర్యంతము మాత్రమే నన్ను ఆశ్రయించి యుందురు. వారికి వారు కోరు ఫలముమీద;దానిని ఇచ్చునట్టి నామీద భక్తిసమానము. కాని జ్ఞాని నన్ను విడిచి ఒక్క క్షణమైనను ఉండలేడు. అతడు నన్ను తప్ప మరి దేనిని పొందగోరడు. కావున జ్ఞానికి నేను మిక్కిలి ప్రియమైనవాడను. అతడును నాకు అత్యంతప్రీతిపాత్రుడు.

దీపికా -: తేషాం మధ్యే జ్ఞానీ శ్రేష్ఠ ఇత్యాహ (తేషామితి) నిత్య యుక్తః=మయా నిత్యయోగవాన్, ఇతరేషాం తు స్వాభీష్టప్రాప్తిపర్యంత మేవ మయా యోగ ఇతి భావః, ఏకభక్తిః=ఏకస్మిన్=మయ్యేవ, భక్తి ర్యస్య స తథోక్తః, ఇతరేషాం తు స్వాభీష్టవస్తుని తత్సాధనభూతే మయి చ తద్భక్తిరిత్యర్థః, జ్ఞానీ, తేషాం=పూర్వోక్తానాం చతుర్ణాం మధ్యే, విశిష్యతే=అతిశేతే, కిం చ అహం జ్ఞానినః అత్యర్థం - అర్థః=అభిధేయః, తమతిక్రాంతం యథా భవతి తథా, ప్రియః = ప్రీతివిషయః, తస్య మద్విషయప్రీతిః సర్వజ్ఞేన సర్వశక్తినా మయాపి పరిచ్ఛిద్యాఽభిధాతుం న శక్యత ఇత్యర్థ ప్రియః ॥ 17 ॥

శ్లో॥ *ఉదారాస్సర్వ ఏవైతే; జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,*
*ఆస్థిత స్సహి యుక్తాత్మా; మామేవానుత్తమాం గతిమ్ ॥* 18

టీ -: ఏతే=ఈ; సర్వే=అందరు; ఉదారాః + ఏవ=వదాన్యులే; జ్ఞానీ తు=జ్ఞాని యన్ననో; మే=నాకు; ఆత్మా + ఏవ = ఆత్మయే (అని) మతం=అభిమతము; సః = ఆ జ్ఞాని; యుక్త+ఆత్మా = నాయందే లగ్నమైన మనస్సుగలవాడై; మాం+ఏవ = నన్నే; అనుత్తమాం= సర్వోత్తమమైన; గతిం=ప్రాప్యముగ; ఆస్థితః+హి = ఆశ్రయించిన వాడు గదా.

తా -: అర్తుడు అర్థార్థి జిజ్ఞాసువు జ్ఞాని అను ఈ నలుగురు నా నుండి ఫలమును గ్రహించినను; నా దృష్టిలో వీరు ప్రతిగ్రహీతలు కారు. వదాన్యులే యగుచున్నారు. నా సర్వకర్మసమారాధ్యత్వమును గుర్తించి దేవతాంతరముల నాశ్రయింపక నన్నే ఆశ్రయించి నా ఫలప్రదాతృత్వ వైభవమును చాటుచున్నారు గదా. వీరిలో జ్ఞాని నాకు ఆత్మ - అనగా ధారకుడు. నన్ను వీడి అతడు ధరింపనట్లే, నేనును అతనిని వీడి ధరింపజాలను. అతడు నన్నే సర్వస్వముగ భావించి ఆశ్రయించినట్టి వాడుగదా.

దీపికా -: ఏతే=పూర్వోక్తాః, సర్వే = ఆర్తప్రముఖాశ్చత్వారః, ఉదారాః = మమ వదాన్యా ఏవ, యే మత్సకాశాద్యత్కించిదపి గృహ్ణన్తి=తే హి మమ సర్వస్వదాయిన ఇతి భావః, జ్ఞానీతు. మే= మమ, ఆత్మైవ=ధారక ఏవ, తదాయత్తధారణోఽహ మిత్యర్థః, ఇతి మే, మతం=మతిః, ఏవమ్మన్యే ఇత్యర్థః, హి = యస్మాత్కారణాత్, సః=జ్ఞానీ, యుక్తాత్మా - యుక్తః=మదేకాయత్తస్థితిః, ఆత్మా=స్వరూపం యస్య స తథోక్తః, అత ఏవ మామేవ, అనుత్తమాం=న విద్యతే ఉత్తమా గతిర్యస్యాస్తాం, పరమా మిత్యర్థః, గతిం=ప్రాప్యం, ఆస్థితః= ఆశ్రితః, అతస్సోపి మమాత్మేతి భావః ॥ 18 ॥

శ్లో॥ *బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।*
*వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥* 19

టీ -: బహూనాం=అనేకములైన; జన్మనాం = ఉత్తమజన్మల యొక్క; అంతే=చివర; జ్ఞానవాన్="నా స్వరూపస్థితిప్రవృత్తులు భగవదాయత్తములు; ఆతడు అనన్తకళ్యాణగుణాకరు డగుటచే సర్వస్మాత్పరుడు" అను జ్ఞానము కలవాడై; సర్వం = నాకు ప్రాప్యప్రాపకములు ధారకపోషకములు అన్నియును; వాసుదేవః=వాసుదేవుడే; ఇతి=అని; మాం=నన్ను; ప్రపద్యతే=ఉపాసించును; సః = అట్టి; మహాత్మా= మహనీయుడు; సుదుర్లభః=మిక్కిలి దుర్లభుడు.

తా -: తన భగవదేకశేషత్వమును భగవంతుని సర్వస్మాత్పరత్వమును అనేకజన్మల తర్వాత తెలిసికొనగలిగి తనకు సర్వము వాసుదేవుడే అని నిశ్చయించుకొని నన్ను ఉపాసించువాడు పై అందరిలోను మహనీయుడు - అట్టివాడు దుర్లభుడు. అనేకజన్మలపుణ్యమువలన గాని ఈ స్థితికి రాలేడని భావము.

దీపికా -: బహూనాం=భూయసాం, జన్మనాం=పుణ్యజన్మనాం, అంతే=అవసానే, జ్ఞానవాన్ = అహం వాసుదేవశేషతైకరసస్తదాయత్త

స్వరూపస్థితిప్రవృత్తికః, నచాఽసంఖ్యేయకల్యాణగుణాకారతయా సర్వస్మాత్పరః ఇత్యేవం రూపజ్ఞానసంపన్నో భూత్వా, సర్వం = పరమం ప్రాప్యప్రాపకం అన్యదపి యన్మనీషితం తత్సర్వం చ, వాసుదేవః = వసుదేవకులేఽవతీర్ణ స్సర్వాత్మకో భగవానేవ ఇతి, మాం ప్రపద్యతే = ఉపాస్తే, సః, మహాత్మా = మహామనాః, సుదుర్లభః = లోకేఽత్యంత దుర్లభః ॥ 19 ॥

శ్లో॥ కామై స్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః।
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా॥ 20

టీ -: స్వయా = తమదైన; ప్రకృత్యా = కర్మవాసనతో; నియతాః = కూడినవారై; తైః + తైః = ఆయా; కామైః = కోరికలచేత; (కార్యవిషయములచే) హృతజ్ఞానాః = అపహరింపబడిన భగవత్స్వరూపవిషయక జ్ఞానముకలవారై; అన్యదేవతాః = ఇతరదేవతలను; తం తం = ఆయా దేవతలకు సంబంధించిన; నియమం = నియమములను; ఆస్థాయ = ఆశ్రయించి; ప్రపద్యన్తే = సేవించుచున్నారు.

తా -: పూర్వకర్మ వాసనాఽనుగుణముగ ప్రాకృతవిషయములను కోరి నన్ను గుర్తింపలేని సామాన్యమానవులు అనేక నియమములతో దేవతాంతరములను ఆశ్రయించుచున్నారు.

దీపికా -: జ్ఞానినో దుర్లభత్వమేవోపపాదయతి (కామైరితి) సర్వే లౌకికాః పురుషాః, స్వయా = స్వకీయయా, ప్రకృత్యా = వాసనయా, నియతాః = నిత్యమన్వితాః, తైస్తైః = స్వవాసనాఽనుగుణైః, కామైః = కామ్యమానై ర్విషయైరేవ, హృతం = అపహృతం ప్రతిబద్ధం, జ్ఞానం = మత్స్వరూపవిషయం, యేషాం తే తథోక్తాస్సంతః, అన్యదేవతాః = మద్వ్యతిరిక్తాః కేవలేంద్రాదిదేవతాః, తం తం నియమం = తత్తద్దేవతావిశేషమాత్రప్రీణనాఽసాధారణం నియమం, ఆస్థాయ = ఆశ్రిత్య, ప్రపద్యంతే = తత్తత్కామసిద్ధ్యర్థ మారాధయంతి ॥ 20 ॥

శ్లో॥ యోయో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి ।
తస్యతస్యాఽచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥ 21

టీ -: యః యః = ఎవడెవడు; యాం యాం = ఏయే; తనుం = ఇంద్రాదిరూపమైన నా శరీరమును; భక్తః (సన్) = భక్తి గలవాడై; శ్రద్ధయా = ఆస్తిక్యబుద్ధితో; అర్చితుం = ఆరాధించుటకు; ఇచ్ఛతి = కోరునో; తస్య తస్య = ఆయా (దేవతా) భక్తునికి; అహం = నేను; తాం శ్రద్ధాం + ఏవ = అ శ్రద్ధనే; అచలాం = నిర్విఘ్నమైనదానినిగా; విదధామి = చేయుదును.

తా -: చేతనాఽచేతనములు నాకు శరీరము. కావున ఇంద్రాది దేవతలు నాకు శరీరభూతులు - వారిని శ్రద్ధగా ఆరాధింపగోరువారికి ఆ శ్రద్ధ నిర్విఘ్నముగ నుండునట్లు గావింతును.

దీపికా -: యోయః పురుషః =, సర్వా దేవతా మదీయా స్తనవ ఇత్యజానన్నపీత్యర్థః, యాం యాం తనుం = ఇంద్రాదిరూపాం మదీయాం తనుం, భక్తః = భక్తియుక్తస్సన్, శ్రద్ధయా = ఆస్తిక్యబుద్ధ్యా, అర్చితుం = ఆరాధయితుం, ఇచ్ఛతి, తస్య తస్య అజానతోపి పురుషస్య, అహం = మత్తనువిషయా హ్యేషా మియం శ్రద్ధేతి జానన్నహం, తామేవ = తత్తను విషయామేవ, శ్రద్ధాం, అచలాం = నిర్విఘ్నాం, విదధామి = కరోమి॥21॥

శ్లో॥ సతయా శ్రద్ధయా యుక్తః తస్యాఽరాధన మీహతే ।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ॥ 22

టీ -: సః = ఆ దేవతాంతరభక్తుడు; తయా = ఆ; శ్రద్ధయా = శ్రద్ధతో; యుక్తః = కూడినవాడై; తస్య = ఆ ఇంద్రాదిదేవతకు; ఆరాధనం = ఆరాధనమును; ఈహతే = చేయగోరుచున్నాడు; తతః = ఆ ఆరాధనవలన; మయా + ఏవ = నాచేతనే; విహితాన్ = ఇవ్వబడిన; తాన్

కామాన్=ఆ కోరికలను; (కోరిన విషయములను) లభతే = పొందుచున్నాడు.

తా -: వివిధఫలములను కోరి శ్రద్ధతో దేవతాంతరములను ఆరాధించిన, అట్టి దేవతాంతరభక్తులకును ఫలప్రదాతను నేనే.

దీపికా - సః=పురుషః, తయా=నిర్విఘ్నీకృతయా శ్రద్ధయా, యుక్తస్సన్, తస్య=మత్తనుభూతస్యేంద్రాదేః, ఆరాధనం=అర్చనం ప్రతి, ఈహతే=చేష్టతే, అనుతిష్ఠతీత్యర్థః, తతః=మత్తనుభూతేంద్రాది దేవతారాధనాత్, మయైవ = మత్తనుభూతేంద్రాదిదేవతారాధనమపి వస్తుతో మదారాధనమేవేతి మన్వానేన తదన్తర్యామిణా మయైవ, విహితాన్=వితీర్ణాన్, తాన్=స్వాభిలషితాన్, కామాన్, లభతే = ప్రాప్నోతి, హేతి ప్రసిద్ధౌ, అయమర్థశ్శాస్త్రేషు ప్రసిద్ధ ఇత్యర్థః ॥ 22 ॥

శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం; తద్భవత్యల్ప మేధసామ్,
దేవాన్దేవయజో యాన్తి; మద్భక్తా యాన్తి మా మపి॥ 23

టీ -: అల్పమేధసాం=అల్పజ్ఞులైన; తేషాం=ఆ ఇంద్రాదిదేవతారాధకులకు; తత్ = ఆ; ఫలంతు=ఫలముమాత్రము; అంతవత్=నాశముకలదిగ; భవతి=అగుచున్నది; దేవయజః = ఇంద్రాదిదేవతాంతర - ఆరాధకులు; దేవాన్ = దేవతలను; యాన్తి = పొందుచున్నారు; మత్+భక్తాః+అపి=నాభక్తులును; మాం=నన్ను; యాన్తి=పొందుచున్నారు.

తా -: ఇంద్రాదిదేవతలను ఆరాధించినను వారియందు అంతర్యామిగ ఉన్న నన్ను ఆరాధించినట్లే యగును. ఫలప్రదాతను కూడ నేనే. కాని ఈ విషయము తెలియనందున వారు అల్పజ్ఞులు అగుచున్నారు. వారు పొందుఫలితము సైతము నశ్వరమే యగుచున్నది. నా సర్వాంతర్యామిత్వము నెఱిగి నన్నే ఆరాధించు ప్రాజ్ఞులు అనశ్వరమగు నా సాధర్మ్యమును పొందుచున్నారు.

ఇచట "ఏవం సమానేపి అయాసే మామేవ న ప్రపద్యన్తే అనన్త ఫలాయ; అహో ఖలు కష్టతరం వర్తత ఇతి అనుక్రోశం దర్శయతి భగవాన్" అను శ్రీశంకరభగవత్పాదభాష్యపంక్తిని అనుసంధించునది.

దీపికా : కింతు = తేషాం, అల్పమేధసాం = అల్పబుద్ధీనాం, ఇంద్రాదిమాత్ర యాజినా మిత్యర్థః, తత్=ఆరాధనజనితం ఫలం, అంతవత్ = నాశవత్ భవతి, కుత ఇత్యత్రాహ (దేవానితి) దేవాన్= ఇంద్రాదీన్, యజంతి=పూజయంతీతి దేవయజః-తే, దేవాన్ యాంతి= దేవతాసాయుజ్యం ప్రాప్నువంతి. ఇంద్రాదిభోగాః ఖలు పరిమితకాల వర్తినః; అతస్తత్సాయుజ్యం ప్రాప్తా స్తైస్సహ ప్రచ్యవంత ఇతి భావః, మద్భక్తా అపి మాం, యాంతి=ప్రాప్నువంతి, తేషాం కర్మణాం మదా రాధనరూపతాం జ్ఞాత్వా అల్పాస్థిరఫలసంగత్యాగపూర్వకం మత్ప్రీణనైక ప్రయోజనకతయా అనుష్ఠానాదితి భావః ॥ 23 ॥

శ్లో॥ *అవ్యక్తం వ్యక్తి మాపన్నం; మన్యన్తే మా మబుద్ధయః ।*
*పరం భావ మజానన్తో; మమాఽవ్యయ మనుత్తమమ్ ॥* 24

టీ -: అబుద్ధయః=ఇట్టి నన్ను ఎఱుగని అజ్ఞానులు; అవ్యయం= నిత్యము; అనుత్తమం=సర్వోత్కృష్టము అయిన; మమ=నాయొక్క; పరం భావం=అప్రాకృతస్వభావమును; అజానంతః = ఎఱుగనివారై; మాం=నన్ను; అవ్యక్తం=ఇంతకుముందు తెలియ బడక; వ్యక్తిం+ ఆపన్నం=ఇపుడే అభివ్యక్తిని పొందినవానినిగ; మన్యన్తే = తలంచు చున్నారు.

తా -: నేను సర్వాంతర్యామిని. సర్వకర్మసమారాధ్యుడను. సర్వే శ్వరుడను. ఇట్టి నా స్వభావము నిత్యము సర్వోత్కృష్టము అప్రాకృతము నైయున్నది. దీని నెఱుగని అల్పజ్ఞులు ఇంతకు మునుపు, లేక ఇపుడే జన్మించినవానినిగ తలంచుచున్నారు.

దీపికా -: ఇతరే సర్వసమాశ్రయణీయత్వాయ మమ మనుష్యాది ష్వవతార, మప్యకించిత్కరం కుర్వంతీత్యాహ (అవ్యక్తమితి) అబుద్ధయః = మద్విషయబుద్ధిశూన్యాః, అవ్యయం = సతతైకరూపం, అనుత్తమం = సర్వస్మాదుత్కృష్టం, పరం = అప్రాకృతం, మమ, భావం = స్వభావం, అజానంతస్సంతః, మాం, అవ్యక్తం = ఇతఃపూర్వ మనభివ్యక్తం, వ్యక్తి మాపన్నం = ఇదానీం కర్మవిశేషా జ్జన్మవిశేషం ప్రాప్యాఽభివ్యక్తి మాపన్నం, మన్యంతే = అవబుధ్యంతే, అతో మాం న కర్మభి రారాధయంతీతి భావః ॥ 24 ॥

శ్లో॥ నాఽహం ప్రకాశస్సర్వస్య; యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాఽభిజానాతి; లోకో మా మజమవ్యయమ్ ॥ 25

టీ -: యోగమాయాసమావృతః = దేవమనుష్యాది శరీరముల సంబంధమనెడి మాయచే అవరింపబడిన; అహం = నేను; సర్వస్య = అందఱకును; నప్రకాశః = స్పష్టముగభాసింపను. అందువలన; మూఢః = మోహముజెందిన; అయంలోకః = ఈజనము; అజం = పుట్టుకలేనివాడను; అవ్యయం = నాశరహితుడనుఅయిన మాం = నన్ను; న + అభిజానాతి = ఎఱుగదు.

తా :- నేను రామకృష్ణాద్యవతారములయందు మనుష్యాది శరీరములను ధరించుటవలన "అంతమాత్రమేనేను" అని తలంచి మోహితులైన పామరులు నా స్వరూపమును చక్కగ గుర్తింపలేరు. నేను ఉత్పత్తి వినాశరహితుడను.

దీపికా -: కుత ఏవం న ప్రకాశస ఇత్యత ఆహ (నాఽహమితి) యోగమాయాసమావృతః - యోగః = దేవమనుష్యాదిసమానసంస్థానశరీరస్యయోగః, స ఏవ మాయా, తయా, సమావృతః = అచ్ఛాదిత స్వరూపః, అహం, సర్వస్య = జనస్య. న ప్రకాశః = స్ఫుటో న భవామి, అతః, మూఢః = అజ్ఞః, అయం, లోకః = జనః, అజం = ఉత్పత్తిరహితం, అవ్యయం = నాశరహితం చ, మాం, నాభిజానాతి = న వేత్తి ॥ 25 ॥

శ్లో॥ వేదాఽహం సమతీతాని; వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26

టీ -: హే అర్జున = ఓ అర్జునా; సమతీతాని = కడచిన; వర్తమానాని చ = జరుగుచున్న; భవిష్యాణి చ = జరుగనున్న; భూతాని = ప్రాణులను; అహం = నేను; వేద = ఎఱుగుదును; మాం తు = (కాని) నన్ను; కశ్చన = ఎవ్వడును; న వేద = ఎరుగడు.

తా -: అర్జున; భూతభవిషద్వర్తమాన కాలములయందలి సకల ప్రాణులను నే నెఱుగుదును. కాని నన్ను మాత్రము ఎవ్వరును ఎఱుగరు. నేను రామకృష్ణాదిరూపములతో అవతరించినను నా స్వరూప స్వభావములు మారవు. ఈ తత్త్వము తెలియగల జ్ఞాని దుర్లభుడు.

దీపికా -: హే అర్జున, సమతీతాని = అతిక్రాంతాని, వర్తమానాని = ఇదానీం విద్యమానాని, భవిష్యాణి = అనాగతాని చ, సర్వాణి, భూతాని అహం, వేద = జానామి, మాం తు, కశ్చన = కాలత్రయవర్తిము భూతేషు కశ్చిదపి, న వేద = సర్వస్మాత్పరస్సర్వసమాశ్రయణీయత్వాయ అజహత్స్వభావ ఏవాఽవతీర్ణ ఇతి న జానాతి, అతో జ్ఞానీ దుర్లభ ఇతి భావః ॥ 26 ॥

శ్లో॥ ఇచ్ఛాద్వేషసముత్థేన; ద్వంద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం; సర్గే యాన్తి పరన్తప ॥ 27

టీ -: పరంతప -: శత్రుసంతాపకుడవైన; హే భారత = ఓ అర్జున; సర్వభూతాని = సకలప్రాణులు; ఇచ్ఛాద్వేషసముత్థేన = రాగద్వేషములతో ఏర్పడిన; ద్వంద్వమోహేన = శీతోష్ణాదిద్వంద్వములనెడి మోహకారణములచే; సర్గే = పుట్టినపుడే; సమ్మోహం = మోహమును; యాన్తి = పొందుచున్నవి.

తా -: అర్జున; ప్రాణులు పుట్టునపుడే పూర్వజన్మవాసనలనుబట్టి రాగద్వేషములకు విషయములగు శీతోష్ణాదిద్వంద్వములచే మోహితము లగుచున్నవి. కావున నా సంశ్లేషమున సుఖమును నా విశ్లేషమున దుఃఖమును పొందు జ్ఞాని దుర్లభుడు.

దీపికా -: హే పరంతప! హే భారత! సర్వభూతాని, ఇచ్ఛాద్వేష సముత్థేన = ఇచ్ఛాద్వేషౌ - పూర్వస్మిన్ జన్మన్యనుకూలప్రతికూలరూప ద్వంద్వవిషయతయా అభ్యస్తౌ రాగద్వేషౌ, తాభ్యాం, సముత్థేన = సము త్పన్నేన, ద్వంద్వమోహేన=ముహ్యత్యనేనేతి మోహః - మోహహేతుః, తేన=శీతోష్ణాదిద్వంద్వరూపేణ మోహేన, సర్గే=జన్మకాల ఏవ, సమ్మో హం=పూర్వజన్మానుభూతసజాతీయ ద్వంద్వవిషయ రాగద్వేష స్వభావ రూపం, యాంతి=పూర్వవాసనావశా దితి భావః, జ్ఞానీ తు మత్సంశ్లేష విశ్లేషరూప సుఖదుఃఖవిషయరాగద్వేషవానితి తాత్పర్యమ్ ॥ 27 ॥

శ్లో॥ *యేషాం త్వన్తగతం పాపం; జనానాం పుణ్యకర్మణామ్ ।*
*తే ద్వంద్వమోహనిర్ముక్తా; భజన్తే మాం దృఢవ్రతాః ॥* 28

టీ -: పుణ్యకర్మణాం = పుణ్యకార్యములను చేసిన; యేషాం జనానాం+తు=ఏ జనులయొక్క; పాపం=పాపము; అంతగతం= అంతమును (నాశమును) పొందినదో; తే=అట్టివారు; ద్వంద్వమోహ నిర్ముక్తాః = సుఖదుఃఖాదిద్వంద్వములనెడి మోహమునుండి; వినిర్ము క్తాః=విడపింపబడినవారు; దృఢవ్రతాః=దృఢసంకల్పము గలవారునై; మాం=నన్ను; భజన్తే=సేవించుచున్నారు.

తా -: అనేకజన్మార్జితపుణ్యవశమున భగవదాశ్రయణవిరోధులైన పాపములు నశింపగా శీతోష్ణాదిద్వంద్వములవలని మోహమును వీడి వారి వారి సుకృతమునుబట్టి దృఢసంకల్పము కలిగి ఐశ్వర్యకైవల్యాదు లను కోరి కొందరు నన్ను ఆశ్రయించుచున్నారు.

దీపికా -: కథం తర్హి కేచన త్వామేవ భజంతే దృశ్యంత ఇత్యా ప్రాహ (యేషా మితి) పుణ్యకర్మణాం=అనేకజన్మార్జితోత్కృష్ట పుణ్య వతాం యేషాం తు, జనానాం, పాపం=గుణమయ ద్వంద్వోచ్ఛేద్వేష హేతుభూతం మదెన్ముఖ్యవిరోధి చానాదికాలప్రవృత్తం పాతకం, అంత గతం - అంతం=నాశం, గతం=ప్రాప్తం, తే=జనాః, ద్వంద్వమోహ నిర్ముక్తాః = మత్ప్రపదనేన గుణమయద్వంద్వరూపాన్మోహాద్వినిర్ముక్తాః, దృఢవ్రతాః=దృఢసంకల్పాస్సంతః, మామేవ, భజంతే=సుకృతతార తమ్యాత్ యథాధికార ముపాసత ఇత్యర్థః ॥ 28 ॥

శ్లో॥ జరామరణమోక్షాయ; మా మాశ్రిత్య యతన్తి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం; అధ్యాత్మం కర్మ చాఽఖిలమ్॥29

టీ -: యే=ఎవరు; జరామరణమోక్షాయ = జరామరణరహిత మైన ఆత్మదర్శనముకొఱకు; మాం=నన్ను; ఆశ్రిత్య = ఆశ్రయించి; యతంతి=ప్రయత్నింతురో; తే=అట్టివారు; తత్ బ్రహ్మ = ఆబ్రహ్మ మును; కృత్స్నం = సమగ్రమైన; అధ్యాత్మం = అధ్యాత్మమును; అఖిలం=సమస్తమైన; కర్మ చ=కర్మమును; విదుః = ఎఱుగుదురు.

తా -: ప్రకృతిసంబంధమును వీడి ఆత్మదర్శనము గోరి నన్ను ఆశ్రయించువారు ఆ బ్రహ్మమును సమగ్రమగు అధ్యాత్మమును సమస్త కర్మలను ఎఱుగుదురు. కేవలాత్మానుభవకాముడు ఈ మూడింటిని తప్పక తెలిసికొనవలయును.

దీపికా -: అథ త్రయాణామపి భగవంతం భజమానానాం జ్ఞాతవ్య విశేషా నుపాదేయాంశ్చ ప్రస్తౌతి - "జరామరణే" త్యాది శ్లోకద్వయేన యే=జనాః, జరామరణమోక్షాయ=జరామరణయోః ప్రకృతిసంబంధ నిమిత్తకయోః, మోక్షః=సవాసననివృత్తిః, తస్మై = తత్పూర్వకాత్మ స్వరూపాయేత్యర్థః. మాం, ఆశ్రిత్య = ప్రపద్య, యతంతి = యత్నం కుర్వన్తి, తే, తద్బ్రహ్మ, కృత్స్నమధ్యాత్మం, అఖిలం కర్మ చ,

విదుః = జానీయుః, ఏతత్త్రియమపి కేవలాత్మానుభవ కామస్యావశ్యం జ్ఞాతవ్యమితి భావః ॥ 29 ॥

శ్లో॥ *సాఽధిభూతాఽధిదైవం మాం; సాఽధియజ్ఞం చ యే విదుః ।*
*ప్రయాణకాలేఽపి చ మాం; తే విదుర్యుక్తచేతసః ॥* 30

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విజ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః.

టీ -: యే = ఎవరు; మాం = నన్ను; సాఽధిభూత + అధిదైవం = అధిభూతముతోను అధిదైవముతోనుకూడినవానినిగను; సాధియజ్ఞం = అధియజ్ఞముతోకూడినవానినిగను; విదుః = తెలిసికొందురో; తేచ = అట్టివారును; ప్రయాణకాలే అపి = ప్రాణప్రయాణ సమయమునందును; యుక్తచేతసః = నాయందే లగ్నమైన మనస్సుగలవారై; మాం = నన్ను; విదుః = ఎఱుగవలయును.

తా -: ఐశ్వర్యార్థులు నన్ను అధిభూత - అధిదైవ - అధియజ్ఞముగ తెలిసికొనవలయును. కైవల్యార్థులు జ్ఞానులు (మోక్షార్థులు) అధియజ్ఞముగ నన్ను తెలిసికొనవలయును - వీరందరు ప్రాణముపోవు సమయమున వారివారి లక్ష్యము ననుసరించి నన్ను స్మరింపవలయును.

దీపికా -: ఏవ మాత్మప్రాప్తికామస్య జ్ఞాతవ్య ముక్త్వా, అథైశ్వర్యార్థినో జ్ఞాతవ్యం త్రయాణా మప్యుపాదేయం చాహ (సాఽధిభూతాఽధిదైవ మితి) యేఽపి = ఐశ్వర్యార్థినః, సాఽధిభూతాఽధిదైవం = అధిభూఽతాధిదైవాభ్యాం సహితం, మాం విదుః, ఐశ్వర్యార్థినా మేవం భూతోఽహం జ్ఞాతవ్య ఇత్యర్థః, తథా, సాఽధియజ్ఞం = అధియజ్ఞసహితం, మాం విదుః; ఇద మైశ్వర్యార్థిన ముద్దిశ్య విధీయమాన మప్యర్థస్వాభావ్యాత్త్రియాణామపి సాధారణం, త్రయాణాం సమవిహిత నిత్యనైమిత్తికరూప

మహాయజ్ఞాద్యనుష్ఠాన మవర్జనీయం, తే చ, ప్రయాణకాలే = చరమ ప్రయాణసమయేఽపి, యుక్తచేతసః = మదాసక్తమనసస్సంతః, మాం, విదుః = స్వప్రాప్త్యనుగుణం జానీయు రిత్యర్థః, తే చేతి చకారాత్ = జరా మరణమోక్షాయ యతమానా అపి ప్రయాణకాలే మాంవిదురితి సముచ్చీయతే, అనేనార్థస్వభావపర్యాలోచనయా జ్ఞానినోఽపి సాఽధి యజ్ఞం మాం విదుః = ప్రయాణకాలే మాం స్వప్రాప్త్యనుగుణం విదు రిత్యుక్తం భవతి ॥ 30 ॥

ఇతి శ్రీగీతాభాష్యార్థ సంగ్రహతాత్పర్యదీపే శ్రీవరవరముని విరచితాయాం బాలబోధిన్యాఖ్యాయాం గీతార్థసంగ్రహదీపికాయాం సప్తమోఽధ్యాయః ॥

—o—

శ్రీరస్తు

—— గీతార్థసంగ్రహః ——

శ్లో॥ స్వయాథాత్మ్యం ప్రకృత్యాఽస్యతిరోధి శ్శరణాగతిః।
భక్తభేదః ప్రబుద్ధస్య శ్రైష్ఠ్యం సప్తమ ఉచ్యతే॥

టీ -: స్వయాథాత్మ్యం = ఉపాస్యుడగు పరమపురుషునియొక్క సర్వశేషిత్వాదిరూపమైన వాస్తవస్వరూపము; ప్రకృత్యా = ప్రకృతిచేత; అస్య = ఈ స్వరూపమునకు; తిరోధిః = తిరోధానము; శరణాగతిః = అది తొలగుటకై చేయు శరణాగతి; భక్తభేదః = ఉపాసకులలో గల భేదము; ప్రబుద్ధస్య = జ్ఞానియొక్క; శ్రైష్ఠ్యం = శ్రేష్ఠత్వము; సప్తమే = సప్తమాధ్యాయమునందు; ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా -. సప్తమాధ్యాయమునందు పరమాత్మయొక్క సర్వశేషిత్వ- సర్వకారణత్వ - సర్వాధారత్వ - సర్వశరీరత్వ - సర్వశబ్దవాచ్యత్వ - నియంతృత్వ - పరతరత్వాదిరూపమైన వాస్తవస్వరూపము, దేహేంద్రి

యాదిరూప ప్రకృతిసంబంధముచే అది మనదృష్టిలో మరుగుపడియుం డుట; అది తొలగుటకై మనము చేయవలసిన శరణాగతి; ఐశ్వర్య - కైవల్య - మోక్షకామనలచే భక్తుల భేదములు, వారిలో మోక్షార్థియైన జ్ఞానియొక్క ఉత్తమత్వము చెప్పబడినవి.

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భగవద్గీతామృతము

## అష్టమాఽధ్యాయము — అక్షరపరబ్రహ్మయోగము.

అర్జున ఉవాచ —:

శ్లో॥ *కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం; కిం కర్మ పురుషోత్తమ ।*
*అధిభూతం చ కిం ప్రోక్త; మధిదైవం కి ముచ్యతే ॥* 1

శ్లో॥ *అధియజ్ఞః కథం కోఽత్ర; దేహేఽస్మిన్ మధుసూదన ।*
*ప్రయాణకాలే చ కథం; జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥* 2

టీ -: హే పురుష + ఉత్తమ = ఓ శ్రీకృష్ణా; తత్ + బ్రహ్మ = ఆ బ్రహ్మము; కిమ్ = ఎట్టిది?; అధ్యాత్మమ్ = అధ్యాత్మము; కిమ్ = ఎట్టిది?; కర్మచ = కర్మ మనగా; కిమ్ = ఎట్టిదిగ; ప్రోక్తమ్ = చెప్పబడినది?; అధిభూతమ్ = అధిభూతము; కిమ్ = ఎట్టిది?; అధిదైవమ్ = అధిదైవము; కిమ్ = ఏదిగా; ఉచ్యతే = చెప్పబడుచున్నది; మధుసూదన = ఓ శ్రీకృష్ణా!; అత్ర = ఈ శాస్త్రమునందు; అస్మిన్ దేహే = ఈదేహమున; అధియజ్ఞః = అధియజ్ఞుడు; కః = ఎవడు?; కథమ్ = అది ఎట్లు?; నియత + ఆత్మభిః = నియమింపబడిన మనస్సు కలవారిచే; ప్రయాణకాలే చ = ప్రాణ ప్రయాణసమయమునందు; కథం = ఎట్లు; జ్ఞేయః = తెలియదగినవాడవై; అసి = ఉన్నావు?.

తా -: అర్జున; కైవల్యార్థులు తెలియఁదగిన 'తద్బ్రహ్మ' మనగ నేమి?. అధ్యాత్మము అనగ నేమి?. కర్మ మనగ నేమి?. ఐశ్వర్యార్థులు ఎఱుంగదగిన అధిభూత మనగ నేమి?. అధిదైవ మనగనేమి?. మరియు అధియజ్ఞము అనగ నేమి?. అది ఈ దేహమునందు ఎట్లున్నది?. జితేంద్రియులచే ప్రాణము పోవు సమయమున నీవు ఎట్లు తెలియఁదగియున్నావు?.

దీపికా -: అష్టమేఽధ్యాయే పూర్వాధ్యాయ ప్రస్తుతా ప్రయాణాం జ్ఞాతవ్యోపాదేయభేదా వివిచ్యంతే. హే పురుషోత్తమ, జరామరణమోక్షాయ భవంతం ప్రపద్య యతమానానాం జ్ఞాతవ్యతయోక్తం 'తద్బ్రహ్మ' కిం. అధ్యాత్మం చ కిం?, కర్మ చ కిం, ఐశ్వర్యార్థినాం జ్ఞాతవ్యతయోక్తం, అధిభూతం కిం ప్రోక్తం, అధిదైవం చ కిముచ్యతే. హే మధుసూదన, అత్ర - అస్మిన్ శాస్త్రే - యోయో యాం యాం తనుమితి త్వయోక్తే, అస్మిన్ = పరిదృశ్యమానే, దేహే = ఇంద్రాదిరూపే, త్రయాణామపి జ్ఞాతవ్యతయోక్తః - అధియజ్ఞః, కః=కిం రూపః, కథం=కిం ప్రకారః, ప్రయాణకాలే=చరమ ప్రయాణసమయే చ, నియతాత్మభిః = నియతమానసైః త్రిభిః, కథం=కేన ప్రకారేణ, జ్ఞేయోఽసి = జ్ఞాతవ్యోఽసి ॥ 1, 2 ॥

శ్రీ భగవానువాచ—:

శ్లో॥ అక్షరం బ్రహ్మ పరమం; స్వభావోఽధ్యాత్మ ముచ్యతే ।
భూతభావోద్భవకరో; విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3

టీ -: బ్రహ్మ=బ్రహ్మ మనగా; పరమమ్ = ఉత్కృష్టమైన; అక్షరమ్=నాశము లేని; జీవస్వరూపము; స్వభావః=ప్రకృతి; అధ్యాత్మమ్=అధ్యాత్మ మని; ఉచ్యతే = చెప్పబడుచున్నది; భూతభావ+ఉద్భవకరః=దేవత్వ, మనుష్యత్వాదుల ఉత్పత్తిని కలిగించు; విసర్గః=శుక్రవిసర్జనము; కర్మసంజ్ఞితః='కర్మ' అని వ్యవహరింపబడుచున్నది.

తా -: బ్రహ్మ మనగా ప్రకృతిసంబంధమును వీడిన నిత్యమైన జీవస్వరూపము. అధ్యాత్మ మనగా స్వభావము (ప్రకృతి). కర్మ మనగా స్త్రీగర్భమున శుక్రమును విసర్జించుట. ఇది సమస్తప్రాణుల ఉత్పత్తికి మూలము. వీనిలో పరిశుద్ధాత్మస్వరూపము ప్రాప్యము. ప్రకృతి స్త్రీ సంగమము పరిత్యాజ్యములు.

దీపికా -: పరమం=ప్రకృతేః పరమం, న క్షరతీత్యక్షరం=ప్రత్యగాత్మ స్వరూపం, బ్రహ్మ=తద్బ్రహ్మేతి పూర్వం నిర్దిష్ట మిత్యర్థః, స్వభావః=ప్రకృతితద్వాసనాదికం, అధ్యాత్మం = కర్మవశాదాత్మని సంబధ్యమానతయాऽధ్యాత్మశబ్ద నిర్దిష్ట మిత్యర్థః, భూతభావోద్భవకరః=భూతభావః=దేవమనుష్యాదిభావః, తస్య, ఉద్భవకరః=ఉత్పత్తిహేతుః విసర్గః = "పంచమ్యామాహుతా వాపః పురుషవచసో భవంతీ"తి శ్రుత్యుక్తరీత్యా యోషాऽగ్నౌ రేతోరూపాయా ఆహుతేస్త్యాగః, కర్మసంజ్ఞితః - "కర్మ చాఖిల" మితి పూర్వం కర్మశబ్ద నిర్దిష్ట ఇత్యర్థః, ఏతత్ త్రితయమపి ముముక్షోః ప్రాప్యతయా పరిహరణీయతయా చ జ్ఞాతవ్య మిత్యర్థః ॥ 3 ॥

శ్లో॥ *అధిభూతం క్షరో భావః పురుషశ్చాऽధిదైవతమ్ ।*
*అధియజ్ఞోऽహ మేవాऽత్ర దేహే దేహభృతాం వర ॥* 4

టీ -: దేహభృతాం వర=దేహధారులలో శ్రేష్ఠుడవైన ఓ అర్జునా! అధిభూతమ్ = ఆకాశాది భూతములయందుండు శబ్దస్పర్శాదికము; క్షరః=నశ్వరమైన; భావః=స్వభావముకలది; పురుషః=జీవుడు; అధిదైవతమ్=ఇంద్రాదిదేవతలకంటె పైవాడు; అత్ర దేహే = ఈదేహమునందు; అహమ్+ఏవ=నేనే; అధియజ్ఞః = యజ్ఞములచే ఆరాధింపబడువాడను.

తా -: అర్జునా; అధిభూత మనగా ఆకాశాదిభూతములయందు ఉండు నశ్వరములైన శబ్దస్పర్శాదులు (భోగ్యములు). అధిదైవతమనగా

ఇంద్రాదుల నతిశయించియుండు జీవుడు (భోక్త). అధియజ్ఞము అనగా ఇంద్రాదులను శరీరముగజేసికొని యజ్ఞములచే ఆరాధింపబడు నేనే. నన్ను ఆశ్రయించువారు ఈ మూడింటిని తప్పక తెలియవలయును.

దీపికా ,: క్షరః=క్షరణస్వభావః. భావః=విలక్షణ సాశ్రయ శబ్ద స్పర్శరూపరసగంధరూపః పదార్థః, అధిభూతం=వియదాదిభూత సంబంధితయాఽధిభూత శబ్దనిర్దిష్టః, ఐశ్వర్యార్థినాం ప్రాప్యతయాఽవశ్యం జ్ఞాతవ్య ఇతి భావః, పురుషః=భోక్తృత్వావస్థాపన్నో జీవః, అధిదైవతం ఇంద్రప్రజాపతిప్రభృతి దైవతోపరివర్తమానతయాఽధిదైవత శబ్దనిర్దిష్టః ఇంద్రాదిదైవతోపరి వర్తమానత్వం చాస్య తద్భోగ్యభూతాదపి విలక్షణస్య శబ్దాదేః భోక్తృత్వాదితి బోధ్యం, భోక్తృత్వావస్థా చైశ్వర్యార్థినాం ప్రాప్య తయాఽనుసంధేయేతి భావః, దేహభృతాం = దేహధారిణాం మధ్యే, పర=శ్రేష్ఠ హే అర్జున, అత్ర=అస్మిన్నింద్రాదిరూపే, దేహే=మచ్ఛరీరే, విద్యమానః అహమేవ అధియజ్ఞః=యజ్ఞై రారాధ్యతయా వర్తమానత్వా దధియజ్ఞ శబ్దనిర్దిష్టః, "యజ్ఞో వై విష్ణురితి శ్రుతేః" అత్ర అహమేవాధి యజ్ఞ ఇత్యనేన యజ్ఞస్వరూప ప్రశ్నోత్తరముక్తం, అత్ర దేహేఽహమేవేత్యనేన కథ మధియజ్ఞ ఇతి ప్రకారప్రశ్నస్యాప్యుత్తర ముక్తం భవతి, భగవతో హి "స ఆత్మా, అంగా న్యన్యా దేవతాః" "తదేవాగ్నిస్తద్వాయుః" ఇత్యాది శ్రుత్యుక్తరీత్యా - "అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ" ఇత్యాది వక్ష్యమాణరీత్యా చాగ్నివాయ్వాది తత్తత్కర్మదేవతాంతర్యామితయాఽవస్థాయ మహాయజ్ఞాది సమస్తకర్మణా మారాధ్యతయా తత్ఫలప్రదతయా చాధియజ్ఞత్వ మిత్యనుసంధేయమ్, త్రయాణా మప్యధికారిణాం మహాయజ్ఞాది నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానవేళాయా మిద మనుసంధేయ మితి భావః ॥ 4 ॥

శ్లో॥ అన్తకాలే చ మామేవ; స్మరన్ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం; యాతి నాస్త్యత్ర సంశయః 5

టీ -: యః = ఎవడు; అంతకాలే = మరణసమయమున; మాం + ఏవ = నన్నే; స్మరన్ = స్మరించుచు; కళేబరమ్ = శరీరమును; ముక్త్వా = వదలిపెట్టి; ప్రయాతి = పోవుచున్నాడో; సః = వాడు; మత్ + భావం = నాస్వరూపమునే; యాతి = పొందుచున్నాడు; అత్ర = ఈ విషయమునందు; సంశయః = సందేహము; నాస్తి = లేదు.

తా -: ప్రాణప్రయాణసమయమున నన్నే స్మరించుచు శరీరత్యాగము చేయువాడు నా స్వరూపమును పొందుచున్నాడు. ఇందు సందేహము లేదు.

దీపికా -: ప్రయాణకాలే చ కథ మిత్యస్యోత్తర మాహ (అంతకాలే చేతి) యః = అధికారీ, అంతకాలే = శరీరావసానసమయే, మాం = సర్వశరీరితయా సర్వాత్మభూతం మాం స్మరన్ సన్నేవ, కళేవరం = శరీరం, ముక్త్వా = త్యక్త్వా, ప్రయాతి = గచ్ఛతి, సః మద్భావం = మత్స్వభావం, యాతి = ప్రాప్నోతి, అత్ర = అస్మిన్నంశే, సంశయః నాస్తి, అంతకాలే యదాకారం మా మనుసంధత్తే - తదాకారో భవతి, మృగరూపం మా మనుసంధాయ మృగాకారతయా సంభూతా ఆదిభరతాదయ ఏవాత్ర నిదర్శన మితి భావః, అతః ప్రయాణా మప్యధికారిణాం శరీరావసాన సమయే స్వస్వప్రాప్యాకార మదనుసంధాన మవశ్యం కర్తవ్య మితి భావః ॥ 5 ॥

*శ్లో॥ యం యం వాఽపి స్మరన్భావం; త్యజత్యన్తే కళేబరమ్ ।*
*తం తమేవైతి కౌన్తేయ; సదా తద్భావభావితః ॥* 6

టీ -: హే కౌన్తేయ = ఓ అర్జునా; సదా = ఎల్లప్పుడు; తత్ + భావభావితః = ఆ భావముతోనే కూడినవాడై; అంతే = మరణసమయమున; యం యం వా + అపి = ఏయే; భావమ్ = స్వరూపమును; స్మరన్ = స్మరించుచూ; కళేబరమ్ = శరీరమును; త్యజతి = పరిత్యజించుచున్నాడో

తమ్ తమ్ + ఏవ భావమ్ = అయా స్వరూపమునే; ఏతి = (మరణానంతరము) పొందుచున్నాడు.

తా -: మరణసమయమున ఏయే స్వరూపమును స్మరించునో, మరణానంతరము అదే స్వరూపమును పొందును. (జడభరతుడు జింకను స్మరించుచు మరణించి జింకగా పుట్టెను. కావున భగవంతుని ఆశ్రయించినవారికి మరణసమయమున భగవద్ధ్యానము ముఖ్యము).

దీపికా -: స్మర్తు స్స్మృతివిషయ సజాతీయాకారాపాదన మంతిమ స్మృతే స్స్వభావ ఇత్యముమర్థం సుస్పష్ట మాహ (యం యమితి) హే కౌంతేయ, అంతే = అంతకాలే, యం యం వాపి = దేవతిర్యఙ్మనుష్య స్థావరేషు మధ్యే యం యమపి వా, భావం = స్వభావం, స్మరన్ = అనుసంధానః, కళేబరం, త్యజతి = ముంచతి, తంతమేవ భావం, ఏతి = మరణానంతరమేవ ప్రాప్నోతి, అంతకాలే భావవిశేషస్మరణే హేతుమాహ (సదేతి) సదా = నిరంతరం - జీవనకాలే నిరంతరం, తస్య = అంతకాలే స్మరిష్యమాణస్య భావస్య, భావః = భావనా = అనుచింతనం, తేన భావితః = వాసితాంతఃకరణ ఇత్యర్థః, జీవనకాలాభ్యాసవాసనైవాఽంతిమస్మృతిహేతుః, నతు తదానీం పరవశస్య స్మరణౌన్ముఖ్యం సంభవతీతి భావః ॥ 6 ॥

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు; మా మనుస్మర యుద్ధ్య చ ।
మయ్యర్పిత మనోబుద్ధిః; మామేవైష్యస్యసంశయః ॥ 7

టీ -: తస్మాత్ = అందువలన; సర్వేషు-కాలేషు = అన్ని సమయములయందును; (జీవితాంతము) మామ్ = నన్ను; అనుస్మర = స్మరించుచుండుము; యుద్ధ్య చ = క్షత్రియవర్ణోచితమైన యుద్ధము గావింపుము మయి = నాయందు; అర్పితమనోబుద్ధిః = మనస్సు; దృఢనిశ్చయము కలవాడవై; మామ్ + ఏవ = నన్నే; ఏష్యసి = పొందగలవు; అసంశయః = సందేహము లేదు.

తా -: అర్జునా! జీవితాంతము సర్వకాలములయందు నన్నే స్మరించుచుండుము. ధర్మావిరుద్ధమైన యుద్ధము సైతము కావింపుము. సర్వథా నన్నే దృఢముగా ధ్యానించుటచే మరణ సమయమునను నన్నే స్మరించుచు శరీరమును వదలి నన్నే పొందగలవు. సందేహములేదు.

దీపికా -: తస్మాత్ - అంతిమస్మృతేః పూర్వకాలాభ్యస్తసజాతీయ స్వభావవిషయత్వనియమాద్ధేతోః, సర్వేషు కాలేషు=అప్రయాణ మహరహః, మాం=పరమప్రాప్యభూతం, అనుస్మర=అనుచింతయ, యుద్ధ్య చ=వర్ణాశ్రమోచితం యుద్ధాదికర్మ చ కురు, తస్య మనోనైర్మల్యాపాదనద్వారా అహరహరనుస్మృతికరత్వాదితి భావః, తతః కిమిత్యత్రాహ (మయీతి) ఏవం సతి, మయి=విషయే, అర్పితమనోబుద్ధిః-అర్పితే=నివేశితే, మనోబుద్ధీ=మనోఽధ్యవసాయౌ, యేన స తథోక్తః, అంతకాలే మాం స్మరన్నిత్యర్థః, మామేవ ఏష్యసి=ప్రాప్స్యసి, అసంశయః=అత్ర సంశయో నాస్తి ॥ 7 ॥

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన; చేతసా నాఽన్యగామినా,
పరమం పురుషం దివ్యం; యాతి పార్థాఽనుచిన్తయన్ ॥ 8

టీ -: పార్థ=అర్జునా!; అభ్యాసయోగయుక్తేన=అభ్యాసముతోను, ధ్యానముతోను కూడినదియు; న+అన్యగామినా=ఇతరవిషయములమీద ప్రసరింపని; చేతసా=మనస్సుచేత; దివ్యమ్ = అప్రాకృతుడు; పరమం పురుషం=పరమపురుషుడను అగు నన్ను; అనుచింతయన్=(మరణసమయమున) స్మరించుచు; యాతి = పొందుచున్నాడు.

తా -: అర్జునా! ధ్యానాభ్యాసములతో కూడినది, ఇతరవిషయములమీద ప్రసరింపనిదియైన మనస్సుతో పరమపురుషుడనగు నన్ను జీవితాంతము ధ్యానించువాడు మరణ సమయమున నన్నే ధ్యానించుచు నా ఐశ్వర్యమును పొందుచున్నాడు.

దీపికా -: ఏవం సామాన్యతః స్వప్రాప్యావాప్తిః అంతిమ స్మృత్యధీనేత్యుక్తే, అథ త్రయాణా మధికారిణా ముపాసనప్రకారభేదం వక్తు మారభమాణః ప్రథమ మైశ్వర్యార్థినా ముపానప్రకారం యథోపాసన మంతిమస్మృతిం చాహ (అభ్యాసేతి) హే పార్థ, అభ్యాసయోగయుక్తేన- అభ్యాసః=ప్రత్యహం నిత్యనైమిత్తికాఽవిరుద్ధేషు కాలేషు మనసా ఉపాస్య వస్తు సంశీలనం, యోగస్తు=అహరహర్యోగకాలేఽనుష్ఠీయమానం-"శుచౌ దేశే ప్రతిష్ఠాప్యే" త్యాద్యుక్తలక్షణ ముపాసనం, తాభ్యాం యుక్తేన= సహితేన, అతఏవ=నాఽన్యగామినా - అన్యవిషయ విముఖేన, చేతసా= మనసా, దివ్యం=అప్రాకృతం, పరమం=సర్వస్మాత్పరం, పురుషం= మాం, అనుచింతయన్=అనుస్మరన్, అంతకాల ఇతిశేషః, యాతి= స్వాభిలషితైశ్వర్యవిశిష్టం మామేవ ప్రాప్నోతీత్యర్థః ॥ 8 ॥

శ్లో॥ కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః ।
సర్వస్య ధాతార మచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ 9

శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యాయుక్తో యోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్ ॥ 10

టీ -: కవిం=సర్వజ్ఞుడు; పురాణం=అనాది; అనుశాసితారం= సర్వనియన్త; అణోః=అణుపరిమాణుడైన జీవునికంటె; అణీయాంసం= సూక్ష్మమైనవాడు; సర్వస్య=సమస్తజగత్తునకు; ధాతారం=సృష్టికర్తయు; అచింత్యరూపం=చింతింప శక్యముకాని స్వరూపము కలవాడు; తమ- సః=ప్రకృతికంటె; పరస్తాత్=అవతల; ఆదిత్యవర్ణం = సూర్యునివలె ప్రకాశించువాడు; దివ్యం=దివ్యమైనవాడు నైన; పరం పురుషం=పర

మ పురుషుని; యః = ఎవడు; భక్త్యా = భక్తితోను; యోగబలేన చ + ఏవ = యోగబలము తోను; యుక్తః = కూడినవాడై; అచలేన = నిశ్చలమైన; మనసా = మనస్సుచే; ప్రయాణకాలే = మరణసమయమునందు; భ్రువోః = కనుబొమలయొక్క; మధ్యే = నడుమ; ప్రాణం = ప్రాణవాయువును; సమ్యక్ = చక్కగా; ఆవేశ్య = నిలిపి; అనుస్మరేత్ = స్మరించునో; సః = వాడు; తం = ఆ పురుషుని; ఉపైతి = పొందుచున్నాడు.

**తా** -: సర్వజ్ఞుడు ఆద్యంతరహితుడు సర్వనియన్త అణుస్వరూపుడైన జీవునియందును అంతర్యామియై యుండుటచే అతిసూక్ష్మమైనవాడు సృష్టికర్త అచింత్యస్వరూపుడు తమస్సునకు (ప్రకృతిమండలమునకు) అవల సూర్యునివలె వెలుగొందువాడు నైన నన్ను ధ్యానించువాడు మరణసమయమున భక్తితో నన్ను స్మరించుచు ఆ పరమపురుషుని చేరును.

దీపికా -: ఐశ్వర్యార్థినా ముపాస్యస్య పరస్య బ్రహ్మణః స్వరూపం తేషామంతిమస్మృతిప్రకారం చాహ 'కవి' మిత్యాది శ్లోకద్వయేన, యః, భక్త్యా = నిరతిశయప్రేమరూపయా, యోగబలేన చ, యుక్తస్సన్, ప్రయాణకాలే, భ్రువోః, మధ్యే, ప్రాణం, సమ్యక్, ఆవేశ్య = సంస్థాప్య, తత్ర = భ్రూమధ్యే, కవిం = సర్వజ్ఞం, పురాణం = పురాతనం, అనుశాసితారం = సర్వస్య నియంతారం, అణోః = సూక్ష్మజీవాత్, అణీయాంసం = అతిసూక్ష్మం, సర్వస్య = జగతః, ధాతారం = స్రష్టారం, అచింత్యరూపం = సకలేతరవిసజాతీయతయా చింతయితు మశక్యస్వరూపం, తమసః = ప్రకృతేః, పరస్తాత్ = పరం, అప్రాకృతం, ఆదిత్యవర్ణం = ఆదిత్యస్య వర్ణ ఇవ వర్ణో యస్య తం తం, స్వాఽసాధారణదివ్యవిగ్రహ మిత్యర్థః, దివ్యం, పరం, పురుషం, అనుస్మరేత్, సః, తమేవ = పురుషం, ఉపైతి = తత్సమానైశ్వర్యో భవతీత్యర్థః ॥ 9, 10 ॥

శ్లో॥ యదక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ 11

టీ -: వేదవిదః = వేదవేత్తలు; యత్ = దేనిని; అక్షరం = నాశము లేనిదానినిగ; వదన్తి = చెప్పుచున్నారో; వీతరాగాః = విరక్తులైన; యతయః = యతులు; యత్ = దేనిని; విశన్తి = పొందుచున్నారో; యత్ = దేనిని; ఇచ్ఛన్తః = (పొంద) కోరుచున్నవారు; బ్రహ్మచర్యం = జితేంద్రియత్వమును; చరంతి = ఆచరించుచున్నారో; తత్ = ఆ; పదం = ఉపాస్యము - పొందదగినది అయిన నా స్వరూపమును; తే = నీకు సంగ్రహేణ = సంక్షేపముగ; ప్రవక్ష్యే = చెప్పెదను.

తా -: వేదవేత్తలు దేనిని వికారాదిదోషరహిత మని తలంతురో, నిష్కామయోగులు దేనిని పొందెదరో; దేనిని పొందగోరువారు బ్రహ్మచర్యవ్రతము ననుష్ఠింతురో, అట్టి ఉపాస్యమైన నా స్వరూపమును నీకు తెలిపెదను.

దీపికా - అథ కైవల్యార్థినాం స్మరణప్రకార మాహ (యదక్షర మితి) వేదవిదః = వేదార్థవేదినః, యత్, అక్షరం, వదంతి = అస్థూలత్వాఽనణుత్వాదిగుణకం వదంతి, వీతరాగాః = విషయాంతరవిరక్తాః, యతయః = యతనశీలాః మునయః, యత్ = అక్షరం, విశన్తి = ప్రాప్నువన్తి, యత్ = అక్షరం, ఇచ్ఛంతః = ప్రాప్తు మిచ్ఛంతః, బ్రహ్మచర్యం = ఊర్ధ్వరేతస్కత్వరూపం, చరంతి = అనుతిష్ఠంతి, పద్యతే - గమ్యతే - జ్ఞాయత ఇతి పదం - ఉపాస్యమిత్యర్థః, తత్ = నిఖిలవేదాంతప్రసిద్ధం, అక్షరం - న క్షరతీత్యక్షరం - నిర్వికారం - మత్స్వరూపం, తే = తుభ్యం సంగ్రహేణ = సంక్షేపేణ, ప్రవక్ష్యే = ప్రవక్ష్యామి ॥ 11 ॥

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుద్ధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్॥ 12

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్ దేహం; సయాతి పరమాంగతిమ్॥ 13

టీ -: సర్వద్వారాణి = ఇంద్రియములను అన్నింటిని; సంయమ్య=నిగ్రహించి; మనః=మనస్సును; హృది=హృదయమునందు; నిరుద్ధ్య చ=నిలిపి; యోగధారణాం=యోగము అనబడు ధారణను (నిశ్చలస్థితిని); ఆస్థితః=పొందినవాడై; బ్రహ్మ = పరబ్రహ్మ (మగు నాకు) వాచకమైన; ఓం + ఇతి='ఓమ్' అను; ఏక + అక్షరం=ముఖ్యమైన అక్షరమును; వ్యాహరన్ = ఉచ్చరించుచు; మాం = (ఓంకార వాచ్యుడనైన) నన్ను; అనుస్మరన్=స్మరించుచు; ఆత్మనః=తనయొక్క; ప్రాణం=ప్రాణవాయువును; మూర్ధ్ని=శిరస్సున; ఆధాయ; (సుషుమ్నా నాడిద్వారా) ప్రవేశింపజేసి; దేహం=శరీరమును; త్యజన్ = పరిత్యజించుచు; యః=ఎవడు; ప్రయాతి = అర్చిరాదిమార్గమున పోవునో; సః=అట్టివాడు; పరమాంగతిం = పునరావృత్తిరహితమైన ప్రాప్యమును; యాతి=పొందుచున్నాడు.

తా -: జ్ఞానప్రసరద్వారములగు ఇంద్రియములను విషయముల నుండి మరలించి హృదయకమలమునందు ఉండు నాయందు మనస్సు నిలిపి నిశ్చలముగా ధ్యానించుచు నాకు వాచకమైన 'ఓమ్' అను అక్షరమును ఉచ్చరించుచు సుషుమ్నానాడిద్వారా ప్రాణవాయువును శిరమున ప్రవేశింపజేసి శరీరత్యాగము చేయువాడు అర్చిరాదిమార్గమున వెడలి నాతో సమానమగు ఆత్మను (కైవల్యమును) పొందును.

దీపికా -: సర్వద్వారాణి = సర్వాణి జ్ఞానప్రసరద్వారభూతాని శ్రోత్రాదీంద్రియాణి, సంయమ్య = స్వవ్యాపారేభ్యో నివర్త్య, మనః హృది=హృదయకమలనివిష్టే మయ్యక్షరే, నిరుధ్య=నియమ్య, యోగ

ధారణాం=యోగరూపాం ధారణాం, మయ్యేవ నిశ్చలాం స్థితిం, ఆస్థి-
తః=ఆశ్రితః, బ్రహ్మ=పరబ్రహ్మణో మమ వాచకం, ఓమిత్యేవం
రూపం, ఏకాక్షరం=ముఖ్య మక్షరం, వ్యాహరన్ = ఉచ్చారయన్,
మాం=ఉచ్చార్యమాణప్రణవవాచ్యం మాం, అనుస్మరన్ = అనుసంధ
ధానః, ఆత్మనః=స్వస్య, ప్రాణం=ప్రాణవాయుం, మూర్ధ్ని = శిరసి,
ఆధాయ=మూర్ధన్యసుషుమ్నానాడీద్వారేణ ప్రవేశ్య, దేహం = శరీరం,
త్యజన్ - యః, ప్రయాతి = అర్చిరాదిగత్యా గచ్ఛతి. సః, పరమాం =
పునరావృత్తిరహితాం, గతిం=ప్రాప్యం, ప్రకృతివియుక్తం మత్సమా
నాకార మాత్మాన మిత్యర్థః, యాతి=గచ్ఛతి ॥ 12, 13 ॥

శ్లో॥ అనన్యచేతాః సతతం; యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ; నిత్యయుక్తస్య యోగినః ॥ 14

టీ -: పార్థ=అర్జునా; యః=ఎవడు; నిత్యశః=జ్ఞానమార్గప్రారం
భమునుండి; సతతం=సర్వదా; అనన్యచేతాః = ఇతరవిషయముల
యందు ప్రసరింపని మనస్సు గలవాడై; మాం=నన్ను; స్మరతి=స్మరిం
చునో; నిత్యయుక్తస్య = నాతోడనే చేరియుండవలయునని తలంచు;
తస్య=ఆ; యోగినః=జ్ఞానికి; అహం=నేను; సులభః=సులభుడను.

తా -: అర్జున! ఎవడు జ్ఞానమార్గమున ప్రవేశించినదిమొదలు
ఇతరవిషయచింతలు మాని నాయందలి ప్రేమతో నన్నే ఎల్లప్పుడు
ధ్యానించుచుండునో అట్టి జ్ఞానికి నేను సులభుడను. అతడు నిర్విఘ్న
ముగ నన్ను పొందునట్లు అతని భారమును నేనే స్వీకరింతు నని
భావము.

దీపికా -: అథ జ్ఞానినో భగవదుపాసనప్రకారం ప్రాప్తిప్రకారం
చాహ (అనన్యేతి) నిత్యశః = ఉద్యోగకాలప్రభృతి, సతతం=సర్వ
కాలం, న విద్యతేఽన్యస్మిన్ చేతో యస్య స తథోక్తః - అనన్యచేతాః -
అత్యర్థమత్ప్రియత్వేన మత్స్మృతిసంతతిం వినాఽఽత్మానం ధారయితు

మశక్నువన్నిత్యర్థః, యః, మాం, స్మరతి = నిరతిశయస్వప్రియాం స్మృతిం కరోతి, హే పార్థ, నిత్యయుక్తస్య = మయా నిత్యయోగ మాకాంక్షతః, తస్య, యోగినః = జ్ఞానినః, అహం, సులభః = సుఖేన లబ్ధుం శక్యః, తస్య హి మత్ప్రాప్త్యనుగుణోపాసన తద్వివృద్ధి తత్పరిపాక తద్విరోధినిరసనాదికం మమైవ భార ఇతి భావః ॥ 14 ॥

*శ్లో॥ మాముపేత్య పునర్జన్మ; దుఃఖాలయ మశాశ్వతమ్ ।*
*నాఽప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః ॥* 15

టీ -: మహాత్మానః = గొప్ప మనస్సుగలవారు (నన్ను అత్యధిక భక్తితో ధ్యానించువారు); పరమాం = నిరతిశయమైన; సంసిద్ధిం = పురుషార్థరూపుడనైన నన్ను; గతాః = పొందినవారై; మాం = నన్ను; ఉపేత్య = చేరి; పునః = మరల; దుఃఖ + ఆలయం = దుఃఖనిలయము; అశాశ్వతం = అస్థిరము అయిన; జన్మ = జన్మమును; న = అప్నువంతి = పొందరు.

తా -: నన్ను క్షణమైనను విడిచియుండ లేక భక్తితో ధ్యానించువారు నన్ను చేరినపిదప మరల ఈ సంసారమున జన్మింపరు. కాని కేవలము ఐశ్వర్యార్థులై నన్ను ఆశ్రయించువారు మాత్రము దుఃఖనిలయము అనిత్యము అయిన ఈ సంసారమున జననమరణములను పొందుచుందురు.

దీపికా -: అతఃపర మధ్యాయశేషేణ జ్ఞానినః కైవల్యార్థినశ్చ అపునరావృత్తి మైశ్వర్యార్థినః పునరావృత్తిం చాహ, మాం, ఉపేత్య = ప్రాప్య, పునః = భూయోఽపి, దుఃఖాలయం - దుఃఖానాం = ఆధ్యాత్మికాదిరూపాణాం, ఆలయం = ఏకాస్పదం, అశాశ్వతం = అస్థిరం, జన్మ = దేవమనుష్యాదిప్రాకృతశరీరసంసర్గరూపం, నాఽప్నువంతి = న ప్రాప్నువంతి, నాఽప్నువంతీత్యనంతరం - యతః - తే - ఇతిపదద్వయ మధ్యాహార్యం, యతః = యస్మాత్కారణాత్, తే - మాం ప్రాప్తవంతః, మహా

త్మానః - మహాన్ - అభ్యర్థితః, ఆత్మా = మనః, యేషాం తే తథోక్తాః,
యథావస్థితమత్స్వరూపజ్ఞానాః - మదేకప్రియత్వేన మయా వినా క్షణ
మప్యాత్మధారణ మలభమానాః మయ్యేవాసక్తమనసో మదుపాసనవినా
శిత సకలపూర్వోత్తరాఘాః ఇత్యర్థః, పరమాం = నిరతిశయాం. సంసిద్ధిం =
పురుషార్థరూపం మాం, గతాః ప్రాప్తాః, అతస్తేషా మపునరావృత్తి రుచి
తేతి భావః, అత్ర మాముపేత్య పునర్జన్మ నాఽఽప్నువంతీత్యుక్త్యాఽర్థా
దైశ్వర్యార్థినాం పునరావృత్తి రుక్తా భవతీతి భావః ॥ 15 ॥

శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మా ముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥ 16

టీ -: అర్జున = అర్జునా; ఆబ్రహ్మభువనాత్ = బ్రహ్మలోకము వరకు (గల); లోకాః = సమస్తలోకములు; పునః + ఆవర్తినః = నశించునట్టివి; కౌంతేయ = కుంతీతనయుడవైన ఓ అర్జున; మాం = నన్ను; ఉపేత్య తు = పొందినచో; పునః + జన్మ = మరల జన్మించుట; న విద్యతే = కలుగజాలదు.

తా -: చతుర్ముఖబ్రహ్మయొక్క సత్యలోకమువరకు గల సమస్త లోకములు శాశ్వతములు గావు. అవి పుట్టుచు గిట్టుచు నుండును. సర్వజ్ఞుడను సత్యసంకల్పుడను పరమకారుణికుడను ఆశ్రితవత్సలుడను అయిన నన్ను పొందినచో పునర్జన్మము కలుగదు.

దీపికా -: ఐశ్వర్యగతిం ప్రాప్తానాం పునరావృత్తౌ, భగవంతం ప్రాప్తానా మనావృత్తౌ చ హేతు మాహ (ఆబ్రహ్మేతి) హే అర్జున, ఆబ్రహ్మభువనాత్ = చతుర్ముఖలోకపర్యంతాః, లోకాః = బ్రహ్మాండోదర వర్తినః కర్మాద్యుపాయైః ప్రాప్యా భోగైశ్వర్యాలయాస్సర్వే లోకాః పునరావర్తినః = వినాశినః, అతఏవైశ్వర్యగతిం ప్రాప్తానాం ప్రాప్యస్థాన వినాశా ద్వినాశిత్వ మవర్జనీయమితి భావః, హే కౌంతేయ, మాం తు సర్వజ్ఞం సత్యసంకల్పం పరమకారుణిక మాశ్రితవాత్సల్యైకజలధిం

మాం పునః ఉపేత్య=ప్రాప్య, పునర్జన్మ=పునరావృత్తిః, న విద్యతే=నాస్తి ॥ 16 ॥

శ్లో॥ సహస్రయుగపర్యన్త మహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాన్తాం; తేఽహోరాత్రవిదో జనాః ॥ 17

టీ -: అహః+రాత్రవిదః = అహోరాత్రముల స్వరూపమును చక్కగ ఎఱిగిన;తే=ఆ(లబ్ధప్రతిష్ఠులైన)జనాః = జనులు; బ్రహ్మణః = బ్రహ్మయొక్క; అహః = పగలు; యత్తత్ = ఏది గలదో దానిని; సహస్రయుగపర్యంతం=వేయి మహాయుగముల పరిమితిగలదానినిగను; రాత్రిం = రాత్రికాలమును యుగసహస్ర+అన్తాం = వేయి మహాయుగముల పరిమితిగలదానినిగను విదుః=ఎఱుగుదురు.

తా -: కృతత్రేతాద్వాపరకలియుగములు నాలుగు కలిసి ఒక మహాయుగ మగుచున్నది. ఇట్టి వేయి మహాయుగములు చతుర్ముఖ బ్రహ్మకు ఒక పగలు; ఇట్లే వేయిమహాయుగములు ఒక రాత్రి అగుచున్నవి. బ్రహ్మయొక్క ఈ అహోరాత్రకాలమును బ్రహ్మకల్ప మని యందురు. ఇట్టి మూడువందలఅరవై బ్రహ్మకల్పములు బ్రహ్మకు ఒక సంవత్సరము ఇట్టి నూరు సంవత్సరములు ఒక మహాకల్పము. మహాకల్పాంతమున బ్రహ్మలోకపర్యంతము గల లోకములు బ్రహ్మయు శ్రీమన్నారాయణునియందు లీన మగుదురు.

| | | | |
|---|---|---|---|
| 1. | కృతయుగము | 1728000 | సంవత్సరములు |
| 2. | త్రేతాయుగము | 1296000 | సంవత్సరములు |
| 3. | ద్వాపరయుగము | 864000 | సంవత్సరములు |
| 4. | కలియుగము | 432000 | సంవత్సరములు |
| | వీనిమొత్తము | 43,20,000 | సంవత్సరములు |

ఇది ఒక మహాయుగము.

దీపికా -: బ్రహ్మలోకపర్యంతానాం లోకానాం తదంతర్వర్తినాం చ
భగవత్సంకల్పకృతా ముత్పత్తివినాశకాలవ్యవస్థా మాహ (సహస్రమితి)
అహోరాత్రవిదః = బ్రహ్మదీనాంమత్సంకల్పకృతాఽహోరాత్రరూప
కాలవ్యవస్థావేదినః, తే = తథాప్రసిద్ధాః, జనాః, బ్రహ్మణః = చతుర్ముఖస్య,
అహః = దినం, యత్, అస్తి, తత్ సహస్రయుగపర్యంతం = సహస్ర
యుగావసానం, విదుః = జానంతి, బ్రహ్మణః = రాత్రిం యుగసహస్రాం
తాం = యుగసహస్రపర్యంతాం, విదుః ॥ 17 ॥

శ్లో॥ అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవన్త్యహరాగమే । 18
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥

టీ -: అహః + ఆగమే = (బ్రహ్మకు) పగటికాలమున; సర్వాః =
సమస్తములైన; వ్యక్తయః = స్పష్టముగ గోచరించు పదార్థములు; అవ్య
క్తాత్ = (చతుర్ముఖబ్రహ్మకు దేహమైన) ప్రకృతినుండి; ప్రభవన్తి =
పుట్టుచున్నవి. రాత్రి + ఆగమే = రాత్రి సమయమున; అవ్యక్తసంజ్ఞకే =
అవ్యక్తమనబడు; తత్ర + ఏవ = ఆ బ్రహ్మయొక్క శరీరమునందే;
ప్రలీయన్తే = లీన మగుచున్నవి.

తా -: బ్రహ్మకు పగటికాలమునందు అతని శరీరమైన ప్రకృతి
నుండి అన్నిలోకములయందలి చరాఽచరములు పుట్టుచున్నవి. రాత్రి
కాలమున ఆ బ్రహ్మయొక్క శరీరమునందే లీన మగుచున్నవి,

దీపికా -: అహరాగమే = బ్రహ్మణో దినాగమే సతి, సర్వాః =
సమస్తాః, వ్యక్తయః = వ్యజ్యంతే - అభివ్యజ్యంత ఇతి త్రైలోక్యవర్తినో
దేహేంద్రియభోగ్యభోగస్థానరూపాః కార్యపదార్థాః, అవ్యక్తాత్ = చతు
ర్ముఖదేహాత్మనా పరిణతాయాః ప్రకృతేః, ప్రభవంతి = ఉత్పద్యంతే,
బ్రహ్మణః, రాత్ర్యాగమే సతి, తత్రైవ = ఉత్పత్తిస్థానభూత ఏవ,
అవ్యక్తసంజ్ఞకే = చతుర్ముఖదేహావస్థితాఽవ్యక్తనామ్ని, ప్రలీయంతే =
ప్రలీనా భవంతి ॥ 18 ॥

శ్లో॥ భూతగ్రామస్స ఏవాఽయం; భూత్వా భూత్వా ప్రలీయతే॥
రాత్ర్యాఽగమేఽవశః పార్థ; ప్రభవత్యహరాగమే ॥ 19

టీ -: హే పార్థ=ఓ అర్జున; సః+అయం=ఆ యీ, భూతగ్రామః+ఏవ=ప్రాణిసముదాయమే; అవశః = కర్మపరవశమై; భూత్వా భూత్వా=పుట్టి పుట్టి; రాత్రి+అగమే=బ్రహ్మకు రాత్రియవగనే; ప్రలీయతే=లయించుచున్నది; అహః+అగమే = పగలు అవగనే; ప్రభవతి=(మరల) పుట్టుచున్నది.

తా -: అర్జున; ఈ ప్రాణిసముదాయము చతుర్ముఖబ్రహ్మయొక్క పగటికాలమున పుట్టుచు రాత్రికాలమున గిట్టుచు కర్మవశమున జన్మమరణముల ననుభవించుచున్నది.

దీపికా -: హే పార్థ, స ఏవ = ప్రాగ్విద్యమాన ఏవ, అయం, అవశః=కర్మపరవశః, భూతగ్రామః=దేవమనుష్యాదిభూతసమూహః, అహరాగమే, భూత్వా భూత్వా=పునః పునరుత్పద్య, రాత్ర్యాగమే, ప్రలీయతే=పునఃపునర్లయం ప్రాప్నోతి, అహరాగమే, పునః ప్రభవతి=జాయతే, అత ఐశ్వర్యగతిం ప్రాప్తానాం పునరావృత్తి రపరిహార్యా, మాముపేతానాం తు నపునరావృత్తిప్రసంగ ఇతి భావః ॥ 19 ॥

శ్లో॥ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః।
యస్స సర్వేషు భూతేషు; నశ్యత్సు న వినశ్యతి ॥ 20

టీ -: తస్మాత్=అట్టి; అవ్యక్తాత్=అచేతన ప్రకృతికంటె; పరః=ఉత్కృష్టమైనది; అన్యః=భిన్నమై (విలక్షణమై) నది; అవ్యక్తః=ఇంద్రియములకు గోచరింపనిది; సనాతనః = నిత్యమైనదియు నైన, యః భావః=ఏ ఆత్మపదార్థము కలదో; సః=అది; సర్వేషు=సమస్తములైన; భూతేషు=ఆకాశాదిభూతములు; నశ్యత్సు = నశించుచున్నను, న వినశ్యతి=నశింపదు.

తా -: జీవాత్మ అచేతనప్రకృతికంటె ఉత్తముడు. జ్ఞానస్వరూపుడు. నిత్యుడు. పాంచభౌతికములైన శరీరముల నాశ్రయించియుండియు వానితో బాటు నశింపడు.

దీపికా -: అథ కైవల్యం ప్రాప్తానా మప్యపునరావృత్తి మాహ (పర ఇతి) తస్మాత్, అవ్యక్తాత్=అచేతనరూపాత్, పరః = పురుషార్థ తయోత్కృష్టః, అన్యః = జ్ఞానైకాకారతయా తస్మాద్విజాతీయః, అవ్యక్తః=కేనాపి, ప్రమాణేనాఽనభివ్యజ్యమానః - స్వయం ప్రకాశ ఇత్యర్థః, సనాతనః=ఉత్పత్తివినాశాఽనర్హతయానిత్యః. యః, భావః= పదార్థః, అస్తి, సః, సర్వేషు, భూతేషు=వియదాదిషు, నశ్యత్సు సత్సు, న వినశ్యతి=తత్ర స్థితో వినాశం న ప్రాప్నోతి ॥ 20 ॥

శ్లో॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ 21

టీ -: అవ్యక్తః=ప్రమాణములకు గోచరింపని ఆ ఆత్మ;అక్షరః+ ఇతి=పరిశుద్ధాత్మయని; ఉక్తః = చెప్పబడినది; తం = అక్షరశబ్ద వాచ్యుడు ప్రకృతివిలక్షణుడుఅయిన ఆపరిశుద్ధాత్మను; పరమాంగతిం= పరమప్రాప్యునిగా; ఆహుః=(వేదవేత్తలు) చెప్పుదురు; యం = దేనిని; ప్రాప్య=పొంది; న నివర్తన్తే=మరల జన్మలనుపొందరో; తత్ = అది; మమ=నాయొక్క; ధామ=నియమనస్థానము.

తా -: ప్రకృతివిలక్షణమైన పరిశుద్ధాత్మ పరమప్రాప్య మని వేద వేత్తలు చెప్పుచున్నారు. ఇట్టి ఆత్మను పొందినవారు పునర్జన్మ నందరు. అది (ప్రకృతివిలక్షణమైన) నా రెండవ నియమనస్థానము.

దీపికా -: అత ఏవ అవ్యక్తః - అక్షరః ఇత్యుక్తః, యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసత ఇత్యాదావితి భావః, తం = అక్షరశబ్ద నిర్దిష్టంప్రకృతివివిక్త మాత్మస్వరూపం, పరమాం గతిం = పరమ

ప్రాప్యం, ఆహుః, వేదవిద ఇతిశేషః, యం=ఆత్మస్వరూపం, ప్రాప్య, న నివర్తతేం=పునరావృత్తిం న భజంతే, తత్=ఆత్మస్వరూపం,మమ= సర్వనియంతుః, పరమం = అచేతనప్రకృతిరూపా త్తత్సంసృష్టజీవ రూపాచ్చ విలక్షణంధామ=నియమనస్థానమ్ ॥ 21 ॥

శ్లో॥ *పురుషస్స పరః పార్థ; భక్త్యా లభ్యస్త్వ నన్యయా ।*
*యస్యాన్త స్థాని భూతాని; యేన సర్వమిదం తతమ్ ॥* 22

టీ -: పార్థ=అర్జున; భూతాని = ప్రాణులు; యస్య = ఎవని యొక్క; అంతస్థ్సాని=లోపల నున్నవో; యేన = ఎవనిచేత; ఇదం సర్వం=ఇది యంతయు; తతం=వ్యాపింపబడియున్నదో; సః = అట్టి; పరః పురుషః=పరమపురుషుడు; అనన్యయా=ఇతరవిషయ సంబంధములేని; భక్త్యా=భక్తిచే; లభ్యః=పొందదగియున్నాడు.

తా -: సమస్తమును తనయం దుంచుకొని తాను అన్నింటి యందును వ్యాపించియుండు ఆ పరమపురుషుడు తదేకభక్తిచేతనే పొందదగియున్నాడు.

దీపికా -: జ్ఞానినః ప్రాప్యం తు తస్మాదత్యంతవిలక్షణ మిత్యాహ (పురుష ఇతి) భూతాని=దేవమనుష్యాదీని సర్వాణి కార్యాణి, యస్య= కారణభూతస్య పరమపురుషస్య, అంతస్థ్సాని, తత్ర హేతు మాహ (యేనేతి) యేన చ=పరేణ పురుషేణ, సర్వం = కారణావస్థం కార్యా వస్థం చ సమస్తం, ఇదం చేతనాచేతనజాతం, తతం = వ్యాప్తం, హే పార్థ, సః=పరః పురుషస్తు, అనన్యయా = అవ్యభిచారిణ్యా, భక్త్యా, లభ్యః=ప్రాప్యః ॥ 22 ॥

శ్లో॥ *యత్ర కాలే త్వనావృత్తి; మావృత్తిం చైవ యోగినః ।*
*ప్రయతా యాన్తి తం కాలం; వక్ష్యామి భరతర్షభ ॥* 23

టీ -: భరత+ఋషభ = అర్జున; యత్ర కాలే=ఏ కాలము నందు; ప్రయతాః = శరీరమును విడిచి వెళ్ళిన; యోగినః=జ్ఞానులు;

అనావృత్తిం=పునర్జన్మరాహిత్యమును; అవృత్తిం చ = పునర్జన్మమును; యాన్తి=పొందుచున్నారో; తం కాలం=ఆ కాలమును; వక్ష్యామి=చెప్పెదను.

తా -: అర్జున; మరణానన్తరము ఏ కాలాభిమాని దేవతల మార్గము ననుసరించిపోయినచో పునర్జన్మ కలుగదో; ఏ కాలాభిమాని దేవతల మార్గము ననుసరించినచో పునర్జన్మము కలుగునో ఆ మార్గములను తెలిపెదను.

దీపికా -: అథ ప్రకృతివియుక్తాత్మయాథాత్మ్యనిష్ఠస్య పరమపురుషనిష్ఠస్య చాఽపునరావృత్తి హేతుమార్గం ఐశ్వర్యార్థినః ప్రసంగాత్కర్మిణాం సర్వేషాం చ పునరావృత్తి హేతుమార్గం చ వక్తుం ప్రతిజానీతే (యత్రేతి) యోగినః = యోగః, ఉపాయః, ఉపాసన పుణ్యకర్మరూపః, "యోగస్సన్నహనోపాయధ్యానసంగతియుక్తి" ష్విత్యభిధానాత్, స ఏషామస్తీతి యోగినః=జిజ్ఞాసవో జ్ఞానినః పుణ్యకర్మాణశ్చ, అత్ర కాలశబ్దేన కాలాభిమానిదేవతాప్రాపణీయో మార్గ ఉచ్యతే, యత్ర కాలే=యస్మిన్మార్గే ప్రయాతాః, అనావృత్తిం తు = అపునరావృత్తిం చ, ఆవృత్తిం చైవ=పునరావృత్తిం చ, జిజ్ఞాసవో జ్ఞానినశ్చాఽపునరావృత్తిం; పుణ్యకర్మాణ అవృత్తిం చేత్యర్థః, యాంతి = ప్రాప్నువంతి, హే భరతర్షభ! తం, కాలం=మార్గం, వక్ష్యామి ॥ 23 ॥

శ్లో॥ అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24

టీ -: అగ్నిః=అగ్నిరూపమైన; జ్యోతిః=జ్యోతిస్సు; అహః=పగలు; శుక్ల=శుక్లపక్షము; షట్+మాసాః = ఆరుమాసములుగల; ఉత్తర+అయనం=ఉత్తరాయణము (అనువీని అభిమానిదేవతలుగల) తత్ర=ఆ అర్చిరాదిమార్గమున; ప్రయాతాః=ప్రయాణించిన; బ్రహ్మవిదః=బ్రహ్మవేత్తలయిన; జనాః=జనులు; బ్రహ్మ=పరబ్రహ్మమును; గచ్ఛన్తి=పొందుచున్నారు.

తా -: అగ్నిరూపమైన తేజస్సు పగలు శుక్లపక్షము ఉత్తరాయణము అను వీని అభిమానిదేవతలు గల అర్చిరాదిమార్గమున పయనించిన బ్రహ్మవేత్తలు బ్రహ్మమును పొందుచున్నారు. ప్రకృతి వినిర్ముక్తమైన పరిశుద్ధజీవాత్మస్వరూపమును ఉపాసించువారు కైవల్యమును; భక్తితో పరమాత్మను ఉపాసించువారు పరమాత్మను పొందుదురు అని భావము. కావున ఇచటి 'బ్రహ్మ' శబ్దము జీవాత్మను పరమాత్మను బోధించుచున్నది. అర్చిరాదిమార్గమునకు "దేవయానము" అని నామాన్తరము.

దీపికా -: తత్ర జిజ్ఞాసూనాం జ్ఞానినాం చ సాధారణీ మర్చిరాదికాం గతి మాహ (అగ్నిరితి) అగ్నిః=అగ్నిరూపం, జ్యోతిః=తేజః, అహః=దినం, శుక్లః=శుక్లపక్షః, ఉత్తరాయణయా ప్రసిద్ధా షణ్మాసాః; ఇదం ప్రజాపత్యంతానా మప్యుపలక్షణం, ఏతత్ప్రభృతి యో మార్గవిశేషోఽస్తి తత్ర = తస్మిన్మార్గే, ప్రయాతాః, బ్రహ్మవిదః = బ్రహ్మోపాసకాః జనాః, బ్రహ్మ గచ్ఛన్తి=ప్రాప్నువన్తి, తత్ర జ్ఞానినః పరం బ్రహ్మ గచ్ఛన్తి - జిజ్ఞాసవస్తు ప్రకృతివివిక్తాత్మస్వరూపరూపం బ్రహ్మ గచ్ఛన్తీతి వివేకః ॥ 24 ॥

*శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।*
*తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥* **25**

టీ -: ధూమః=ధూమము; రాత్రిః=రాత్రి; తథా = అట్లే; కృష్ణః=కృష్ణపక్షము; షట్ + మాసాః=అరు మాసములు గల; దక్షిణాయనం=దక్షిణాయనము అను వీని దేవతలు గల; తత్ర=ఆ ధూమాది మార్గమున; (ప్రయాతః=పయనించిన)యోగీ=పుణ్యకర్మల గావించిన వాడు; చాంద్రమసం=చంద్రసంబంధమైన; జ్యోతిః = జ్యోతిస్సును; ప్రాప్య=పొంది; నివర్తతే=మరలివచ్చుచున్నాడు.

తా -: ధూమము రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము అను వీని అభిమానిదేవతలు గల ధూమాదిమార్గమున పయనించి పుణ్యశీలురు చంద్రుని (స్వర్గమును) జేరి అచట సుకృతఫలానుభవము పూర్తి అయినంతనే మరల ఇచట జన్మింతురు. ధూమాదిమార్గమును "పితృయానమ"నియు అందురు. దీపికా: అథ పుణ్యకర్మణాం పునరావృత్తి హేతుం మార్గ మాహ (ధూమ ఇతి) ధూమః = ధూమాభిమానినీ దేవతా, రాత్రిః = రాత్ర్యభిమానినీ దేవతా, తథా కృష్ణః = కృష్ణపక్షాభిమానినీ దేవతా, దక్షిణాయనం షణ్మాసాః = దక్షిణాయనతయా ప్రసిద్ధా షణ్మాసాః, ఇదం పితృలోకాదీనా మప్యుపలక్షణం, ఏవంరూపో యో మార్గః, తత్ర ప్రయాతః, యోగీ = ఇష్టాపూర్తాది పుణ్యకర్మా, చాంద్రమసం = చంద్రమస్సంబంధి, జ్యోతిః = తేజః, తదుపలక్షితం స్వర్గలోకం ప్రాప్య, నివర్తతే = తత్రేష్టాపూర్తాది కర్మఫల మనుభూయ పునరావర్తత ఇత్యర్థః ॥ 25 ॥

శ్లో॥ *శుక్లకృష్ణే గతీ హ్యేతే; జగతశ్శాశ్వతే మతే,*
*ఏకయా యాత్యనావృత్తి; మన్యయాఽఽవర్తతే పునః ॥* 26

టీ -: శుక్లకృష్ణే = జ్యోతిర్మయము అంధకారబహుళము అయిన; ఏతే = ఈ పైన చెప్పబడిన; గతీ = అర్చిరాది ధూమాదిమార్గములు; జగతః = ఉపాసకులు పుణ్యశీలురు గల చేతనజగత్తునకు; శాశ్వతే = శాశ్వతములైనవిగా; మతే హి = సమ్మతములు గదా; ఏకయా = (వీనిలో) ఒకదానిచే; అనావృత్తిం = పునర్జన్మరాహిత్యమును; యాతి = పొందుచున్నాడు; అన్యయా = మరియొకదానిచే; పునః = మరల; ఆవర్తతే = తిరిగివచ్చుచున్నాడు.

తా -: అర్చిరాదిమార్గము ప్రకాశమయము. ధూమాదిమార్గము తమోబహుళము. అర్చిరాదిమార్గమున పయనించిన బ్రహ్మవేత్తకు పునర్జన్మకలుగదు. కాని ధూమాదిమార్గమున పయనించిన పుణ్యవంతులకు పునర్జన్మ కలుగును. ఈ రెండు మార్గములు ఎల్లపుడు ఉండునవే.

దీపికా -: అనయోః మార్గయో రావృత్త్యనావృత్తిహేతుం వివిచ్యాహ (శుక్లేతి) ఏతే = పూర్వోక్తే, శుక్లకృష్ణే = శుక్లపక్షకృష్ణపక్షాఽన్వితే - స్వచ్ఛాఽస్వచ్ఛే వా, గతీ = అర్చిరాదిధూమాదిమార్గౌ, జగతః = ఉపాసకస్య పుణ్యకర్మణశ్చ చేతనస్య, శాశ్వతే = ప్రవాహరూపేణ నిత్యే మతే హి = సమ్మతే హి, 'హి'శబ్దేనాఽనయోర్గత్యోః పంచాగ్నివిద్యాది శ్రుతిప్రసిద్ధిం ద్యోతయతి, తయోర్మధ్యే, ఏకయా = అర్చిరాదిగత్యా, గతః ఉపాసకః, అనావృత్తిం యాతి, అన్యయా = ధూమాదిగత్యా గతః పుణ్యకర్మా, పునరావర్తతే, కర్మభూమిం ప్రతీతి శేషః ॥ 26 ॥

*శ్లో॥ నైతే సృతీ పార్థ; జానన్ యోగీ ముహ్యతి కశ్చన,*
*తస్మాత్సర్వేషు కాలేషు; యోగయుక్తో భవాఽర్జున ॥* 27

టీ -: పార్థ = అర్జున; ఏతే సృతీ = ఈ రెండు మార్గములను; జానన్ = తెలిసిన; కశ్చన యోగీ = ఏ యోగియు; న ముహ్యతి = మోహమును పొందడు; తస్మాత్ = అందువలన; సర్వేషు కాలేషు = అన్ని వేళలయందును; అర్జున = అర్జున; యోగయుక్తః = (అర్చిరాది గతిచింతన రూపమైన) యోగముతో కూడినవాడవుగ; భవ = అగుము.

తా -: అర్జున; ఈ అర్చిరాది ధూమాదిమార్గములను చక్కగ తెలిసినవాడు మరణసమయమున తత్తరపాటును పొందడు. కావున నీవు సర్వదా అర్చిరాది గతిచింతనాపరుడవు కమ్ము.

దీపికా -: ఉక్తమార్గద్వయ మజానానస్య ఫలం దర్శయ న్నర్జునస్యోపాదేయమార్గచింతనం విధత్తే (నైతఇతి) హే పార్థ! ఏతే, సృతీ మార్గౌ, జానన్ = హేయతయోపాదేయతయా చ సంతత మనుసంద ధానః, కశ్చన = కశ్చిదపి, యోగీ = ఉపాసకః, న ముహ్యతి; ప్రయాణ కాలే న మోహ మాప్నోతి, స్వగంతవ్యమార్గేఽర్చిరాదిరూపే వ్యాకుల చిత్తో న భవతీత్యర్థః, తస్మాత్ - కారణాత్, హే అర్జున! సర్వేషు కాలేషు - ప్రత్యహం, యోగయుక్తః = అర్చిరాదిగతిచింతనరూపయోగ సహితః, భవ ॥ 27 ॥

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్ ॥ 28

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగోనామ అష్టమోఽధ్యాయః.

టీ -: ఇదం=ఈ రెండు అధ్యాయములయందు చెప్పబడిన భగవన్మాహాత్మ్యమును; విదిత్వా = తెలిసికొని; వేదేషు = వేదముల యందు; తపస్సు చ+ఏవ=తపస్సులయందును; దానేషు = దానముల యందును; యత్=ఏ; పుణ్యఫలం = పుణ్యఫలితము; ప్రదిష్టం= చెప్పబడినదో; తత్+సర్వం=దాని నంతటిని; అతి+ఏతి = అతిక్ర మించుచున్నాడు; (ఉపేక్షించుచున్నాడు). యోగీ చ = జ్ఞానియునై; పరం=ఉత్కృష్టము; ఆద్యం = జగన్మూలము అయిన; స్థానం= స్థానమును; ఉప+ఏతి=పొందుచున్నాడు.

తా -: ఈ రెండు అధ్యాయములయందు చెప్పబడిన భగవన్మా హాత్మ్యమునుచక్కగా తెలిసినవాడు యజ్ఞయాగాదులవలనకలుగుపుణ్య ఫలములను ఉపేక్షించి జ్ఞానియై శాశ్వతమైన పరమ పదమును పొందు చున్నాడు.

దీపికా -: పూర్వాధ్యాయద్వయోదిత భగవన్మాహాత్మ్యరూప శాస్త్రార్థవేదనస్య ఫల మాహ (వేదేష్వితి) వేదేషు = ఋగ్యజుస్సామా థర్వరూపవేదాఖ్యాసేషు, యజ్ఞేషు=ఇష్టిపశుసోమాఽదిరూపవైదికకర్మసు తపస్సు = చాంద్రాయణాఽనశనాదిరూప కాయశోషణేషు, దానేషు= న్యాయార్జితధనస్య పాత్రే ప్రతిపాదనాదిరూపేషు, పుణ్యఫలం = పుణ్య కర్మఫలం, యత్ ప్రదిష్టం=శాస్త్రై రుపదిష్టం, ఇదం = అధ్యాయ ద్వయోదితం భగవన్మాహాత్మ్యం విదిత్వా, తత్సర్వం = పుణ్యఫలం,

అత్యేతి = అతిక్రామతి, ఏతద్వేదన సుఖాఽతిరేకేణ తత్సర్వం తృణాయ మన్యతే. యోగీ = జ్ఞానీ చ భూత్వా, పరం = జ్ఞానిప్రాప్యం, ఆద్యం = జగత్కారణభూతం, స్థానం = పదం, ఉపైతి = ప్రాప్నోతి ॥ 28 ॥

ఇతి శ్రీమద్గీతాభాష్యార్థసంగ్రహతాత్పర్యదీపే శ్రీవరవరమునివిరచితాయాం బాలబోధిన్యాఖ్యాయాం గీతార్థసంగ్రహదీపికాయాం అష్టమోఽధ్యాయః ॥

---

శ్రీరస్తు

గీతార్థసంగ్రహః,

శ్లో॥ ఐశ్వర్యాఽక్షరయాథాత్మ్య భగవచ్చరణాఽర్థినామ్ ।
వేద్యోపాదేయభావానాం అష్టమే భేద ఉచ్యతే ॥ 12

టీ -: ఐశ్వర్య + అక్షరయాథాత్మ్య; భగవత్ + శరణ + అర్థినామ్ = ఐశ్వర్యమును; అక్షరశబ్దవాచ్యుడైనజీవాత్మయొక్క ప్రకృతివినిర్ముక్తస్వరూపమును; భగవంతుని చరణములను కోరువారికి; వేద్య + ఉపాదేయభావానాం = తెలియదగినవి పరిగ్రహింపదగినవి అయిన అంశములయొక్క; భేదః = భేదము; అష్టమే = అష్టమాధ్యాయమునందు; ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా -: 1) సర్వాద్యైశ్వర్యమును 2) జీవుని వాస్తవమైన పరిశుద్ధస్వరూపమును 3) భగవంతుని చరణాఽరవిందములను ప్రార్థించువారు- ఇష్టాఽనుగుణముగ భగవదైశ్వర్యమును జీవాత్మ పరమాత్మల స్వరూపమును అర్చిరాదిమార్గమును చక్కగతెలిసికొని; అనుదినము వీనిని స్మరింపవలయునని ఈ అష్టమాధ్యాయమునందు చెప్పబడినది.

— o —

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భగవద్గీతామృతము

## నవమాధ్యాయము — రాజవిద్యారాజగుహ్యయోగము

శ్లో॥ *ఇదం తు తే గుహ్యతమం; ప్రవక్ష్యామ్యనసూయవే।*
*జ్ఞానం విజ్ఞానసహితం; యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥* 1

టీ -: గుహ్యతమం=అతిరహస్యమై; విజ్ఞానసహితం=ఉపాసన; గతివిశేషజ్ఞానములతో గూడిన; ఇదం జ్ఞానం=భక్తిరూపమయిన ఈ జ్ఞానమును; అనసూయవే=అసూయ లేని; తే=నీకు; ప్రవక్ష్యామి= ఉపదేశింతును; యత్=దేనిని; జ్ఞాత్వా=తెలిసికొని; అశుభాత్=భగవత్ప్రాప్తికి విరోధులైన సకలపాపములనుండి; మోక్ష్యసే = విముక్తుడవు కాగలవో.

తా -: అర్జున; భగవత్ప్రాప్తికి భక్తిరూపమైన జ్ఞానము సాధనము. ఇది ఉపాసనవలనను అర్చిరాదిగతిచింతనవలనను నిష్పన్న మగును. ఇది మిక్కలి రహస్య మైనది. దీనిని అసూయావిరహితుడవైన నీకు ఉపదేశింతును. దీనిని చక్కగ తెలిసి అచరించువారికి భగవత్ప్రాప్తి విరోధులైన సకలపాపములును నశించును.

దీపికా -: అథ నవమాధ్యాయే ఉపాస్యస్య పరమపురుషస్య మాహాత్మ్యం జ్ఞానినాం విశేషం చ శోధయన్ భక్తిరూపోపాసనస్య స్వరూప మాహ (ఇదమితి) హే అర్జున! విజ్ఞానసహితం - విజ్ఞానేన= ఉపాసన-గతి విశేషజ్ఞానేన సహితం, గుహ్యతమం = అతిరహస్యం, ఇదం తు =పూర్వాధ్యాయోక్త జ్ఞానాద్విలక్షణం, జ్ఞానం = భక్తిరూపో

పాసనాఖ్యం జ్ఞానం, అనసూయవే=అసూయారహితాయ, తే=తుభ్యం ప్రవక్ష్యామి, యత్= జ్ఞానం, జ్ఞాత్వా=జ్ఞానపూర్వక మనుష్ఠాయ, అశుభాత్=మత్ప్రాప్తి విరోధినస్సర్వస్మా దమంగళాత్, మోక్ష్యసే = ముక్తో భవిష్యసి ॥ 1 ॥

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం; పవిత్ర మిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం; సుసుఖం కర్తు మవ్యయమ్ ॥ 2

టీ -: ఇదం = ఇది; రాజవిద్యా = విద్యలకు రాజు; రాజగుహ్యం = రహస్యములకు రాజు; ఉత్తమం= ఉత్తమమైన; పవిత్రం= శుద్ధిని కలిగించునది; ప్రత్యక్ష + అవగమం = ప్రత్యక్షమైన ఉపాస్య విషయము గలది; ధర్మ్యం= ధర్మావిద్ధ మైనది; కర్తుం=అనుష్ఠించుటకు; సుసుఖం = మిక్కిలి సుఖమైనది; అవ్యయం = నాశరహిత మైనదియు అగుచున్నది.

తా -: ఈ భక్తిరూపమైన జ్ఞానము ఉపాసనలలో శ్రేష్ఠ మైనది. మిక్కిలి రహస్య మైనది. భగవత్ప్రాప్తి విరోధి సకలపాపములను తొలగించునది. ప్రత్యక్షసమానాకారముగ భగవంతుని సాక్షాత్కరింపజేయునది. నిరతిశయప్రీతిరూప మగుటచే నిశ్శ్రేయసము - నిశ్శ్రేయస సాధనము అగుచున్నది. ప్రీతిపూర్వకముగ అనుష్ఠింపదగినది. ఉపాసనాదశయందే కాక ముక్తిదశయందును అనువర్తించునది.

దీపికా -: తదేవ జ్ఞానం ప్రశంసతి (రాజవిద్యేతి) ఇదం= ఉపదేక్ష్యమాణం భక్తిరూపాపన్నం జ్ఞానం, రాజవిద్యా - విద్యానాం= జ్ఞానానాం రాజా, శ్రేష్ఠ మిత్యర్థః, రాజగుహ్యం - గుహ్యానాం= రహస్యానాం రాజా=శ్రేష్ఠం, ఉత్తమం పవిత్రం = పరమపవిత్రం, మత్ప్రాప్తి విరోధి సకలకల్మషాపహ మిత్యర్థః, ప్రత్యక్షావగమం-అవగమ్యతే-జ్ఞాయతే - ఇత్యవగమో విషయః, ప్రత్యక్షః = అవగమః, యస్య తత్తథోక్తం, భక్తిరూపేణోపాసనేన మా ముపాసీనస్య తదానీమేవాఽహం

ప్రత్యక్షో భవామీత్యుపాసనం ప్రత్యక్షావగమం భవతీత్యర్థః, ధర్మ్యం= ధర్మాదనపేతం, నిరతిశయప్రీతిరూపతయా స్వయమేవ నిశ్శ్రేయస రూపమపి మత్ప్రాప్తిరూప నిశ్శ్రేయససాధనం చేత్యర్థః, అతఏవ, కర్తుం = అనుష్ఠాతుం, సుసుఖం = అత్యర్థప్రియం, అవ్యయం=అక్షయం, మత్ప్రాప్తిం సాధయిత్వాపి స్వయం న క్షీయతే ప్రాప్త్యాఽభిన్నతయా ముక్తిదశాయా మప్యనువర్తమాన మిత్యర్థః ॥ 2 ॥

శ్లో॥ అశ్రద్దధానాః పురుషాః; ధర్మస్యాస్య పరన్తప ।
అప్రాప్య మాం నివర్తన్తే; మృత్యుసంసారవర్త్మని ॥ 3

టీ -: హే పరంతప=ఓ అర్జున; అస్య ధర్మస్య = నిరతిశయ ప్రీతిరూపమైన ఈ ఉపాసనమును; అశ్రద్దధానాః=విశ్వసింపని; పురుషాః=మానవులు; మాం = నన్ను; అప్రాప్య = పొందక; మృత్యుసంసారవర్త్మని=మృత్యురూపమైన సంసారమార్గమునందు;నివర్తంతే= మిక్కిలి వర్తింతురు.

తా -: అర్జున; భగవద్విషయకమైన భక్తిరూపోపాసనము నిరతిశయప్రీతిరూపమైనది. దీనిని విశ్వసించి అనుష్ఠింపనివారు నన్ను పొందజాలరు. జననమరణశీలమైన సంసారమునందే సర్వదా పడియుందురు.

దీపికా -: హే పరంతప! అస్య నిరతిశయప్రియమద్విషయతయా స్వయం నిరతిశయప్రీతిరూపస్య, ధర్మస్య=నిరతిశయమత్ప్రాప్తిసాధనస్యోపానస్య, సంబంధసామాన్యే షష్ఠీ, ఇమం ధర్మ మిత్యర్థః, అశ్రద్ధధానాః=అవిశ్వసంతః - విశ్వాసపూర్వక త్వరారహితాః ఇత్యర్థః, పురుషాః అతఏవ మాం అప్రాప్య మృత్యుసంసారవర్త్మని, - మృత్యోస్వరూపనాశకతయా మృత్యురూపే, సంసారవర్త్మని = సంసారమార్గే, నివర్తంతే=నితరాం వర్తంతే, మహదిద మాశ్చర్య మితి భావః ॥ 3 ॥

శ్లో॥ మయా తత మిదం సర్వం; జగ దవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని; న చాఽహం తేష్వవస్థితః ॥ 4

టీ -: అవ్యక్తమూర్తినా = ఇంద్రియములకు గోచరింపని స్వరూపము గల; మయా = నాచేత; ఇదం = ఈ చేతనాఽచేతనాత్మకమైన; సర్వం జగత్ = సమస్త ప్రపంచము; తతం = వ్యాపింపబడియున్నది; సర్వభూతాని = సమస్తభూతములు; మత్స్థాని = నాయందు (నా అధీనమున) ఉన్నవి; అహం = నేను; తేషు = వానియందు (వాని ఆధీనమున) న = లేను.

తా -: నా స్వరూపము ఇంద్రియములకు గోచరింపదు. అట్టి అవ్యక్త స్వరూపముతో నేను ఈ ప్రపంచము నంతటిని ధరించి నియమించుటకై అంతర్యామిగా ఇందు వ్యాపించియున్నాను. కావున సర్వభూతములు నా అధీనములు. కాని నేను వానికి అధీనుడను కాను.

దీపికా -: భక్తిరూపోపాసనాఖ్య పరమధర్మే శ్రద్ధాజనకం ప్రాప్యస్య స్వస్యాఽసాధారణం మహిమాన మాహ (మయేతి) ఇదం = చేతనాఽచేతనాత్మకం సర్వం జగత్, అవ్యక్తమూర్తినా = అప్రకాశిత స్వరూపేణ, మయా తతం = ధారణార్థం నియమానార్థ చ శేషితయా వ్యాప్తం, అతః, సర్వభూతాని, మత్స్థాని = అంతర్యామిణి మయి స్థితాని, మదేకాయత్తస్థితినియమనానీత్యర్థః, అహం చ = అహం తు, తేషు - భూతేషు నాఽవస్థితః - న తదధీనస్థితి రిత్యర్థః ॥ 4 ॥

శ్లో॥ *నచ మత్స్థాని భూతాని; పశ్య మే యోగ మైశ్వరమ్ ।*
*భూతభృన్నచ భూతస్థః; మమాత్మా భూతభావనః ॥* 5

టీ -: భూతాని = భూతములు; మత్ + స్థాని చ = (ఘటమునందు జలమువలె) నాయందు ఉండునవి;న = కావు; మే = నాయొక్క; ఐశ్వరం = ఈశ్వరసంబంధమైన; యోగం = సంకల్పమును; పశ్య = చూడుము; భూతభృత్ = సమస్తభూతములను భరించువాడను; భూతస్థః = (కాని) ఆ భూతములయందు ఉండువాడను; న = కాను; మమ = నాయొక్క; అత్మా = సంకల్పము; భూతభావనః = భూతములను కలిగించునది.

తా -: భూతములు నాయందు ఉండుట యనగా కుండయందు జలము ఉండునట్లు అని భావింపరాదు. వాని స్థితిగతులు నా సంకల్పాధీనములు అని తెలిసికొనవలయును.

దీపికా -: ఘటాఽదిః జలాఽదేరివ నాఽహం జగతో ధారకః, అపి తు సంకల్పేనేత్యాహ (నచేతి) భూతాని మత్స్థాని చ, న-జలాదీని ఘటాదావివ మయి స్థితాని న భవంతీత్యర్థః, తర్హి పూర్వోక్త వ్యాపకత్వ ధారకత్వే విరుద్ధ్యేయాతా మిత్యత్రాహ(పశ్యేతి) మే=మమ, ఐశ్వరం= ఈశ్వరస్య సంబంధినం, తదసాధారణ మిత్యర్థః, శివస్య భాగవత ఇతివ దయం నిర్దేశః, యోగం = అశ్చర్యయుక్తిం, 'యోగస్సన్నహనోపాయ ధ్యానసంగతియుక్తిష్వ' త్యభిధానకోశాత్, యుక్తిః = అఘటితఘటనా చాతుర్యం, పశ్య=అవలోకయ, తమేవ యోగ మాహ (భూతభృదితి) అహం, భూతాని భిభర్తీ తిభూతభృత్, నచ భూతస్థః=భూతేషు స్థితస్తు న, మమ స్థితౌ తు భూతైర్న కశ్చిదప్యుపకార ఇత్యర్థః, త్వయ్యేనవ స్థితానాం భూతానాం త్వయా ధారణం తు కథం ఘటత ఇత్యత్రాహ (మమేతి) మమ, ఆత్మా=సంకల్ప ఏవ, భూతభావనః - భావయతీతి భావనః - భూతానాం భావనః - భూతానాం ధారకత్వాది సత్తానువృత్తి హేతు రిత్యర్థః ॥ 5 ॥

శ్లో॥ *యథాకాశస్థితో నిత్యం; వాయు స్సర్వత్రగో మహాన్ ।*
*తథా సర్వాణి భూతాని; మత్స్థానీత్యుపధారయ ॥* 6

టీ -: నిత్యం=ఎల్లపుడు; ఆకాశస్థితః=ఆకాశమున నుండునది; సర్వత్రగః = అంతట సంచరించునది అయిన; మహాన్ వాయుః= గొప్పవాయువు; యథా=ఎట్లు; మత్స్థః=నాయందు ఉన్నదో; తథా= అట్లు; సర్వాణి భూతాని=సమస్త భూతములు; మత్స్థాని = నాయందు ఉన్నవి; ఇతి=అని; ఉపధారయ=తెలిసికొనుము.

తా-: వాయువు ఆకాశమునందు నిరాలంబముగ నెలకొని అంతట సంచరించుటను చూచుచున్నాము. ఆకాశమున నెగురుచున్న పక్షి

శరీరమును జీవుడు ధరించు రీతిని ఆ వాయువును ధరించి నియమించునది నేనే. ఇట్లే సకల భూతములు నాయందే నెలకొని నా అధీనమున నున్నవి అని తెలిసికొనుము.

దీపికా -: సర్వస్యాఽస్య స్వసంకల్పాయత్తస్థితి ప్రవృత్తిత్వం స్థాలీపులాకన్యాయేన క్వచిన్నిదర్శయతి (యథేతి) నిత్యం, ఆకాశస్థితః- అమూర్తేఽనాలంబే ఆకాశే విద్యమానః, సర్వత్ర గచ్ఛతీతి సర్వత్రగః- సర్వత్ర ప్రవర్తమానః, మహాన్, వాయుః, యథా - మత్స్థః, తథైవ సర్వాణి భూతాని మత్స్థాని, మదేకాయత్తస్థితిప్రవృత్తికాని, ఇతి ఇమమర్థం, ఉపధారయ=అవధారయ, వాయోర్హి న తావదమూర్తో నిరాలంబ ఆకాశో ధారకః ప్రవర్తకో వా, నచ మహా నయం వాయు రనాలంబే గగనే విహంగశరీరవత్కేన చిచ్చేతనాంతరేణ ధారయితుం చ శక్యః, అతో నిరాలంబే విహాయసి చేతనో విహంగశరీరాదేరివ మహావాయో ర్మహీయా నహమేవ ధారకః ప్రవర్తకశ్చేత్యభ్యుపగమనీయం, తథా సర్వభూతేష్వపీతి భావః ॥ 6 ॥

శ్లో॥ *సర్వభూతాని కౌన్తేయ; ప్రకృతిం యాన్తి మామికామ్,*
*కల్పక్షయే, పునస్తాని; కల్పాదౌ విసృజామ్యహమ్॥* 7

టీ -: కౌంతేయ=అర్జున; సర్వభూతాని=చరాఽచరాత్మకములైన సకలభూతములు;కల్పక్షయే=కల్పాంతమునందు; మామికాం=నాదైన; ప్రకృతిం='తమస్సు' అనబడు ప్రకృతిని; యాన్తి = పొందుచున్నవి. అహం=నేను; కల్ప+ఆదౌ=కల్పప్రారంభమునందు; తాని+ఏవ= ఆ భూతములనే; పునః=మరల; విసృజామి=సృజించుచున్నాను.

తా -: అర్జున; సకలభూతములు కల్పాంతమున నా శరీరమగు ప్రకృతియందు లయించుచున్నవి. మరల వానినే నేను కల్పాదియందు సృజించుచున్నాను. కావున సృష్టిసంహారములు నా సంకల్పాధీనములు.

దీపికా-:సర్వభూతానాం స్వరూపస్థితిప్రవృత్తివ దుత్పత్తిప్రళయా వపి మత్సంకల్పాయత్తా విత్యాహ (సర్వేతి) హే కౌంతేయ, సర్వ భూతాని = సర్వాణి చరాచరాణి, కల్పస్య - ద్విపరార్ధకాలరూపచతు ర్ముఖాయుషః, క్షయే=అవసానసమయే, మామికాం=మచ్ఛరీరభూతాం, ప్రకృతిం = తమశ్శబ్దవాచ్యాం, యాంతి = మత్సంకల్పాత్ప్రవిశంతి, తాన్యేవ - భూతాని, కల్పాదౌ=కల్పారంభే పునః అహం,విసృజామి= ప్రకృతేస్సకాశాద్విభజ్య సృజామీత్యర్థః ॥ 7 ॥

శ్లో॥ *ప్రకృతిం స్వామవష్టభ్య; విసృజామి పునఃపునః ।*
*భూతగ్రామ మిమం కృత్స్నం; మవశం ప్రకృతేర్వశాత్ ॥* 8

టీ -: స్వాం = నాదైన; ప్రకృతిం = తమోరూపప్రకృతిని; అవష్టభ్య=అధిష్ఠించి; ప్రకృతేః + వశాత్=ప్రకృతివశ్యతవలన; అవ శం=పరతంత్రమైన; కృత్స్నం = సమస్తమైన; ఇమం=ఈ; భూత గ్రామం =ప్రాణిసముదాయమును; పునఃపునః = మాటిమాటికి; విసృ జామి=విచిత్రరూపములలో సృజించుచున్నాను.

తా -: పంచభూతములు మనోబుద్ధ్యహంకారములు అను ఎని మిదివిధములుగ నున్న నా అచేతన ప్రకృతిని అధిష్ఠించి; ప్రకృతిపర వశములైయున్న ఈ ప్రాణివర్గమును మాటిమాటికి వివిధరూపముల సృజించుచున్నాను.

దీపికా -: స్వాం=స్వకీయాం, ప్రకృతిం=విచిత్రపరిణామినీం, తమోరూపాం, అవష్టభ్య = "భూమిరాపోఽనలోవాయు"రిత్యుక్తరీత్యా అష్టధా పరిణమయ్యేత్యర్థః, ప్రకృతేః = మహామోహిన్యాః. వశాత్= అధీనత్వాద్ధేతోః, అవశం=అస్వతంత్రం, ఇమం = దేవతిర్యఙ్మనుష్య స్థావరాత్మనా చతుర్విధం, భూతగ్రామం = భూతసమూహం, పునః పునః తత్తద్యోగ్యకాలే, విసృజామి=వివిధం విచిత్రం చ సృజామి ॥8॥

శ్లో॥ నచ మాం తాని కర్మాణి; నిబధ్నన్తి ధనంజయ ।
ఉదాసీనవ దాసీన; మసక్తం తేషు కర్మసు ॥ 9

టీ -: హే ధనంజయ=ఓ అర్జున; తాని కర్మాణి = ఆ విషమ సృష్ట్యాదిరూప కర్మములు; తేషు కర్మసు=ఆ కర్మములయందు; అసక్తం = ఆసక్తిలేనివాడనై; ఉదాసీనవత్=తటస్థునివలె; ఆసీనం=ఉన్నట్టి; మాం=నన్ను; న నిబధ్నన్తి=బంధింపజాలవు.

తా -: అర్జున; నేను తటస్థుడను. జగత్సృష్ట్యాది కర్మములను నేను చేయుచున్నను వానితో నాకు ఎట్టి సంబంధము లేదు. విషమ సృష్టికి జీవుల పూర్వకర్మములే కారణము - వారి కర్మల ననుసరించి వారిని సుఖాత్ములనుగనో దుఃఖాత్ములనుగనో సృజింతును- అందుచే నేను దయాహీనుడను పక్షపాతిని కాను.

దీపికా -: నన్వేవం దేవమనుష్యాద్యాత్మనోత్కృష్టాపకృష్ట వస్తు సృష్టిం కుర్వతస్తవ వైషమ్యనైర్ఘృణ్యే కథం న స్యాతా మిత్యాశంక్యాహ (నచ మామితి) హే ధనంజయ! తాని = విషమసృష్ట్యాదీని, కర్మాణి= వ్యాపారాః, మాం న నిబధ్నంతి=వైషమ్యనైర్ఘృణ్యాదోషేణ న బంధయంతి, అత్ర హేతుం విశేషముఖేనాహ (ఉదాసీనవదితి) తేషు = విషమసృష్ట్యాదిషు, కర్మసు = తేషాం కర్మణాం వైషమ్య ఇత్యర్థః, అసక్తం=ప్రయోజకత్వసంబంధరహితం, తత్ర ఉదాసీనవత్=అకించిత్కరవత్,ఆసీనం=వర్తమానం,మాం న నిబధ్నంతి=న సంబధ్నంతి, సృజ్యవస్తుగత ప్రాచీన పుణ్యాపాపకర్మాణ్యేవ మత్కృత సృష్టి వైషమ్యే ప్రయోజకాని - న త్వహ మితి భావః ॥ 9 ॥

శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాఽచరమ్ ।
హేతునాఽనేన కౌన్తేయ; జగద్విపరివర్తతే ॥ 10

టీ -: కౌంతేయ; అర్జున; అధ్యక్షేణ=సర్వజ్ఞుడనైన; మయా= నాచే; ప్రకృతిః=ప్రకృతి=ప్రకృతి; సచర+అచరం=చరాఽచరాత్మక

మైన జగత్తును; సూయతే=కనుచున్నది. అనేన=(జీవుల కర్మానుసారముగ నేర్పడు నా సంకల్పరూపమైన) ఈ; హేతునా = కారణముచే; జగత్=ప్రపంచము; పరివర్తతే హి=పరివర్తనము చెందుచున్నదిగదా.

తా -: అర్జున; నేను సర్వజ్ఞుడను. సర్వాఽధ్యక్షుడను. జీవుల కర్మల ననుసరించి ఏర్పడు నా సంకల్పమునుబట్టి ప్రకృతి చరాఽచరాత్మకమైన ప్రపంచముగ పరిణమించుచున్నది. నా సంకల్పము లేనిదె ప్రకృతి పరిణమింపజాలదు.

దీపికా -: హే కౌంతేయ! అధ్యక్షయతీత్యధ్యక్షః, "తదైక్షత బహుస్యా" మిత్యుక్తరీత్యా ప్రత్యక్ష మీక్షమాణః, తేన మయా మదీయా ప్రకృతిః, సచరాచరం=చరాఽచరాభ్యాం సహితం, జగత్, సూయతే=ఉత్పాదయతి, హి=యస్మాత్, అనేన=క్షేత్రజ్ఞకర్మానుగుణ మదీక్షణ రూపేణ, హేతునా=కారణేన, సచరాఽచరం జగత్ పరివర్తతే = కులాలచక్రవ త్పునఃపునరావర్తత ఇత్యర్థః ॥ 10 ॥

శ్లో॥ *అవజానన్తి మాం మూఢాః; మానుషీం తను మాశ్రితమ్ ।*
*పరం భావ మజానన్తః; మమ భూతమహేశ్వరమ్ ॥* 11

టీ-: మూఢాః = అజ్ఞానులు; మమ=నాయొక్క; పరం భావం= పరత్వమును; అజానన్తః= ఎఱుగనివారై; భూతమహేశ్వరం = సమస్త భూతములకు అధిపతినై; మానుషీం తనుం = మనుష్యశరీరమును; ఆశ్రితం=ఆశ్రయించిన; మాం=నన్ను; అవజానన్తి = అవమానించుచున్నారు.

తా -: నేను సకలభూతములకు అధిపతిని. జీవుల నుద్ధరింప దయతో మనుష్య శరీరము దాల్చి రామకృష్ణాదిరూపముల నవతరింతును. కాని కంసశిశుపాలాదులవంటి అజ్ఞానులు నా పరత్వము నెఱుంగజాలక నన్ను మానవమాత్రునిగ భావించి అవమానింతురు.

దీపికా -: మూఢాః = స్వకృతకర్మణా సంకుచితజ్ఞానా జనాః, భూతమహేశ్వరం - భూతానాం మహాంత మీశ్వరం, మానుషీం= మనుష్యసజాతీయాం, తనుం = విగ్రహం, ఆశ్రితం = పరమకారుణికతయా సర్వసమాశ్రయణీయత్వాయ మనుష్యసజాతీయతయా అవతీర్ణ మిత్యర్థః, మాం, మమ పరం=కర్మకృతేతర మనుష్యభావ విలక్షణం, భావం=పరమకారుణికత్వాదికృతం మనుష్యభావ మజానంతస్సంతః, అవజానంతి=ప్రాకృతమనుష్యం మన్వానా నాఽద్రియంత ఇత్యర్థః ॥ 11 ॥

శ్లో॥ మోఘాఽఽశా మోఘకర్మాణో; మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీం చైవ; ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12

టీ -: రాక్షసీం=తామసమైన రాక్షసస్వభావము గలది; ఆసురీం= రాజసమైన అసురస్వభావము గలది; మోహినీం = మోహింపజేయునది (యథార్థమును గుర్తింపనీయనిది) అయిన; ప్రకృతిం=స్వభావమును; ఆశ్రితాః = ఆశ్రయించినవారై; మోఘ + ఆశాః = నిష్ఫలమైన అభిలాష గలవారు; మోఘకర్మాణః=నిష్ఫలమైనప్రయత్నము గలవారు; మోఘ జ్ఞానాః=వ్యర్థమైన జ్ఞానముగలవారు; విచేతసః=యథార్థ జ్ఞానరహితులును (అగుచున్నారు.)

తా -: అజ్ఞానులు తమ రాజసతామసస్వభావములనుబట్టి యథార్థమును గుర్తింపజాలక నిష్ఫలములైన కోరికలతో నిష్ఫలకార్యములను గావించుచు విపరీతజ్ఞానము కలిగియున్నారు. కావున వారు నా పరత్వమును గుర్తింపజాలరు.

దీపికా -: పూర్వోక్తస్యావజ్ఞాయా హేతుఫలే దర్శయతి(మోఘాశా ఇతి) మూఢా ఇతి పూర్వశ్లోకాదనుషంజనీయం, మదవజ్ఞాపరా మూఢాః, రక్షసా మిమాం రాక్షసీం-తమఃప్రచురాం, అసురాణామిమా మాసురీం=రజఃప్రచురాంచైవ, అత ఏవ మోహినీం = మనుష్యత్వే పరత్వతిరోధానకరీం, ప్రకృతిం = స్వభావం, శ్రితాః = ఆశ్రితాః, అత

ఏవ - మోఘాశాః=విఫలాఽభిలాషాః, మోఘకర్మాణః=వ్యర్థారంభాః, మోఘజ్ఞానాః=విఫలజ్ఞానాః, విచేతసః = సర్వేషు విషయేషు విగత యథార్థజ్ఞానాశ్చ, భవిష్యంతీతి శేషః ॥ 12 ॥

*శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ; దైవీం ప్రకృతి మాశ్రితాః।*
*భజన్త్యనన్యమనసో; జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥* 13

టీ -: పార్థ=ఓ అర్జున; దైవీం ప్రకృతిం = దేవసంబంధమైన సాత్త్వికస్వభావమును; ఆశ్రితాః=ఆశ్రయించిన; మహాత్మానః+తు= మహానుభావులన్ననో; భూత+ఆదిం= సకలభూతములకు కారణమైన వాడను; అవ్యయం=జ్ఞానసంకోచరహితుడను అయిన; మాం = నన్ను; జ్ఞాత్వా = తెలిసికొని; అనన్యమనసః=మదేకచిత్తులై; భజన్తి = ఉపాసించుచున్నారు.

తా -: అరున; సాత్త్వికస్వభావము గల మహనీయులు జగత్కారణభూతుడను అవతారములయందును జ్ఞానసంకోచము లేనివాడను అయిన నన్ను చక్కగ తెలిసికొని మనస్సును నాయందే నిలిపి ఉపాసింతురు.

దీపికా -: హే పార్థ! దైవీం=దేవసంబంధినీం సత్త్వప్రచురాం, ప్రకృతిం=స్వభావం, ఆశ్రితాః = ప్రాప్తాః, మహాత్మానః = మహానుభావాస్తు, భూతాదిం - భూతానాం - దేవమనుష్యాది సమస్తకార్యాణాం, ఆదిం=కారణభూతం, అవ్యయం-అవతారస్య దయామూలత్వేన కర్మమూలత్వాఽభావా త్తత్కృత జ్ఞానసంకోచాదిరహితం, పరమకారుణికం, మాం, జ్ఞాత్వా, అనన్యమనసః=మదేకచిత్తాస్సంతః, భజంతి = భక్తిరూపోపాసనం కుర్వతే ॥ 13 ॥

*శ్లో॥ సతతం కీర్తయన్తో మాం; యతన్తశ్చ దృఢవ్రతాః।*
*నమస్యన్తశ్చ మాం భక్త్యా; నిత్యయుక్తా ఉపాసతే॥* 14

టీ -: భక్త్యా = భక్తితో; మాం = నన్ను; సతతం = ఎల్లపుడు; కీర్తయంతః = కీర్తించుచు; దృఢవ్రతాః = దృఢసంకల్పము గలవారై; యతన్తః + చ = (మదీయపూజాదులయందు) ప్రయత్నించుచు; నమస్యంతః + చ = నమస్కరించుచు నిత్యయుక్తాః = సర్వదా నాతో కలిసియుండగోరువారు. ఉపాసతే = ఉపాసించుచున్నారు.

తా -: నాతో నిత్యసంబంధమును కోరు భక్తులు దృఢసంకల్పముతో ఎల్లపుడు నన్ను కీర్తించుచు అర్చించుచు నమస్కరించుచు ఉపాసించుచున్నారు.

దీపికా -: తేషాం భజనప్రకార మాహ "సతత" మిత్యాది శ్లోకద్వయేన, భక్త్యా = మయి నిరతిశయప్రీత్యా, సతతం = అనవరతం, మాం, కీర్తయంతః = కల్యాణగుణవిశేషప్రదర్శకై ర్నారాయణకృష్ణవాసుదేవాది నామభిః కీర్తనం కుర్వంతః, దృఢవ్రతాః = దృఢసంకల్పాస్సంతః, సతతం - యతంతః - మదర్చనాదిషు తదుపయోగినందనవనకరణాదిషు చ మత్కర్మసు యతమానాః, నమస్యంతః = సాష్టాంగ మచింతిత పాంసుపంకశర్కరాదికే ధరాతలే దండవత్ప్రణిపతంతః, సతతం నిత్యయుక్తాః - మయా నిత్యయోగ మాశాసానాశ్చ సంతః, సతతం-ఉపాసతే ॥ 14 ॥

శ్లో॥ *జ్ఞానయజ్ఞేన చాప్యన్యే; యజన్తో మా ముపాసతే,*
*ఏకత్వేన పృథక్త్వేన; బహుధా విశ్వతోముఖమ్ ॥* **15**

టీ -: అన్యే + అపి = మరికొందరు మహాత్ములు; జ్ఞానయజ్ఞేన చ = జ్ఞానయజ్ఞముచే; యజన్తః = పూజించుచు; విశ్వతః + ముఖం = బహురూపములనున్న; మాం = నన్ను; బహుధా = అనేకవిధముల; పృథక్త్వేన = భిన్నత్వముతోను; ఏకత్వేన = అభిన్నత్వముతోను; ఉపాసతే = ఉపాసించుచున్నారు.

తా -: కొందరు నా స్వరూపగుణవిభూత్యాదులను చక్కగ తెలిసికొని నన్ను ఉపాసించుచున్నారు. చేతనాఽచేతనములను శరీరముగ గల నేను కార్యదశయందు భిన్నభిన్నరూపములతోను; కారణదశయందు అభిన్నరూపముతోను ఉందును. ఈ రహస్యము నెఱిగి ఉపాసించుటయే జ్ఞానయజ్ఞము.

దీపికా -: అన్యేపి = కేచిన్మహాత్మానః, జ్ఞానయజ్ఞేన - జ్ఞానం - మత్స్వరూపగుణైశ్వర్యవిషయం - 'వాసుదేవస్సర్వ'మిత్యేవంరూపం వా, తదేవ యజ్ఞః - తేన చ, చకారాత్పూర్వోక్తైః కీర్తనాదిభిశ్చ, మాం, యజంతః = ప్రీణయంతస్సంతః, విశ్వతోముఖం - విశ్వతః = విశ్వాని, కార్యకారణోభయావస్థ సమస్తస్థూలసూక్ష్మ చిదచిద్వస్తూని, ముఖం = శరీరతయా ప్రకారః - యస్య తం తథోక్తం మాం, బహుధా, పృథక్త్వేన బహుధా = అవ్యక్తమహదహంకారాది సమష్టిరూపై ర్దేవమనుష్యాదివ్యష్టిరూపైశ్చ బహుప్రకారైః- పృథక్త్వం = నామరూపవిభాగాత్మకం కార్యత్వం; తేన ప్రకారేణ, ఏకత్వేన - ఏకత్వం = అవిభక్తనామరూపత్వరూపం కారణత్వం - తేన ప్రకారేణ, కార్యరూప జగదాకారేణ కారణరూప జగదాకారేణ చేత్యర్థః, ఉపాసతే ॥ 15 ॥

శ్లో॥ *అహం క్రతురహం యజ్ఞః స్వధాఽహ మహ మౌషధమ్ ।*
*మన్త్రోఽహ మహమేవాజ్యం మహ మగ్ని రహం హుతమ్* ॥ 16

టీ -: అహం + ఏవ = నేనే; క్రతుః = జ్యోతిష్టోమాది క్రతువును. అహం = నేనే; యజ్ఞః = బ్రహ్మయజ్ఞాదికము. అహం = నేనే; స్వధా = పితృదేవతాప్రీతికరమైనహవిస్సును. అహం = నేనే; ఔషధం = వ్రీహ్యాది-ఓషధులవలన ఏర్పడు పురోడాశాదికమును. అహం = నేనే; మంత్రః = మంత్రము; అహం = నేనే; ఆజ్యం = హోమోపయోగియైనఘృతము; అహం = నేనే; అగ్నిః = ఆహవనీయాదిరూపమైనఅగ్ని; అహం = నేనే; హుతం = హోమము.

తా -: జ్యోతిష్టోమాది క్రతువులు పంచమహాయజ్ఞములు పితృదేవతాప్రీతికరమైన స్వధ; దేవతాప్రీతికరమగు హవిస్సు; మంత్రము ఆజ్యము అగ్ని హోమము ఇవి యన్నియు నేనే. అనగా ఇవి యన్నియు నాకు శరీరములు, నేను వీనియందు అంతర్యామినై యున్నాను అని భావము.

దీపికా -: విశ్వశరీరత్వమేవ దర్శయతి (అహమితి) అహ మేవ, క్రతుః = జ్యోతిష్టోమాద్యధ్వరః, అహ మేవ చ, యజ్ఞః = బ్రహ్మయజ్ఞాదిః పంచవిధో మహాయజ్ఞః, అహ మేవ, స్వధా = పితృగణప్రీణనం హవిః, అహ మేవ, ఔషధం = వ్రీహియవాద్యోషధివికారభూతం చరుపురోడాశాదిరూపం హవిః, అహ మేవ, మంత్రః = యాజ్యాపురోనువాక్యాదిరూపః, అహ మేవ, ఆజ్యం = ఆజ్యరూపం హవిః, సోమాదేరప్యుపలక్షణ మేతత్, మన్త్రశబ్దసాహచర్యా దాజ్యనామక స్తోత్ర విశేషో వా, అహ మేవ, అగ్నిః = ఆహవనీయాదిరూపః, అహ మేవ, హుతం = హోమః ॥ 16 ॥

శ్లో॥ *పితాఽహ మస్య జగతో; మాతా ధాతా పితామహః ।*
*వేద్యం పవిత్ర మోంకారః; ఋక్సామ యజురేవ చ ॥* 17

టీ -: అస్య జగతః = ఈ జగత్తునకు; అహం = నేను; పితా = తండ్రిని; మాతా = తల్లిని; ధాతా = ఆ వంశమునకు మూలపురుషుడను. పితామహః = తండ్రికి తండ్రిని; పవిత్రం = పవిత్రమైనది; వేద్యం = తెలియదగినది అయిన; ఓంకారః = ప్రణవము (నేను) ఋక్ = ఋగ్వేదము; సామ = సామవేదము; యజుః + ఏవ చ = యజుర్వేదము నేనే.

తా -: బ్రహ్మాదిస్తంబపర్యంతమైన ఈ జగత్తునకు తండ్రి తల్లి తాత వంశకర్తయు నేనే. అనగా పిత్రాదులయందు అంతర్యామిగా నుండి వారిని కర్తవ్యనిర్వహణసమర్థులను గావించుచున్నాడ నని భావము. తప్పక తెలియదగిన పవిత్రమైన ఓంకారము ఋగ్యజుస్సామ వేదములు నేనే.

దీపికా -: అస్య = బ్రహ్మాదిస్తంబపర్యంతస్య, జగతః, పితా = తత్రతత్ర పితృత్వేన వర్తమాన శ్చేతనః, మాతా = జననీత్వేన వర్తమానః, ధాతా - మాతాపితృవ్యతిరిక్త స్రష్టృచేతనతయాఽవస్థితః, పితామహః = జనకజనకత్వేనాఽవస్థితః, పవిత్రం = పావనం, వేద్యం = జ్ఞేయం, ఓంకారః = పవిత్రవేద్యాఽఽవేదకః సమస్తవేదమూలభూతః ప్రణవః, ఋక్ = పాదవ్యవస్థావా న్మంత్రవిశేషః, సామ = రథంతరాది గానవిశేషసంస్కార్య మంత్రవిశేషః, యజుశ్చ = పాదవ్యవస్థారహితః అఖండ మంత్రవిశేషశ్చ, చకారేణ విధ్యర్థవాదరూపబ్రాహ్మణభాగ స్సముచ్చీయతే, అహ మేవ ॥ 17 ॥

శ్లో॥ *గతిర్భర్తా ప్రభుస్సాక్షీ; నివాసశ్శరణం సుహృత్ ।*
*ప్రభవ ప్రళయస్థానం; నిధానం బీజ మవ్యయమ్ ॥* 18

టీ -: గతిః = ప్రాప్యమైన స్వర్గపృథివ్యాదిస్థానము; భర్తా = ధరించువాడను; ప్రభుః = శాసించువాడను; సాక్షీ = ప్రత్యక్షముగ చూచువాడను; నివాసః = నివసించు స్థానము; శరణం = అశ్రయింప దగినవాడను; సుహృత్ = హితమును కోరువాడను; ప్రభవప్రళయ స్థానం = ఉత్పత్తివినాశములకు స్థానము; నిధానం = (అట్టి స్థానమునందు ఉంచబడిన) కార్య (సముదాయ)ము; అవ్యయం = నాశరహితమైన; బీజం = (అకార్యవర్గమునకు) కారణము నేనే.

తా -: జీవులకు ప్రాప్యమైన భూలోకస్వర్గలోకాదిస్థానములు నేనే. పోషకుడును శాసకుడును సాక్షిని నేనే. జీవులు తలదాచుకొను స్థానము నేనే. వారికి శరణ్యుడను హితైషిని నేనే. కార్యకారణము లన్నియు నేనే. అనగా వీని అన్నిటియందును నేను అంతర్యామిగ ఉండి వీనిచే అయా కార్యములను చేయించుచున్నా నని భావము.

దీపికా -: గమ్యత ఇతి గతిః - స్వర్గపృథివ్యాదిరూపం తత్తత్ప్రాప్యస్థానం, భర్తా = ధారయితా, ప్రభుః = శాసితా, సాక్షీ - అధ్యక్షః -

సాక్షాద్ద్రష్టా, నివాసః = వేశ్మాదివాసస్థానం, శరణం = ఇష్టప్రాప్త్యనిష్ట నివృత్త్యుపాయత్వేన సమాశ్రయణీయతయా తత్రతత్రాఽవస్థితశ్చేతనః, సుహృత్ = హితైషీ చేతనః, ప్రభవప్రళయస్థానం = ప్రభవప్రళయయోః స్థానం, నిధానం = నిధీయత ఇతి నిధానం - ఉత్పాద్య ముపసంహార్యం చ కార్యజాతం, బీజం = యస్య కస్యాపి కార్యస్య సహకార్యాది కారణతయాఽవస్థితం చ వస్తు అహ మేవ ॥ 18 ॥

శ్లో॥ తపామ్యహ మహం వర్షం: నిగృహ్ణా మ్యుత్సృజామి చ।
అమృతం చైవ మృత్యుశ్చ; సదసచ్చాఽహ మర్జున ॥ 19

టీ -: అర్జున = అర్జున; అహం = నేను; తపామి = (సూర్యాది రూపమున) తపింపచేయుచున్నాను. అహం = నేను; వర్షం = జలమును; నిగృహ్ణామి = (మేఘముల రూపమున) స్వీకరించుచున్నాను. ఉత్సృజామి చ = (ఆ జలమును వర్షరూపమున) వదలుచున్నాను. అమృతం చ + ఏవ = జీవనసాధనము; మృత్యుః + చ = మరణసాధనమును(నేనే). సత్ + అసత్ చ = ఇపుడు ఉన్నది ఇకమీద రాబోవునది (అన్నియు) అహమ్ = నేను.

తా -: అర్జున; సూర్యాదుల రూపమున నేను జగత్తును తపింపజేయుచున్నాను. మేఘముల రూపమున నీటిని గ్రహించి వర్షించుచున్నాను. జీవనసాధనములు మరణసాధనములు నేనే. భూతభవిష్యద్వర్తమానకాలములయందలి సకలపదార్థములు నేనే. సర్వశరీరకుడను సర్వాంతర్యామిని సర్వధారకుడను సర్వనియామకుడును నేనే. అని భావము.

దీపికా -: అహ మేవ, తపామి = అగ్న్యాదిత్యాదిరూపేణ స్థిత్వా గ్రీష్మసమయే జగతస్తాపం కరోమీత్యర్థః, అహ మేవ, వర్షం = జలం, నిగృహ్ణామి = పర్జన్యాదిరూపేణ స్వీకరోమి, అహమేవ, ఉత్సృజామి చ = ప్రావృషి ముంచామి చ, అమృతం చ = జీవనసాధనభూతం చ,

మృత్యుశ్చ=మరణసాధనం చ వస్తు అహమేవ, కింబహునా, సత్=వర్తమానం, అసచ్చ=అతీత మనాగతం చ - చిదచిద్వస్తుజాతం, అహమేవ ॥ 19 ॥

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥ 20

టీ -: త్రైవిద్యాః=వేదత్రయబోధిత కేవలకర్మనిష్ఠులు; సోమపాః=సోమరసపానము జేసినవారు; పూతపాపాః = శోషింపజేయబడిన పాపములుగలవారునై; యజ్ఞైః=ఇంద్రాదులను పూజించునట్టి యాగములచేత; మాం=(ఇంద్రాదేవతలకు అంతర్యామిగా ఉన్న) నన్ను; ఇష్ట్వా=పూజించి; స్వః+గతిం = స్వర్గలోకప్రాప్తిని; ప్రార్థయన్తే = ప్రార్థించుచున్నారు. తే=అట్టివారు; పుణ్యం=సుఖమయమైన; సుర+ఇంద్రలోకం=స్వర్గలోకమును; అసాద్య=చేరి; దివి=(అ) స్వర్గమునందు; దేవభోగాన్=దేవతల భోగములను; అశ్నన్తి = అనుభవించుచున్నారు.

తా -: వేదాంతనిష్ణాతులు కాక కేవలకర్మనిష్ఠులైనవారు ఇంద్రాది దేవతలను ఉద్దేశించి యజ్ఞములను గావించి అందు సోమరసపానముచేత తమపాపములను తొలగించుకొని స్వర్గలోకము జేరి అచట ఇంద్రభోగములను అనుభవింతురు. (అ ఇంద్రాదులయందు అంతర్యామిగా నేను ఉన్నానని వారు గుర్తింపలేరు).

దీపికా -: ఏవం మహాత్మనాం జ్ఞానినాం భగవదనుభవైక భోగత్వరూపం వృత్త ముక్త్వా తేషామేవ విశేషం దర్శయితుం భగవద్వ్యతిరిక్త కామోపహతానా మజ్ఞానాం వృత్త మాహ (త్రైవిద్యా ఇతి) తిస్రో విద్యాస్సమాహృతాస్త్రివిద్యం - త్రివిద్య మధీయతే విదు రితి వా-త్రైవిద్యాః=

ఋగ్యజుస్సామరూప వేదత్రయప్రతిపాద్య కేవలకర్మనిష్ఠాః, యజ్ఞైః = కేవలేంద్రాద్యారాధనతయా అనుసంహితైర్యాగైః, మాం = ఇంద్రాద్యంతర్యామిణం, ఇష్ట్వా = ఆరాధ్య, సోమపాః - సోమం = యజ్ఞశిష్టం సోమరసం పిబంతీతి తథోక్తాః, అతఏవ, పూతపాపాః - పూతాని = శోషితాని - పాపాని = స్వర్గాదిప్రాప్తివిరోధిదురితాని యేషాం తే-తథోక్తాః, స్వర్గతిం ప్రార్థయంతే, ఇంద్రాదీన్ యాచంత ఇత్యర్థః, తే = జనాః, పుణ్యం = దుఃఖాఽసంభిన్నసుఖరూపం, సురేంద్రలోకం = స్వర్గలోకం, ఆసాద్య = ప్రాప్య; దివి = స్వర్గే, దివ్యాన్ = అమానుషాన్, దేవభోగాన్ - దేవానాం = ఇంద్రాదీనాం - భోగాన్ - భోగ్యాన్‌శబ్దాదీన్విషయాన్, అశ్నంతి = భుంజతే ॥ 20 ॥

శ్లో॥ *తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం*
*క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి,*
*ఏవం త్రయీధర్మ మనుప్రపన్నాః*
*గతాగతం కామకామా లభన్తే*॥ 21

టీ - తే = వారు; విశాలం = అతివిస్తృతమైన; తం స్వర్గలోకం = ఆ స్వర్గలోకమును (స్వర్గసుఖమును) భుక్త్వా = అనుభవించి; పుణ్యే = (దానికి కారణమైన) పుణ్యము; క్షీణే = క్షీణింపగనే; మర్త్యలోకం = భూలోకమును; విశంతి = ప్రవేశింతురు. ఏవం = ఇట్లు; కామకామాః = స్వర్గాదికమును కోరువారై; త్రయీధర్మం + అనుప్రపన్నాః = కేవలకర్మ మార్గమును అనుసరించినవారు; గత + ఆగతం = (ముల్లోకములయందు) యాతాయాతశ్రమను; లభన్తే = పొందుచున్నారు.

తా -: స్వర్గాదిఫలములను అపేక్షించి కర్మల నాచరించువారు స్వర్గాదిభోగములను అనుభవించి తమ పుణ్యము క్షీణించినంతనే భూలోకమునకు తిరిగి వచ్చెదరు. ఇట్లు సంసారమండలమునందే పరిభ్రమించుచుందురు.

దీపికా -: తే=స్వర్గభోక్తారః త్రైవిద్యాః, విశాలం = విస్తీర్ణం, తం=ప్రార్థితం, స్వర్గలోకం = స్వర్గసుఖం, భుక్త్వా = అనుభూయ, పుణ్యే = తదనుభవహేతుభూతే సుకృతే, క్షీణే = నష్టే సతి, మర్త్య లోకం = భువం, విశంతి=ప్రాప్నువంతి, ఏవం = అనేన ప్రకారేణ, కామకామాః - కామాన్ = స్వర్గాదికామ్యాన్ - కామయంత ఇతి కామ కామాః, త్రయీధర్మం = త్రయీప్రతిపాద్యం కేవలకర్మ, అనుప్రప న్నాః=అనుసృతవంతః, గతాగతం = ఘటీయంత్రవద్యాతాయాతం, లభంతే, ఇతోగత్వా స్వర్గాద్యల్పాస్థిరఫలాన్యనుభూయ పునరత్రైవాగ చ్ఛన్తీత్యర్థః ॥ 21 ॥

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం; యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం; యోగక్షేమం వహామ్యహమ్ ॥ 22

టీ -: యే జనాః=ఏ మహానుభావులు; అనన్యాః = ప్రయోజ నాంతరనిరపేక్షులై; మాం = నన్ను; చింతయంతః=భావించుచు; పరి + ఉపాసతే=ఉపాసించుచుందురో; తేషాం=అట్టి; నిత్య + అభియుక్తా నాం=నాతో నిత్యసంశ్లేషమును కోరువారియొక్క; యోగక్షేమం=యోగ క్షేమములను; అహం=నేను; వహామి=వహింతును.

తా -: ఏ మహానుభావులు ప్రయోజనాంతరములను కోరక నాతోడి నిత్యసంశ్లేషమునే కోరుచు నన్ను ఉపాసింతురో అట్టివారికి యోగక్షేమములను నేనే కలిగింతును. (యోగము అనగా అంతకు ముందు లేనిది లభించుట. క్షేమము అనగా లభించినది సురక్షితముగ ఉండుట) ఇచట యోగము భగవత్ప్రాప్తి. క్షేమము అపునరావృత్తి.

దీపికా -: జ్ఞానినా మపునరావృత్తి రూపవిశేషం దర్శయతి (అనన్యా ఇతి) న విద్యతేఽన్య త్ప్రయోజనం యేషాం తేఽనన్యాః - ప్రయోజనాంతరవిముఖా మచ్చింతనైక ప్రయోజనా ఇత్యర్థః, మాం - చింతయంతః=సతతంపరిశీలయంతః, యే జనాః - ధన్యజన్మానః,

మాం, పర్యుపాసతే = పరితః స్వరూపరూపగుణవిభూతిభి స్సర్వైః ప్రకారైః ఉపాసతే, నిత్యాఽభియుక్తానాం = మయి నిత్యాభియోగ మాకాంక్షతాం, తేషాం జనానాం, అహం = ఆశ్రితవాత్సల్యైకజలధిః, యోగశ్చ క్షేమశ్చ యోగక్షేమం - యోగః - అప్రాప్త మత్ప్రాప్తిలక్షణో లాభః, క్షేమః - తత్పరిపాలనం; అపునరావృత్తిరితి యావత్. తౌ, వహామి = ప్రాపయామి ॥ 22 ॥

శ్లో॥ *యే త్వన్యదేవతాభక్తాః యజన్తే శ్రద్ధయాఽన్వితాః ।*
*తేఽపి మామేవ కౌన్తేయ; యజన్త్యవిధిపూర్వకమ్ ॥* 23

టీ -: కౌంతేయ = అర్జునా; యే తు = ఎవరైతే; అన్యదేవతాభక్తాః = ఇంద్రాదిదేవతాంతరభక్తులై; శ్రద్ధయా = శ్రద్ధతో; అన్వితాః = కూడినవారై; యజన్తే = (ఆ ఇంద్రాదిదేవతలను) ఆరాధింతురో; తే + అపి = అట్టివారును; మాం + ఏవ = నన్నే; అవిధిపూర్వకం = వేదాంత శాస్త్రవిధిని అనుసరింపక; యజన్తి = ఆరాధించుచున్నారు.

తా -: ఇంద్రాదిదేవతాంతరభక్తులు అత్యంతశ్రద్ధాభక్తులతో వారిని ఆరాధించుచున్నను; ఆ ఇంద్రాదులయందు అంతర్యామిగా ఉన్న నన్నే ఆరాధించుచున్నారు. కాని వేదాన్తశాస్త్రతాత్పర్యమును తెలియనందు వలన వారు ఈ విషయమును గుర్తింపలేకున్నారు. "చతుర్హోతారో యత్ర సంపదం గచ్ఛన్తి దేవైః" (య. అ. 3-11-12) "అగ్నిహోత్ర దర్శపూర్ణమాసాదికర్మలు ఇంద్రాదిదేవతలచే అతిశయము నందుట(వారి యందు అంతర్యామిగా ఉన్న) పరమాత్మనుబట్టియే" అని శ్రుతి ప్రమాణము.

దీపికా -: నన్విన్ద్రాద్యారాధనమపి తచ్ఛరీరిణో మమైవారాధన మితి జానన్నపి భవాన్ కేవలకర్మిణామపి మోక్షరూపం యోగక్షేమం కిమితి న ప్రయచ్ఛతీత్యత ఆహ "యేత్వి" త్యాదిశ్లోకద్వయేన, తుశబ్ద శ్శంకానిరాసార్థః, యే = జనాః, అన్యదేవతాభక్తాః - అన్యదేవతాస్విం

ద్రాదిషు భక్తాః - ప్రీతిమంతః, శ్రద్ధయా=విశ్వాసేన - ఆస్తిక్యబుద్ధ్యా, అన్వితాస్సంతః, యజంతే - ఇంద్రాదీన్ కేవలకర్మభి రారాధయంతే' హే కౌంతేయ, తేఽపి, మామేవ=సర్వశరీరకతయా సర్వస్య మదాత్మకత్వేన సర్వశబ్దవాచ్యం మామేవ, యజంతే = వస్తుతః ఆరాధయంతే, కింతు, అవిధిపూర్వకం - విధిః = విద్యర్థయాథాత్మ్యజ్ఞానం, పూర్వం న విద్యతేయస్మిన్ కర్మణి తద్యథా తథా అవిధిపూర్వకం యజంతి, "చతుర్హోతారో యత్ర సంపదం గచ్ఛంతి దేవై" రిత్యాది వేతాంతవాక్యాని కర్మస్వింద్రాదిదేవానా మారాధ్యతయాఽన్వయం యథావిదధతి తథా తద్విధిజ్ఞానపూర్వకం న యజంతీత్యర్థః, చతుర్హోతారః = అగ్నిహోత్ర దర్శపూర్ణమాసాదీని కర్మాణి, యత్ర=పరమాత్మని, అత్మతయా సత్యేవ, దేవైస్తచ్ఛరీరభూతై రింద్రాదిభిః, సంపదం = ఇంద్రాదిదేవతారాధనత్వ రూప మతిశయం, గచ్ఛంతి=ప్రాప్నువంతీత్యర్థః, ॥ 23 ॥

*శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం; భోక్తా చ ప్రభురేవ చ।*
*నతు మా మభిజానన్తి; తత్త్వేనాఽతశ్చ్యవన్తి తే ॥* 24

టీ -: సర్వయజ్ఞానాం = సమస్తయజ్ఞములకు; భోక్తా చ = భోక్తను; ప్రభుః+ఏవ చ=ఫలప్రదాతను; అహం హి = నేనే గదా; తే=ఆ ఇంద్రాదుల నారాధించువారు; తత్త్వేన=యథార్థముగ;మాం= నన్ను; న+అభిజానన్తి=ఎఱుగరు; అతః=ఇందువలన; చ్యవన్తి= భ్రంశమును పొందుచున్నారు.

తా -: ఎవరు ఏ దేవతను ఆరాధించినను వారు నన్నే ఆరాధించినవారగుచున్నారు. వారిచే ఆరాధింపబడువాడను వారికి ఫలము నొసంగువాడను నేనే. శాస్త్రములు బోధించు ఈ తత్త్వమును తెలియ నందువలననే వారు అల్పభోగముల ననుభవించి మరల అధోలోకములకు పోవుచున్నారు.

దీపికా -: త్రైవిద్యానా మవిధిపూర్వక యజనస్య ఫల మాహ (అహమితి) అహం=సర్వశరీరతయా - ఇంద్రాదిరూపోఽహమేవ, సర్వ

యజ్ఞానాం = సర్వేషాం త్రయీధర్మాణాం, భోక్తా = అరాధ్యశ్చ, ప్రభుః = తత్రతత్ర ఫలప్రదాతా చ, 'హి' శబ్దేనాఽస్యార్థస్య వేదాంతప్రసిద్ధిం ద్యోతయతి, కింతు - తే = త్రైవిద్యాః మాం, తత్త్వేన - సర్వేషాం కర్మణా మింద్రాదిశరీరకః పరమాత్మైవారాధ్యః ఫలప్రద శ్చేత్యేవం రూపేణ యాథార్థ్యేన, నాఽభిజానంతి = న బుధ్యంతే, అతః = తత్త్వతోఽజ్ఞానాద్ధేతోః, చ్యవంతి = భ్రశ్యంతి, సర్వథా తత్ప్రవృత్తివైఫల్యమితి భావః ॥ 24 ॥

శ్లో॥ *యాన్తి దేవవ్రతా దేవాన్: పితౄన్ యాన్తి పితృవ్రతాః,*
*భూతాని యాన్తి భూతేజ్యాః; యాన్తి మద్యాజినోఽపి మామ్॥ 25*

టీ -: దేవవ్రతాః = ఇంద్రాదేవతల నారాధింపవలయునను సంకల్పము గలవారు; దేవాన్ = ఇంద్రాదిదేవతలను; యాన్తి = పొందుచున్నారు. పితృవ్రతాః = పితృదేవతల నారాధింప సంకల్పించినవారు; పితౄన్ = పితృదేవతలను; యాన్తి = పొందుచున్నారు. భూత + ఇజ్యాః = యక్షరాక్షసాదులను ఆరాధించువారు; భూతాని = యక్షరాక్షసాదిభూతములను; యాన్తి = పొందుచున్నారు. మత్ + యాజినః = నన్ను ఆరాధించువారు; మాం = నన్ను; యాన్తి = పొందుచున్నారు.

తా -: ఇంద్రాదిదేవతారాధకులు ఇంద్రాదిదేవతలను; పితృదేవతారాధకులు పితృదేవతలను; యక్షరక్షఃపిశాచాదుల నారాధించువారు ఆ యక్షరాక్షసాదులను; నన్నారాధించువారు నన్ను పొందుచున్నారు. అనగా మోక్షమును పొందుచున్నారని భావము.

ఇచట శ్రీశంకరభాష్యపంక్తిని గమనించునది. "భూతాని = వినాయకమాతృగణచతుర్భగిన్యాదని...... యాన్తి మద్యాజినః = మద్యజనశీలాః వైష్ణవాః; మామేవ. సమానేఽపి ఆయాసే మామేవ న భజన్తే అజ్ఞానాత్ - తేన తే అల్పఫలభాజః భవన్తీత్యర్థః".

దీపికా -: నన్వేకస్యైవ కర్మణః కథం భోగమోక్షరూప విరుద్ధ ఫలసాధనత్వ మిత్యాశంక్య సంకల్పాఖ్య సహకారివైచిత్ర్యా త్తదుపపన్న మిత్యాహ (యాంతీతి)దేవవ్రతాః-అత్రవ్రతశబ్దస్సంకల్పవాచీ, దేవేషు = ఇంద్రాదిషు కేవలేషు వ్రతం = దర్శపూర్ణమాసాదీన్యక్ష్యామహ ఇతి యజనసంకల్పః - యేషాం తే తథోక్తాః, దేవాన్=ఇంద్రాదీన్, యాంతి, పితృవ్రతాః - పితృషు - కేవలేషు, వ్రతం = పితృయజ్ఞాదిభిః పితౄన్యక్ష్యామహ ఇతియజనసంకల్పో యేషాం తే తథోక్తాః, పితౄన్ యాంతి, భూతేషు=కేవలేషు యక్షరక్షఃప్రభృతిషు, ఇజ్యా = అనేన కర్మణా యక్షాదీన్యక్షామహ ఇతి సంకల్పపూర్వకం యజనం యేషాం తే తథోక్తాః, భూతాని యాంతి. మద్యాజినోఽపి - అనేన కర్మణా సర్వజ్ఞం సత్య సంకల్పం పరమకారుణికం పరమాత్మానం యక్ష్యామహ ఇతి సంకల్ప పూర్వకం మా మారాధయంతస్తు పురుషాః, మాం యాంతి = అనాది నిధనం అనవధికాఽతిశయాఽసఖ్యేయకళ్యాణగుణగణం అనవధికాఽతి శయానందం మాం ప్రాప్య పునర్న నివర్తంతే ॥ 25 ॥

శ్లో॥ *పత్రం పుష్పం ఫలం తోయం; యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।*
*తదహం భక్త్యుపహృత; మశ్నామి ప్రయతాత్మనః॥* 26

టీ -: యః=ఎవడు; మే=నాకు; భక్త్యా = భక్తితో; పత్రం= (తులసి మొదలైన) పత్రమునుగాని; పుష్పం=పుష్పమునుగాని;ఫలం= పండును గాని; తోయం=తీర్థమును (జలమును) గాని; ప్రయచ్ఛతి= సమర్పించునో; ప్రయత+ఆత్మనః=(పత్రపుష్పాదులను నాకు సమ ర్పించుటయే పరమప్రయోజన మని భావించుటచే) పరిశుద్ధమైన మనస్సుగల అతనియొక్క; భక్తి+ఉపహృతం = భక్తితో సమర్పింప బడిన; తత్=ఆ పత్రపుష్పాదికమును; అశ్నామి=భుజించుచున్నాను.

తా -: నాకు సమర్పించుటయే పరమప్రయోజన మని తలంచు పరిశుద్ధమనస్కుడు - భక్తితో సమర్పించునటువంటి పత్రపుష్పాదిక

మును సైతము అవాప్తసమస్తకాముడనైన నేను పరమప్రీతితో స్వీక రింతును. (భక్తిసులభుడు అని భావము.)

దీపికా -: యః=అత్యర్థమత్ప్రియః పురుషః, భక్త్యా = అత్యర్థ ప్రీతిరూపతా మాపన్నేన జ్ఞానేన, యే=మహ్యం, పత్రం, పుష్పం, ఫలం, తేషా మభావే సర్వసులభం తోయం వా, ప్రయచ్ఛతి = తదేక ప్రయోజన స్సమర్పయతి, ప్రియతాత్మనః=తత్ప్రదానైకప్రయోజనత్వ రూపశుద్ధియుక్తమనస స్తస్య, భక్త్యుపహృతం = భక్త్యా సమర్పితం, తత్= పత్రాదిక మేవ, అహం = సర్వేశ్వరోఽవాప్తసమస్తకామోఽపి, అశ్నామి = మనోరథపథదూరవర్తిప్రియం ప్రాప్యేవాఽశ్నామి, అత్ర చ "అన్య త్పూర్ణా దపాం కుభా దన్యత్పాదాఽవనేజనాత్, అన్య త్కుశలసంప్రశ్నా న్నచేచ్ఛతి జనార్దనః, యాః క్రియా స్సంప్రయుక్తాస్స్యురేకాంతగత బుద్ధిభిః, తా స్సర్వా శ్శిరసా దేవః ప్రతిగృహ్ణాతి వై స్వయం॥ ఇత్యాదిక మనుసంధేయం ॥ 26 ॥

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి; యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ; తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27

టీ -: కౌంతేయ=అర్జున; యత్=ఏ లౌకికార్యమును; కరోషి= చేయుచున్నావో; యత్=దేనిని; అశ్నాసి=భుజించుచున్నావో; యత్= దేనిని; జుహోషి=హోమ మొనర్చుచున్నావో; యత్=దేనిని; దదాసి= దానము జేయుచున్నావో; యత్+తపస్యసి=ఏ తపస్సును ఆచరించు చున్నావో; తత్=దాని నంతటిని; మత్+అర్పణం=నాకుసమర్పించు నట్లుగా; కురుష్వ=చేయుము.

తా -: అర్జున; దేహయాత్రకొఱకు దేహపోషణకొఱకు చేయు లౌకికకార్యములను; హోమము దానము తపస్సు మొదలైన వైదిక కర్మలను నాకు అర్పితములగునట్లు ఆనుష్ఠింపుము. నీవు చేయు కర్మ లకు అన్నింటికి కర్తను భోక్తను ఆరాధ్యుడను నేనే అని భక్తితో భావింపుము.

దీపికా -: యస్మాత్ జ్ఞానినా మయ మవాఙ్మనసగోచరో విశేషః - తస్మాత్త్వమపి జ్ఞానీభూత్వా క్రియామాణం కర్మేత్థంకుర్వి త్యాహ (యదితి) యత్=దేహయాత్రాశేషభూతం లౌకికం కర్మ, యదశ్నాసి - దేహధారణాయ యదదనం కరోషి, యజ్జుహోషి - హోమరూపం యద్వైదికం కర్మ కరోషి, యద్దదాసి=దానరూపం యత్కర్మ కరోషి, యత్తపస్యసి=తపోరూపం యత్కర్మ కరోషి, హే కౌంతేయ, తత్సర్వం, మదర్పణం=అర్ప్యత ఇత్యర్పణం - మయ్యర్పితం కురుష్వ. అనుష్ఠీయమానస్య సర్వస్య లౌకికస్య వైదికస్య చ కర్మణః కర్తృత్వం భోక్తృత్వ మారాధ్యత్వం చాఽత్యంతభక్తియుక్తో మయ్యనుసంధత్స్వేత్యర్థః ॥ 27 ॥

శ్లో॥ *శుభాఽశుభఫలై రేవం; మోక్ష్యసే కర్మబంధనైః ।*
*సన్న్యాసయోగయుక్తాత్మా; విముక్తో మా ముపైష్యసి ॥* 28

టీ -: ఏవం=ఇట్లు; సన్న్యాసయోగయుక్త+ఆత్మా = సర్వకర్మలను నాయందు సమర్పించుట అను భావనతో గూడిన మనస్సు గలవాడవై; శుభ+అశుభఫలైః=అనుకూలప్రతికూలఫలములుగల; కర్మబంధనైః=ప్రాచీనకర్మములనెడి బంధనములచేత; మోక్ష్యసె=విడువబడగలవు. విముక్తః = (అట్లు) బంధవిముక్తుడవై; మాం = నన్ను; ఉప+ఏష్యసి = పొందగలవు.

తా -: సర్వకర్మలను నాయందు సమర్పించుటయే సన్న్యాసము. అట్టి భావన గలవాడు శుభాఽశుభఫలప్రదములై మత్ప్రాప్తివిరోధులైన సకలకర్మబంధములనుండి విముక్తుడై నన్ను పొందును.

దీపికా -: ఏవం = ఉక్తరీత్యా, సంన్యాసయోగయుక్తాత్మా- సన్న్యాసః సర్వకర్మణాం మయ్యర్పణం - స ఏవ యోగః - అనుసంధానం, తేన యుక్తః ఆత్మా = మనః యస్య స తథోక్తః, త్వం, శుభాఽశుభఫలైః - శుభాని=అనుకూలాని, అశుభాని=ప్రతికూలాని చ-

ఫలాని - యేషాం తై స్తథో క్తైః, కర్మబంధనైః - కర్మాణి (ప్రాచీనాన్యేవ - బంధనాని మత్వా) ప్రతిబంధకాని - తైః, విమోక్ష్యసే = ముక్తో భవిష్యసి, విముక్తస్సన్, మా మేవ, ఉపైష్యసి ॥ 28 ॥

శ్లో॥ *సమోఽహం సర్వభూతేషు; న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।*
*యే భజన్తి తు మాం భక్త్యా; మయి తే తేషు చాఽప్యహమ్॥29*

టీ -: అహం = నేను; సర్వభూతేషు = సకలప్రాణులయందును; సమః = సమభావము కలవాడను; మే = నాకు; ద్వేష్యః = ద్వేషింపబడదగినవాడు; న + అస్తి = లేడు; ప్రియః = ప్రత్యేకించి ఆదరింపదగినవాడును; న = లేడు. యే = ఎవరు; భక్త్యా = భక్తితో; మాం = నన్ను; భజన్తి = సేవింతురో; తే = వారు; మయి = నాయందు (ఉందురు). తేషు = వారియందు; అహం + అపిచ = నేను (ఉందును).

తా -: నేను అందరియందు సమభావము గలవాడను. నాకు ద్వేషింపదగినవాడు గాని ప్రేమింపదగినవాడుగాని లేడు. కావున నేను సర్వసమాశ్రయణీయుడను. నన్ను భక్తితో సేవించువారు నాయందును నేను వారియందును ఉందుము. (నాతో కలిసి అపరిచ్ఛిన్నానన్దమును అనుభవింతురు).

దీపికా -: అథ జాత్యాకారాదికృత తారతమ్యానాదరేణ భక్తేషు స్వస్యైకరస్య మాహ (సమ ఇతి) అహం, సర్వభూతేషు-జాత్యాకారాదిభిరుత్కృష్టాపకృష్టతయావర్తమానేషు దేవతిర్యఙ్మనుష్యాదిసమస్తభూతేషు, సమః = సమాశ్రయణీయత్వే తుల్యః, తదేవ స్ఫుటీకరోతి, మే = మమ, ద్వేష్యః = జాత్యాకారాదిభి ర్నికృష్టతయా సమాశ్రయణే పరిహరణీయః న విద్యతే, ప్రియః = జాత్యాదిభి రుత్కృష్టతయా సమాశ్రయణే సంగ్రాహ్యోఽపి న విద్యతే, ఏవంత్వర్హి సచ మమ ప్రియ ఇత్యుక్త్యా ప్రియత్వం విరుధ్యత ఇత్యత్రాహ (య ఇతి) తు శబ్దశ్శంకానిరాసార్థః, యే = జాత్యాదిభిరుత్కృష్టా వా అపకృష్టా వా భక్త్యా మాం భజంతి = ఉపాసతే తే మయి, వర్తంతే = మత్సమానా ఇవ యథాసుఖం మయి

వ్యవహరంతి, తేషు చ అహమపి, వర్తే=ఉత్కృష్టేష్వివ వ్యవహరామి "నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శినం, అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రిరేణుభిః" ఇత్యాదిక మత్రాఽనుసంధేయం ॥ 29 ॥

శ్లో॥ *అపిచేత్సుదురాచారో; భజతే మా మనన్యభాక్ ।*
*సాధురేవ స మన్తవ్యః; సమ్యగ్వ్యవసితో హి సః ॥* 30

టీ -: సుదురాచారః + అపి = మిక్కిలి దుష్కృత్యములను చేయువాడైనను; అనన్యభాక్=ఇతరప్రయోజనము లేనివాడై; మాం= నన్ను; భజతేచేత్ = సేవించినచో; సః=అతడు; సాధుః + ఏవ= సజ్జనుడుగనే; మంతవ్యః = గౌరవింపదగియున్నాడు. సః = అతడు; సమ్యక్+వ్యవసితః+హి=చక్కని నిశ్చయము గలవాడు గదా.

తా -: ఎంతటి దురాచారపరుడైనను అనన్య ప్రయోజనముగ నన్ను సేవించుచో అతడు సజ్జనుడే అగుచున్నాడు. అతని నిశ్చయమే సరియైనది.

దీపికా -: సమాశ్రయణే జాత్యాద్యపకర్షోఽప్రయోజక ఇత్యుక్తం, తథా వృత్తాపకర్షశ్చాఽప్రయోజక ఇత్యాహ (అపీతి) సుదురాచారః- సుష్ఠు దురాచారః - తత్తజ్జాత్యాద్యుచితాచార విపరీతాచార విహితాకరణాఽవిహితకరణరూప దుష్టాచారో యస్య స తథోక్తోఽపి, అనన్యభాక్- భజనైకప్రయోజనస్సన్, మాం, భజతేచేత్ ఉక్తప్రకారేణోపాస్తే యది, సః, సాధురేవ వైష్ణవాగ్రేసర ఏవ, మంతవ్యః=బహుమంతవ్యః, కుత ఏత దిత్యత ఆహ(సమ్యగితి) హి = యస్మాత్ కారణాత్, సః=సమ్యక్, సమీచీనం యథాతథా, వ్యవసితః=వ్యవసాయం కృతవాన్,భగవాన్నారాయణ ఏవ చరాచరపతి రస్మత్స్వామీ పరమభోగ్య ఇత్యేవంరూప దృఢాఽధ్యవసాయ ఇతి భావః ॥ 30 ॥

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా; శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి,
కౌన్తేయ! ప్రతిజానీహి; న మే భక్తః ప్రణశ్యతి ॥ 31

టీ -: క్షిప్రం=శీఘ్రముగ; ధర్మ+ఆత్మా=(అతడు) ధర్మము నందే మనస్సుగలవాడుగ; భవతి=అగుచున్నాడు. శశ్వత్ = శాశ్వత మైన; శాంతిం=శాంతిని; నిగచ్ఛతి=పొందుచున్నాడు. మే=నాయొక్క; భక్తః=భక్తుడు; న ప్రణశ్యతి=నశింపడు. (అని) కౌంతేయ=అర్జున; ప్రతిజానీహి=ప్రతిజ్ఞ యొనర్పుము.

తా -: అనన్యప్రయోజనముగ నన్ను సేవించువాడు ధర్మనిష్ఠ గలవాడై శాశ్వతమైన శాంతిని పొందుచున్నాడు. అర్జున నా భక్తుడు ఎన్నటికి నశింపడని ప్రతిజ్ఞ యొనర్పుము.

దీపికా -: అస్త్వయ మన్యేషాం బహుమంతవ్యః, తస్య తు న కార్యసిద్ధిః - "నాఽవిరతో దుశ్చరితా" దితి శ్రుతే రాచారవ్యతిక్రమ స్యోత్తరోత్తర భజనోత్పత్తి ప్రవాహవిరోధిత్వా దిత్యత్రాహ (క్షిప్రమితి) దురాచారోఽపి, క్షిప్రమేవ = శీఘ్రమేవ, ధర్మాత్మా - ధర్మే=సపరి కరేఽనన్యమద్భజనరూప ధర్మ ఏవ, ఆత్మా=మనః యస్య స తథో క్తః, భవతి = ఉపాసనాప్రతిబంధక రజస్తమోమూలభూత పాపనివృ త్త్యర్థో హి సదాచారః, తాదృశే పాపేఽనన్యప్రయోజన మద్భజనోప క్రమేణ నివృత్తే సతి ప్రతిబంధకాఽభావా దవిలంబేనైవ మద్భజన ప్రవా హైకమనా భవతీత్యర్థః, శశ్వత్ - శాశ్వతీం-అపునరావర్తినీం, శాంతిం= మత్ప్రాప్తివిరోధ్యాచారనివృత్తిం చ నిగచ్ఛతి, హే కౌంతేయ, ప్రతిజా నీహి=త్వమేవాస్మిన్నర్థే ప్రతిజ్ఞాం కురు, ప్రతిజ్ఞాతవ్య మర్థమాహ(నేతి) మే=మమ, భక్తః=భక్త్యుపక్రాంతః, న ప్రణశ్యతి = విరోధ్యాచార మిశ్రోఽపి న నశ్యతి, అపితుభక్త్యుపక్రమ మాహాత్మ్యేన సర్వం విరోధి జాతం విధూయ విరుద్ధాచారశాంతి మప్యధిగమ్య శీఘ్రమేవ పరిపూర్ణ భక్తి ర్భవతీత్యర్థః ॥ 31 ॥

శ్లో॥ *మాం హి పార్థ! వ్యపాశ్రిత్య! యేఽపి స్యుః పాపయోనయః ।*
*స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః స్తేఽపి యాన్తి పరాం గతిమ్॥ 32*

టీ -: పార్థ=అర్జున; యే = ఎవరు; పాపయోనయః + అపి = పాపజన్ములగ; స్యుః = అగుచున్నారో; తే=ఆ; స్త్రియః = స్త్రీలు; వైశ్యాః=వైశ్యులు; తథా=అట్లే; శూద్రాః + అపి=శూద్రులును;మాం= నన్ను; వి + అప + ఆశ్రిత్య = ఆశ్రయించి;పరాం గతిం= ఉత్తమగతిని; యాన్తి హి=పొందుచున్నారు గదా.

తా -: అర్జున; పాపజన్ములు స్త్రీలు వైశ్యులు శూద్రులును నన్ను సేవించి ఉత్తమగతిని పొందుచున్నారు.

దీపికా -: జాత్యుత్కర్షే భక్తిప్రాప్త్యే చ కైముత్యన్యాయేన పరమగతిప్రాప్తిం వదన్ జాత్యాదిభి రుత్కృష్టత్వమపి ఫలే నిస్సం దేహ ఉపాయ మనుతిష్ఠేత్యాహ "మాం హి" త్యాదిశ్లోకద్వయేన, హే పార్థ, పాపయోనయోఽపి=పాపజన్మానోఽపి. యే, స్త్రియః, వైశ్యాః, శూద్రాశ్చ,స్యుః=సన్తి,తేఽపి మాం వ్యపాశ్రిత్య పరాం గతిం, యాంతి హి ॥ 32 ॥

శ్లో॥ *కింపునర్బ్రాహ్మణాః పుణ్యాః; భక్తా రాజర్షయ స్తథా ।*
*అనిత్య మసుఖం లోక; మిమం ప్రాప్య భజస్వ మామ్॥ 33*

టీ -: పుణ్యాః =పుణ్యశీలురు; భక్తాః = భక్తులునైన; బ్రాహ్మణాః=బ్రాహ్మణులు; రాజ + ఋషయః = రాజర్షులు; తథా = అట్లు ఉత్తమగతిని పొందగలరని; కింపునః = మరల చెప్పవలయునా? అనిత్యం = అస్థిరమైనది; అసుఖం=సుఖము లేనిది అయిన; ఇమం లోకం= ఈ లోకమును; ప్రాప్య=పొది (పొందిననీవు) మాం = నన్ను; భజస్వ= సేవింపుము.

తా -: పుణ్యశీలురు భగవద్భక్తులు అయిన బ్రాహ్మణులు రాజర్షులు నన్ను సేవించి ఉత్తమగతిని పొందెదరని చెప్ప నవసరము లేదు. కావున అస్థిరము సుఖరహితము నైన ఈ ప్రపంచమునను న్న నీవును నన్ను పొంది సద్గతిని పొందుము.

దీపికా -: పుణ్యాః = పుణ్యయోనయః, భక్తాః = మయి భక్తిమంతః, బ్రాహ్మణాః = ద్విజాః, తథా రాజర్షయః = ఋషితుల్యాః - రాజానః - క్షత్రియాశ్చ, కింపునః = పరాం గతిం యాంతీతి కిం వక్తవ్యం, అనిత్యం = అస్థిరం, అసుఖం = తాపత్రయాభిభూతతయా దుఃఖరూపం, ఇమం = అతిక్షుద్రం, లోకం ప్రాప్య వర్తమానో రాజర్షిస్త్వం, మాం భజస్వ = మద్భక్తి మనుతిష్ఠ ॥ 33 ॥

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో; మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ; మాత్మానం మత్పరాయణః ॥ 34

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్యయోగో నామ
నవమోఽధ్యాయః.

టీ -: మత్ + మనాః = నాయందే నిలిపిన మనస్సు గలవాడవుగ; భవ = అగుము. మత్ + భక్తః = నాకు భక్తుడవుగ; మత్ + యాజీ = నన్ను పూజించువాడవుగ; భవ = అగుము, మాం = నన్ను; నమస్కురు = నమస్కరింపుము. మత్ + పరాయణః = నన్నే ప్రాప్యముగ తలంచినవాడవై; ఏవం = ఇట్లు; ఆత్మానం = మనస్సును; యుక్త్వా = పొంది; మాం + ఏవ = నన్నే; ఏష్యసి = పొందగలవు.

తా -: అర్జున; నాకు భక్తుడవై నన్నే ధ్యానించుచు నన్నే నమస్కరించుచు నన్నే పరమప్రాప్యముగ నిశ్చయించి ఉపాసింపుము. తప్పక నన్ను పొందగలవు.

దీపికా -: భక్తిస్వరూప మాహ(మన్మనా ఇతి) మద్భక్తః=మయ్యత్యర్థప్రీతియుక్తస్సన్, మన్మనాః=మయ్యేవ మనః = తైలధారావదవిచ్ఛిన్నా స్మృతిసంతానరూపా మనోవృత్తిః యస్య స తథోక్తః, భవ, తథా, మద్యాజీ = పరిపూర్ణశేషవృత్తిరూప మద్యజనశీలః భవ, కించ, మాం నమస్కురు - మయి మనసోఽతిమాత్రప్రహ్వీభావ వ్యవసాయరూపం నమస్కారం కురు, ణము ప్రహ్వత్వ ఇతి హి ధాతుః, ఏవం- ఉక్తరూపం - మన్నమస్కార మద్యజన మద్భక్తియుక్త మదేకవిషయవృత్తివిశేషవంత మిత్యర్థః, ఆత్మానం = మనః, యుక్త్వా = లబ్ధ్వా, మత్పరాయణః=అహమేవ పర మయనం యస్య స తథోక్తః, మయా వినాత్మధారణాఽశక్త్యా మదేకాశ్రయ ఇత్యర్థః, మా మేవ, ఏష్యసి= ప్రాప్స్యసి ॥ 34 ॥

ఇతి శ్రీభగవద్గీతాభాష్యార్థ సంగ్రహతాత్పర్యదీపే శ్రీవరవరముని విరచితాయాం బాలబోధిన్యపరాభిధానాయాం గీతార్థసంగ్రహ దీపికాయాం నవమోఽధ్యాయః

—o—

శ్రీరస్తు

గీతార్థసంగ్రహః

శ్లో॥ స్వమాహాత్మ్యం; మనుష్యత్వే పరత్వం చ; మహాత్మనామ్।
విశేషో నవమే యోగో భక్తిరూపః ప్రకీర్తితః॥

టీ -: స్వమాహాత్మ్యం = తనమాహాత్మ్యము; మనుష్యత్వే = మనుష్యుడుగఅవతరించిన దశయందును; పరత్వం చ=(తన) పరాత్పరత్వము; మహాత్మనాం = జ్ఞానులయొక్క; విశేషః = విశేషము; భక్తిరూపం=భక్తిరూపమైన; యోగః=యోగము; (ఉపాయము) నవమే= తొమ్మిదవ అధ్యాయమునందు; ప్రకీర్తితః=చెప్పబడినది.

తా - ఈతొమ్మిదవ అధ్యాయమునందు భగవంతుడు తన మాహాత్మ్యమును అవతారదశయందును వీడని తన పరత్వమును జ్ఞానులకు గల విశేషమును భక్తిరూపమైన ఉపాయమును బోధించినాడు.

---

శ్రీ రస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భగవద్గీతామృతము

## దశమాధ్యాయము — విభూతియోగము

శ్రీభగవానువాచ —:

శ్లో॥ భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥ 1

టీ -: మహాబాహో = అర్జున; అహం = నేను; ప్రీయమాణాయ = ప్రీతిజెందుచున్న; తే = నీకొఱకు; హితకామ్యయా = హితమును చేయ గోరికచే; భూయః + ఏవ = మరల; పరమం = శ్రేష్ఠమైన; యత్ వచః = ఏ మాటను; వక్ష్యామి = చెప్పెదనో; మే = నాయొక్క; తత్ వచః = ఆ మాటను; శృణు = వినుము.

తా -: నా మాహాత్మ్యమును విని సంతోషించుచున్న నీకు నీ హితమును కోరి మరల నా మహాత్మ్యమును విస్తరించి తెలిపెదను. వినుము.

దీపికా -: ఏవం సపరికరో భక్తియోగ ఉక్తః, ఇదానీం భక్త్యుత్పత్తయే తద్వివృద్ధయే చ భగవతో నిరంకుశైశ్వర్యాది కల్యాణగుణానన్త్యం ప్రపంచ్యతే, హే మహాబాహో, మే = మమ, పరమం = ఉత్కృష్టతమం, వచః, భూయ ఏవ = పునరపి, శృణు = సావధాన

మాకర్ణయ, కిం తద్వచ ఇత్యత్రాహ, ప్రీయమాణాయ = మదీయ మాహాత్మ్యశ్రవణే అతిమాత్రప్రీతిమతే, తే = తుభ్యం, హితకామ్యయా = భక్త్యుత్పత్తివివృద్ధిరూప హితకామనయా, అహం యత్ - వచః, వక్ష్యామి = కథయిష్యామి ॥ 1 ॥

శ్లో॥ *న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః ।*
*అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥* 2

టీ -: సురగణాః = దేవసమూహములు; మే = నాయొక్క; ప్రభవం = ప్రభావమును; న విదుః = ఎఱుగరు. మహా + ఋషయః = అతీంద్రియార్థద్రష్టలైనవారును; న విదుః = ఎఱుగరు; అహం = నేను; దేవానాం = దేవతలయొక్క; మహర్షీణాం చ = మహర్షులయొక్కయు; సర్వశః = సమస్తమునకు; ఆదిః + హి = కారణభూతుడను గదా.

తా -: నా ప్రభావమును బ్రహ్మాదిదేవతలు గాని అతీంద్రియ వస్తువులను దర్శింపగల మహర్షులుగాని ఎఱుగజాలరు. వారివారి పుణ్యము ననుసరించి వారికి ఆ జ్ఞానశక్త్యాదులను అనుగ్రహించిన వాడును నేనే.

దీపికా -: వక్ష్యమాణజ్ఞానస్యాదరణీయత్వసిద్ధయే దుర్లభత్వ మాహ (నమ ఇతి) మే = మమ, ప్రభవం - ప్రభావం = మాహాత్మ్యం, సురగణాః = అధికతరజ్ఞానా బ్రహ్మాదిదేవగణా అపి, న విదుః = న జానంతి, మహర్షయః = అతీంద్రియార్థద్రష్టారో బ్రహ్మర్షయోఽపి, న విదుః, తత్ర హేతు మాహ॥ హి = యస్మాత్కారణాత్, దేవానాం మహర్షీణాం చ సంబంధినః, సర్వశః = సర్వస్య చ స్వరూపజ్ఞాన శక్త్యాదేః అహమేవ, ఆదిః = కారణం, తేషాం దేవత్వ మహర్షిత్వాఽవాప్తి హేతు పుణ్యానుగుణ్యేన మయా దత్తం జ్ఞానశక్త్యాదికం పరిమితం అతో మాం యథావన్న జ్ఞాతుం శక్నువంతీతి భావః. అత్ర "యన్న దేవా న మునయో న చాఽహం న చ శంకరః, జానంతి పరమేశస్య తద్విష్ణోః పరమం పద" మిత్యాదిక మనుసంధేయం ॥ 2 ॥

శ్లో॥ యో మా మజ మనాదిం చ; వేత్తి లోకమహేశ్వరం ।
అసమ్మూఢస్స మర్త్యేషు; సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3

టీ -: మర్త్యేషు = మానవులలో; అసమ్మూఢః = మోహమును పొందనివాడై; యః = ఎవడు; అజం = పుట్టుక లేనివాడను; అనాదిం చ = ఆది లేనివాడను అయిన; మాం = నన్ను; సర్వలోకమహేశ్వరం = సర్వలోకములకు గొప్ప శాసకునిగా; వేత్తి = తెలిసికొనునో; సః = అతడు; సర్వపాపేభ్యః = సమస్తపాపములనుండి; విముచ్యతే = విడువబడుచున్నాడు.

తా -: అవతారదశయందు నన్ను సామాన్యవ్యక్తిగ తలంపక కర్మకృతజన్మలు లేక అనాదినై సకలచేతనాఽచేతన విలక్షణుడనై యున్న నన్ను సర్వలోకములను లోకేశ్వరులను శాసించువానినిగ ఎవడు తెలిసికొనునో అతడు నాయందు భక్తి కలుగుటకు విరోధులైయున్న సర్వపాపములనుండి విముక్తు డగుచున్నాడు.

దీపికా -: దేవాద్యచింత్య స్వమాహాత్మ్యజ్ఞానస్య భక్త్యుత్పత్తివిరోధి పాపవిమోచనోపాయతా మాహ (య ఇతి) మర్త్యేషు = మనుష్యేషుమధ్యే, అసమ్మూఢః = ఇతరసజాతీయతయా ఏకీకృత్య మోహః - సమ్మోహః, తద్రహితః, యః = మనుష్యః, న జాయత ఇత్యజం = కర్మకృతాఽచిత్సంసర్గరూపజన్మరహితం, అనేన వికారిద్రవ్యా దచేతనా త్తత్సంసృష్టబద్ధచేతనాచ్చ వైలక్షణ్య ముక్తం, సహి కర్మకృతాఽచిత్సంసర్గరూప జన్మవాన్, కదాచి దజత్వం ముక్తస్యాఽప్యస్తీతి తద్వైలక్షణ్యార్థ మాహ (అనాది మితి) అజత్వేనాఽనాదిం చేత్యర్థః, ముక్తస్య హ్యజత్వం కాదాచిత్కం, న త్వనాది, తతోఽస్య వైలక్షణ్యం, ఏతాదృశం మాం లోకమహేశ్వరం, లోకానాం = సర్వావస్థాఽవస్థిత సమస్త చిదచిద్వస్తూనాం, మహాంతం ఈశ్వరం = నియంతారం, తన్నియమనైకస్వభావతయా తద్విలక్షణ మిత్యర్థః, అనేన నిత్యసిద్ధేభ్యోఽపి తస్య వైలక్షణ్య ముక్తం, వేత్తి = జానాతి, సః, సర్వపాపైః - మద్భక్త్యుత్పత్తివిరోధి సమస్తకిల్బిషైః ప్రముచ్యతే = విముచ్యతే ॥ 3 ॥

శ్లో॥ బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః; క్షమా సత్యం దమశ్శమః।
సుఖం దుఃఖం భవోఽభావో; భయం చాఽభయమేవ చ॥ 4

టీ -: బుద్ధిః = మనస్సుయొక్క వివేచనాశక్తి; జ్ఞానం = చిదచిద్వస్తువిషయకమైన నిశ్చయజ్ఞానము; అసమ్మోహః = భ్రాంతి లేకుండుట; క్షమా = ఓర్పు; సత్యం = సత్యవచనము; దమః = బాహ్యేంద్రియనిగ్రహము; శమః = అంతరింద్రియనిగ్రహము; సుఖం = సుఖము; దుఃఖం = దుఃఖము; భవః = సుఖాఽనుభవజనితమైన మానసోల్లాసము; అభావః = దుఃఖాఽనుభవ జనితమైన మనస్సంకోచము; భయం = భయము; అభయం + ఏవ చ = భయము లేకుండుటయు.

దీపికా -: ఏవం స్వస్వభావాఽనుసంధానా ద్భక్త్యుత్పత్తివిరోధి పాపనిరసనముఖేన భక్త్యుత్పత్తిం ప్రతిపాద్య స్వకీయైశ్వర్య కల్యాణగుణ ప్రపంచానుసంధానేన భక్తివివృద్ధిప్రకార మాహ(బుద్ధిరిత్యాది)బుద్ధిః = మనసో నిరూపణసామర్థ్యం, జ్ఞానం = చిదచిద్వస్తువిషయో నిశ్చయః అసమ్మోహః = సమ్మోహస్య నివృత్తిః, సమ్మోహో నామ పూర్వదృష్ట రజతాదే ర్విజాతీయే శుక్తికాదౌ తత్సజాతీయతాబుద్ధిః, క్షమా = కోపాది మనోవికారహేతౌ సత్యప్యవికృతచిత్తత్వం, సత్యం = యథాదృష్టవిషయ భూతహితరూప వచనాఽనుగుణా మనోవృత్తిః, దమః = బాహ్యేంద్రియాణా మసద్విషయేభ్యో నియమనం, శమః = అంతరింద్రియస్య తథా నియమనం, సుఖం = అనుకూలాఽనుభవః, దుఃఖం = ప్రతికూలాఽనుభవః, భవః = అనుకూలాఽనుభవజనితం మనస్స్వాస్థ్యం, అభావః = ప్రతికూలాఽనుభవజనితో మనసోఽవసాదః, భయం = ఆగామిదుఃఖస్య హేతుదర్శనజనితం దుఃఖం చ, అభయం = తన్నివృత్తిరేవ చ ॥ 4 ॥

శ్లో॥ అహింసా సమతా తుష్టి; స్తపో దానం యశోఽయశః।
భవన్తి భావా భూతానాం; మత్త ఏవ పృథగ్విధాః॥ 5

టీ -: అహింసా = ఇతరులకు బాధను కలిగింపకుండుట; సమతా = సమదర్శిత్వము; తుష్టిః = అంతట సంతోషము; తపః = తపస్సు; దానం = దానము; యశః = కీర్తి; అయశః = అపకీర్తి; (ఈ మొదలైన) పృథక్ + విధాః = నానావిధములైన; భూతానాం = ప్రాణుల యొక్క; భావాః = భావములు; మత్తః + ఏవ = నావలననే; భవన్తి = కలుగుచున్నది.

తా -: నా సంకల్పమునుబట్టియే ప్రాణులకు అహింస సమదర్శిత్వము మొదలైన అనేక భావములు కలుగుచుండును.

దీపికా -: అహింసా = పరదుఃఖాఽహేతుత్వం, సమతా = "విద్యా వినయసంపన్న" ఇత్యాద్యుక్త సమదర్శిత్వం, తుష్టిః = సర్వేష్వాత్మసు దృష్టేషు సంతోషస్వభావత్వం, తపః = శాస్త్రీయో భోగసంకోచరూపః కాయక్లేశః, దానం = స్వకీయభోగ్యానాం పరస్మై ప్రతిపాదనం, యశః = గుణవత్త్వప్రసిద్ధిః, అయశః = గుణహీనత్వప్రథా, అత్ర తపోదానాది చతుష్టయం తదనుగుణ మనోవృత్తివిషయం మంతవ్యం, ఏవమాదయః, పృథగ్విధాః = నానాప్రకారాః, భూతానాం = దేవమనుష్యాదీనాం, భావాః = ప్రవృత్తి హేతవో మనోవృత్తయః, మత్త ఏవ = మత్సంకల్పాదేవ, భవన్తి ॥ 5 ॥

*శ్లో॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవస్తథా,*
*మద్భావా మానసా జాతాః యేషాం లోక ఇమాః ప్రజాః॥* 6

టీ -: యేషాం = ఎవరియొక్క; లోకే = పుత్రపౌత్రాదిసంతానరూపమైన లోకమునందు; ఇమాః ప్రజాః = ఈ ప్రజలు; జాతాః = పుట్టిరో; (తే = అ) మానసాః = బ్రహ్మయొక్క మనస్సునుండి జన్మించిన; సప్త మహర్షయః = సప్తర్షులు; తథా = అట్లే; చత్వారః మనవః = నలుగురు మనువులు; మత్ + భావాః = నాయొక్క భావమును (సంకల్పమును) అనుసరించినవారు.

తా -: సప్తర్షులు బ్రహ్మసావర్ణికుడు రుద్రసావర్ణికుడు ధర్మసావర్ణికుడు తక్షసావర్ణికుడు అను నలుగురు మనువులును నా సంకల్పమును అనుసరించియే జగత్సృష్టిస్థితులను గావించుచుందురు.

దీపికా -: సర్వస్య భూతజాతస్య సృష్టిస్థితిప్రవర్తకతయా ప్రసిద్ధా అపి మత్సంకల్పాయత్తప్రవృత్తికా ఇత్యాహ (మహర్షయ ఇతి) పూర్వే = అతీతమన్వంతరస్థాః, మానసాః = నిత్యసృష్టి ప్రవర్తనాయ బ్రహ్మణో మనస్సంభూతాః, సప్త మహర్షయః = భృగ్వాదయః, తథా, చత్వారః, మనవః = సావర్ణికా నామ స్థితిహేతవశ్చత్వారో మనవశ్చ, మద్భావాః - మమ భావోఽభిప్రాయ ఏవ భావో యేషాం తే తథోక్తాః - మత్సంకల్పాఽనువర్తిన ఇత్యర్థః, తానేవ విశేషయతి (జాతా ఇతి) యేషాం మహర్షిణాం, లోకే = పుత్రపౌత్రాదిసంతానరూపేఽస్మిన్ లోకే ఇమాః = పరిదృశ్యమానాః ప్రజాః జాతాః, తే మద్భావా ఇతి పూర్వేణాఽన్వయః ॥ 6 ॥

శ్లో॥ *ఏతాం విభూతిం యోగం చ; మమ యో వేత్తి తత్త్వతః।*
*సోఽవికమ్పేన యోగేన; యుజ్యతే నాఽత్ర సంశయః॥* 7

టీ -: యః = ఎవడు; మమ = నాయొక్క; ఏతాం = ఈ; విభూతిం = ఐశ్వర్యమును; యోగం చ = కళ్యాణగుణసంబంధమును; తత్త్వతః = యథార్థముగ; వేత్తి = తెలిసికొనుచున్నాడో; సః = అతడు; అవికంప్యేన = చలింపజేయ శక్యముకాని; యోగేన = భక్తియోగముతో; యుజ్యతే = కలియును; అత్ర = ఈ విషయమునందు; సంశయః = సందేహము; న = లేదు.

తా -: నాయొక్క ఐశ్వరమును (నాకు అన్నివిధముల విధేయమైయున్న చేతనాఽచేతన ప్రపంచమును) కళ్యాణగుణములను ఎవడు చక్కగా గుర్తింపగలుగుచున్నాడో అతనికి నిశ్చలమైన భక్తియోగము సిద్ధించును.

దీపికా -: ఏతాం - సర్వస్యోత్పత్తిప్రవృత్తినియమనరూపాం, మమ, విభూతిం=ఐశ్వరం, ఏతం మమ యోగం చ=అఖిలహేయ ప్రత్యనీకాఽనవధికాతిశయాఽసంఖ్యేయ కల్యాణగుణగుణయోగం చ, తత్త్వతః - తత్త్వేన=అబాధితాకారేణ, యః వేత్తి=జానాతి, సః అవికంప్యేన = బాధకశతేనాఽప్యవిచాల్యేన, అశక్యకంపనేతి యావత్, యోగేన=పూర్వోక్తలక్షణ భక్తిరూపోపాయేన, యుజ్యతే = సంబధ్యతే, అత్ర=అస్మిన్నర్థే, సంశయః నాఽస్తి, న కర్తవ్య ఇత్యర్థః, మద్విభూతి గుణవిషయం జ్ఞానం భక్తియోగ వివర్ధక మిత్యము మర్థం స్వయమేవ ప్రదక్ష్యసీతి భావః ॥ 7 ॥

శ్లో॥ *అహం సర్వస్య ప్రభవో; మత్తస్సర్వం ప్రవర్తతే ।*
*ఇతి మత్వా భజన్తే మాం; బుధా భావసమన్వితాః ॥* 8

టీ -: అహం=నేను; సర్వస్య = సకలప్రపంచమునకు; ప్రభవః = ఉత్పత్తి కారణము: మత్తః=నావలన; సర్వం = సమస్త ప్రపంచము. ప్రవర్తతే=ప్రవర్తిల్లుచున్నది ఇతి=అని; మత్వా= తలంచి; బుధాః=జ్ఞానులు; భావసమన్వితాః=(నాయందు) భక్తిభావము గలవారై; మాం=నన్ను; భజన్తే=సేవించుచున్నారు.

తా -: సకలప్రపంచోత్పత్తికి నేనే కారణము. నావలననే ఈ ప్రపంచము ప్రవర్తిల్లుచున్నది. ఇట్టి నా విభూతిని (ఐశ్వర్యమును) కళ్యాణగుణములను చక్కగ తెలిసిన జ్ఞానులు భక్తితో నన్ను సేవించుచున్నారు.

దీపికా -: స్వవిభూతిగుణజ్ఞానవిపాకరూపాంభక్తే ర్వివృద్ధిం దర్శయతి (అహమితి) అహం, సర్వస్య=విచిత్రచిదచిత్ప్రపంచస్య, ప్రభవః = ఉత్పత్తికారణం, మత్త ఏవ,సర్వం=జగత్ ప్రవర్తతే, ఇతి=ఏవం రూపంమమస్వాభావికం నిరంకుశైశ్వర్యం, జగత్కారణత్వోక్త్యా తదుపయోగి కల్యాణగుణయోగం చేత్యర్థసిద్ధం, మత్వా=జ్ఞాత్వా, బుధాః=

జ్ఞానినః, భావసమన్వితాః=మయి స్పృహావంతస్సంతః, మాం=సమస్త కల్యాణగుణాకరం, భజంతే=భక్త్యోపాసతే ॥ 8 ॥

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయన్తః పరస్పరం ।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥ 9

టీ - మత్+చిత్తాః=నాయందే మనస్సు గల వారై; మత్+గతప్రాణాః=నన్ను పొందిన ప్రాణములు గలవారై; మాం = నన్ను గూర్చి; పరస్పరం=అన్యోఽన్యము; బోధయన్తః=(తమతమ అనుభవములను) తెలిపికొనుచు; నిత్యం=సర్వదా; కథయంతః+చ = చెప్పికొనుచు; తుష్యన్తి చ=సంతోషించుచున్నారు; రమంతి చ = ఆనందించుచున్నారు.

తా -: నన్నే ధ్యానించుచు నన్ను విడిచి ఒక్క క్షణమైనను నిలువలేని నా భక్తులు నా గుణములను తాము అనుభవించిన ప్రకారమును నా చరిత్రమును పరస్పరము బోధించుకొనుచు ఆనందించుచుందురు.

దీపికా -: తేషాం స్పృహారూపభావసమన్వితత్వమేవ ప్రపంచయతి (మచ్చిత్తా ఇతి) మచ్చిత్తాః = మయ్యేవనివసితమనసః, మద్గతప్రాణాః=మద్గతజీవాః, మయా వినాక్షణమపి ధారణమలభమానా ఇత్యర్థః, పరస్పరం = అన్యోన్యం, బోధయంతః = స్వస్వవిదితాన్ మత్కల్యాణగుణవిశేషానజ్ఞాతాన్ జ్ఞాపయంతః, మాం = దివ్యాద్భుతాతిరమణీయజన్మకర్మాణం, నిత్యం=నిత్యనైమిత్తికానుష్ఠానాఽనవరుద్ధకాలాదిష్వనవరతం, కథయంతః = మత్కథాశ్రవణకండూలకర్ణకుహరేభ్యోవదంతశ్చ సంతః,తుష్యంతి చ=కథకాస్తత్కథనేనాఽనన్యప్రయోజనేన సంతుష్యన్తి చ,రమంతి చ=శ్రోతారస్తథాశ్రవణేనాత్యర్థప్రియేణ క్రీడంతి చ ॥ 9 ॥

శ్లో॥ తేషాం సతతయుక్తానాం; భజతాం ప్రీతిపూర్వకం,
దదామి బుద్ధియోగం తం; యేన మా ముపయాన్తి తే ॥ 10

టీ -: సతతయుక్తానాం = నాతో ఎల్లప్పుడు కలిసియుండునట్టి వారును; భజతాం=(నన్ను) సేవించుచున్నవారును అయిన; తేషాం= ఆ జ్ఞానులకు; తం=ఆ; బుద్ధియోగం = (ప్రత్యక్షదర్శన సమానాకార మైన) ఉపాసనమును; ప్రీతిపూర్వకం=ప్రేమపూర్వకముగ; దదామి= ఇచ్చుచున్నాను; యేన=ఏ బుద్ధియోగముచే; తే=వారు; మాం=నన్ను; ఉపయాంతి=పొందుచున్నారో.

తా -: సర్వధా నాయందే మనస్సును నిలిపి నన్నే సేవించు జ్ఞానులకు ప్రత్యక్షమునందు వలె నన్ను దర్శింపజేయగల ఉపాసనా పరిపాకమును ప్రేమతో అనుగ్రహింతును. దానిద్వారా వారు నన్ను పొందగలరు.

దీపికా -: భగవద్గుణవిభూతిజ్ఞానస్య భక్త్యుత్పత్తివివృద్ధిహేతుత్వ ముక్తం, అథతథావిధవివృద్ధభక్తేర్భగవత్ప్రాప్తిపూర్వభావి విశదతమ సాక్షాత్కారరూపావస్థావిశేషహేతుత్వం భగవత్ప్రసాదద్వారకమాహ(తేషా మితి) సతతయుక్తానాం = మయిసతతయోగాశంసావతాం, నిత్యం మత్సంశ్లేషాభిలాషిణామిత్యర్థః, తదర్థం, భజతాం = భక్తింకుర్వతాం, తేషాం=బుధానాం, అహం తం బుద్ధియోగం = భావనాప్రకర్షేణ ప్రత్యక్షవద్విశదతమబుద్ధిరూపముపాయం, ప్రీతిపూర్వకం = తద్భక్తి జనితః కోఽపి నిరతిశయో యో మనఃప్రసాదః-తత్పూర్వకం యథాతథా, దదామి, యేన=బుద్ధియోగేన, తే = బుధాః, మాం ఉపయాంతి = ప్రాప్నువంతి ॥ 10 ॥

శ్లో॥ తేషా మేవాఽనుకమ్పార్థ; మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మభావస్థో; జ్ఞానదీపేన భాస్వతా ॥ 11

టీ -: తేషాం=అట్టివారికి;(ని) అనుకంపార్థం+ఏవ=అనుగ్రహించుటకొఱకే; ఆత్మభావస్థః=వారి మనోవృత్తికి విషయభూతుడనై; అహం=నేను; భాస్వతా=ప్రకాశించుచున్న; జ్ఞానదీపేన = మదీయ గుణానుభవాత్మకజ్ఞాన మనెడి దీపముచే; అజ్ఞానజం=జ్ఞానవిరోధులైన ప్రాచీనకర్మలచే ఏర్పడిన; తమః= (సాంసారిక) విషయప్రావణ్యరూపమైన అంధకారమును; నాశయామి=నశింపచేయుదును.

తా -: నా భక్తులను అనుగ్రహించుటకొఱకే నేను వారి మనస్సున సాక్షాత్కరించుచు నాయొక్క స్వరూరూపగుణవిభూత్యాదులను చక్కగ సమగ్రముగ ప్రకాశింపజేయు జ్ఞాన మనెడి దీపముచే ప్రాచీనకర్మ జనితమై విషయప్రావణ్యరూపమైయున్న వారి అజ్ఞాన మనెడి అంధకారమును పోగొట్టుచున్నాను.

దీపికా -: ఉక్తబుద్ధియోగోత్పత్తివిరోధి నివృత్తిమాహ (తేషామేవేతి) అనుకంపార్థమేవ = అనుగ్రహాయైవ, అహం = కల్యాణగుణవిగ్రహవిశిష్టోఽహం, తేషాం ఆత్మభావస్థః=ఆత్మభావే మనోవృత్తౌ తిష్ఠతీతి తథోక్తః, మనోవృత్తివిషయో భూత్వా మత్కల్యాణగుణాన్ ప్రకాశయన్నిత్యర్థః, భాస్వతా=పరితః ప్రకాశమానేన, మదీయసర్వప్రకార ప్రకాశకేన, జ్ఞానదీపేన=మద్విషయ విశదతమాఽనుభవరూపేణ దీపేన అజ్ఞానజం=జ్ఞానవిరోధి ప్రాచీనకర్మజనితం, తమః = మత్సాక్షాత్కార ప్రతిబంధక మద్వ్యతిరిక్త విషయప్రావణ్యరూప మంధకారం, నాశయామి=నివర్తయామి, మదనుగ్రహాయత్త నిరతిశయభోగ్య కల్యాణగుణ విశిష్ట మద్విషయవిశదాఽనుభవలాభే సతి సవాసనప్రాచీనకర్మరూపాఽజ్ఞాననివృత్తేః పూర్వాభ్యస్త విషయాంతరప్రావణ్యం స్వయ మేవ నివర్తతే, నహి మహార్హ మింద్రనీలమణిం లబ్ధవతః కాచకరీషాద్యభిలాషాః భవంతి ॥ 11 ॥

అర్జున ఉవాచ -:

శ్లో॥ *పరం బ్రహ్మ పరం ధామ; పవిత్రం పరమం భవాన్ ।*
*పురుషం శాశ్వతం దివ్య; మాదిదేవ మజం విభుమ్ ॥* 12

శ్లో॥ *ఆహుస్త్వా మృషయస్సర్వే; దేవర్షి ర్నారదస్తథా ।*
*అసితో దేవలో వ్యాసః; స్వయం చైవ బ్రవీషి మే ॥* 13

టీ -: భవాన్=నీవు; పరం బ్రహ్మ = జగత్కారణమైన పర బ్రహ్మము, పరం ధామ=పరంజ్యోతివి; పరమం పవిత్రం = పరమ పవిత్రుడివి. (పాపములను పోగొట్టి పరిశుద్ధులను గావించెడివాడవు) సర్వే ఋషయః=సమస్తమహర్షులు; దేవ+ఋషిః - నారదః=దేవర్షి యగు నారదుడు; అసితః=అసితమహర్షియు; దేవలః = దేవలమహ ర్షియు; వ్యాసః=వ్యాసమహర్షియు; త్వాం = నిన్ను; (వాసుదేవుడవై అవతరించియున్న) శాశ్వతం=సనాతసునిగ; దివ్యం=అప్రాకృతునిగ; పురుషం=పరమపురుషునిగ; ఆదిదేవం=జగత్స్రష్టవై విహరించుచున్న వానినిగ; అజం=కర్మమూలకమైన జన్మలేనివానినిగ; విభుం = సర్వ వ్యాపిగను; ఆహుః = చెప్పుచున్నారు; స్వయం+ఏవ చ=(నీవును) స్వయముగనే; మే=నాకు; బ్రవీషి=చెప్పుచున్నావు.

తా -: భగవన్; నీవు సాక్షాత్తు పరబ్రహ్మవు. పరంజ్యోతివి. పాప ములను పోగొట్టువాడివి. వ్యాసనారదాది మహర్షులు; వసుదేవసుతుడవై అవతరించిన నిన్ను సనాతనుడు పరమపురుషుడు దోషగంధరహితుడు జగత్సృష్ట్యాదులచే క్రీడించువాడు కర్మమూలకమైన జన్మ లేనివాడు సర్వవ్యాపి అని చెప్పుచుందురు. నీవును శ్లో॥ అహం సర్వస్య ప్రభవః మత్తస్సర్వం ప్రవర్తతే॥ నేను అన్నింటికి కారణభూతుడను, నానుండియే ఈ ప్రపంచమంతయు ప్రవర్తిలుచున్నది అని తెలుపుచుంటివి.

దీపికా -: ఏవం శృణ్వతాం నిరతిశయానందజనకం భగవతోక్తం భగవదసాధారణం కల్యాణగుణవిభూతియోగం శ్రుత్వా విస్తరేణ శ్రోతు

మర్జునః పృచ్ఛతి "పర" మిత్యాదినా, పరం = యతో వా ఇమాని భూతాని జాయంత ఇత్యాద్యుక్తరీత్యా కృత్స్నజగత్కారణభూతం బ్రహ్మ. పరం. తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదంవిభాతీత్యాద్యుక్తరీత్యా స్వేతరసమస్తజ్యోతిషాం ప్రకాశకం, ధామ = జ్యోతిః, పరమం = ఉత్కృష్టతమం, పవిత్రం - "తద్యథేషీక తూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత॥ తద్యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంతే" ఇత్యాద్యుక్తరీత్యా స్వాశ్రితానాం పూర్వోత్తరాఽఘవినాశాఽశ్లేష రూప శుద్ధికరం చ వస్తు, భవాన్ = త్వమేవ, కిం తత్ర ప్రమాణ మిత్య త్రాహ "పురుషమి" త్యాదినాఽర్ధ శ్లోకేన, సర్వే ఋషయః పరాఽపర వస్తుతత్త్వ యాథాత్మ్యవేదినః, త్వాం = దేవకీవసుదేవతనయతయాఽవ తీర్ణం త్వామేవ, శాశ్వతం = సనాతనం, దివ్యం = దివి తమసః పరస్తా ద్వర్తమానం, పురుషం = అమృతత్రిపాద్విభూతి విశిష్టతయా పురుష సూక్తప్రతిపాద్యం మహాపురుషం, ఆదిదేవం = ఆదిశ్చాఽసౌ దేవశ్చాది దేవః - ఆదిః = జగత్కారణభూతః, దీవ్యతి = క్రీడతీతి దేవం - "క్రీడా హరే రిదం సర్వం" "బాలః క్రీడనకైరివ" ఇత్యాద్యుక్తరీత్యాక్రీడారూప జగద్వ్యాపార ఇత్యర్థః, తం అజం = కర్మకృతజన్మాదిరహితం, విభుం = సర్వవ్యాపకం, సర్వనియంతారం వా, ఆహుః = ఐకకంఠ్యేన వదంతి, తథా, దేవశ్చాఽసావృషిశ్చ దేవర్షిః, నారదః, అసితః = అసితనామకః, దేవలః = దేవలాఖ్యః, వ్యాసః = పారాశర్యశ్చ, ఆహుః, తచ్చవచనం తత్తత్ప్రణీత స్మృతీతిహాసపురాణాన్యేవేతి భావః, "యే చ వేదవిదో విప్రా యేచాఽధ్యాత్మవిదో జనాః,తే వదంతి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనం, పవిత్రాణాం హి గోవిందః పవిత్రం పర ముచ్యతే, పుణ్యానా మపి పుణ్యోఽసౌ మంగళానాం చ మంగళం, ఏష నారాయణశ్శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీం, పుణ్యా ద్వారతీ తత్ర యత్రాస్తే మధుసూదనః, సాక్షాద్దేవః పురాణోఽసౌ వాసుదేవ స్సనాతనః" ఇత్యాదికమిహాఽనుసంధేయం, కించ స్వయ మేవ = బ్రహ్మాదీనామపి గురుస్త్వమేవ, మే = మహ్యం, త్వాం ఉక్త

రూపం, బ్రవీషి = వదసి, "భూమిరాపోఽనలో వాయుః, యో మా మజమనాదిం చ వేత్తి లోకమహేశ్వర" మితి త్వయైవహ్యుక్తమితి భావః ॥ 12, 13 ॥

శ్లో॥ *సర్వ మేతదృతం మన్యే; యన్మాం వదసి కేశవ।*
*నహి తే భగవన్; వ్యక్తిం విదుర్దేవా న దానవాః॥* 14

టీ -: హే కేశవ = ఓ శ్రీకృష్ణ; మాం = నన్నుగూర్చి; యత్ = దేనిని; వదసి = చెప్పుచున్నావో; ఏతత్ సర్వం = దీని నంతటిని; ఋతం = సత్యముగ; మన్యే = తలంతును. హే భగవన్ = ఓ జ్ఞానశక్త్యాదిగుణనిధీ; తే = నీయొక్క; వ్యక్తిం = ప్రకాశమును; దేవాః = దేవతలు; దానవాః = దానవులును; న విదుః + హి = ఎఱుగరు గదా.

తా -: శ్రీకృష్ణ; నీవు నాకు తెలిపిన నీ స్వరూపరూపగుణవిభూత్యాదులు సత్యములని విశ్వసించుచున్నాను. భగవన్ నీ వైభవమును దేవతలుగాని దానవులుగాని ఎదుగజాలరు గదా.

దీపికా -: హే కేశవ-బ్రహ్మరుద్రయోరపి కారణభూతం, మాం = శిష్యం శరణాగతం చ మాం ప్రతి, యత్ = త్వదసాధారణం నిరంకుశైశ్వర్యం కల్యాణగుణానంత్యం చ, వదసి, ఏతత్ సర్వం, ఋతం = సత్యం మన్యే, న ప్రశంసాపరం = శ్రుతిసిద్ధిత్వా దృషివచనా దాప్తతమేన త్వయా చోక్తత్వాదితి భావః, హే భగవన్ = నిరతిశయజ్ఞానబలైశ్వర్యవీర్యశక్తితేజోనిధే, తే = తవ, వ్యక్తిం = వ్యంజనప్రకారం, ప్రష్టౄణాం త్వద్వైభవప్రతిపాదనప్రకారమిత్యర్థః, దేవాః = సాత్త్వికప్రకృతయో బ్రహ్మదయోఽపి, న విదుః = న జానంతి, దానవాః = తామసప్రకృతయోఽసురాశ్చ, న విదుః, దానవగ్రహణం దృష్టాంతార్థం, హి శబ్దేన తేషాం తదజ్ఞానహేతోః పరిమితజ్ఞానరూపస్య ప్రసిద్ధిస్సూచ్యతే ॥ 14 ॥

శ్లో॥ *స్వయమేవాత్మనాత్మానం; వేత్థ త్వం పురుషోత్తమ।*
*భూతభావన; భూతేశ! దేవదేవ! జగత్పతే!॥* 15

టీ -: హే పురుష + ఉత్తమ = ఓ పురుషశ్రేష్ఠ; భూతభావన = సకలభూతములను సృజించువాడా; భూత + ఈశ = సకలభూతములను నియమించువాడా; దేవదేవ = బ్రహ్మరుద్రేంద్రాదిదేవతలకును దైవమైన వాడా; జగత్ + పతే = జగద్రక్షక; త్వం = నీవు; స్వయం + ఏవ = స్వయముగనే; ఆత్మానం = నిన్ను; ఆత్మనా = (నీదైన) జ్ఞానముచేత; వేత్థ = తెలిసికొనుచున్నావు.

తా -: శ్రీకృష్ణ; నీయొక్క స్వరూరూపగుణవిభూత్యాదులను వర్ణించిచెప్పుట ఎవరికిని సాధ్యము కాదు. జగత్కారణభూతుడవై దేవదేవుడవై పురుషోత్తముడవైన నీవే వానిని తెలిసి చెప్పుటకు సమర్థుడవు.

దీపికా -: ఏవం దేవాదీనాం భగవద్వైభవవక్తృత్వయోగ్యతాం నిరాకృత్యాఽథ భగవత ఏవ స్వవైభవవక్తృత్వయోగ్యతా మాహ (స్వయమితి) హే భూతభావన = భూతానా ముత్పాదక, భూతేశ = సర్వభూత నియామక, దేవదేవ - దేవానామపి = బ్రహ్మరుద్రేంద్రాదీనామపి, యథా దేవా స్తిర్యఙ్మనుష్యస్థావరాన్ ఆత్మగుణైర్విగ్రహగుణైశ్చాఽతీత్య వర్తంతే-తథా స్వగుణై ర్దేవా నప్యతీత్య వర్తమానేత్యర్థః. జగత్పతే = జగత్స్వామిన్, హే పురుషోత్తమ = పురుషధౌరేయ, త్వం స్వయమేవ = అనన్యాఽనుగృహీత ఇత్యర్థః, ఆత్మనా = స్వభావభూతేన జ్ఞానేన, ఆత్మానం = త్వదుక్త నిరంకుశైశ్వర్య కల్యాణగుణగణాఽనంత్యవిశిష్టం త్వాం, వేత్థ = జానాసి, స్వతస్సర్వజ్ఞత్వాత్ త్వద్వైభవం వక్తుం త్వమేవ సమర్థ ఇతి భావః ॥ 15 ॥

శ్లో॥ *వక్తుమ ర్హస్యశేషేణ; దివ్యాహ్యాత్మవిభూతయః ।*
*యాభిర్విభూతిభిర్లోకా నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥* 16

టీ -: అశేషేణ = సమగ్రముగ; వక్తుం + అర్హసి = (నీవే నీ వైభవమును) చెప్పుటకు తగియున్నావు. ఆత్మవిభూతయః = నీయొక్క ఐశ్వర్యములు; దివ్యాః + హి = అద్భుతములుగదా. యాభిః + విభూతి

భిః = ఏ ఐశ్వర్యములచే; త్వం = నీవు; ఇమాన్ + లోకాన్ = ఈ లోక ములను; వ్యాప్య = వ్యాపించి; తిష్ఠసి = ఉన్నావో.

తా -: నీవు నిరంకుశైశ్వర్యశాలివై సర్వనియామకుడవై సర్వ వ్యాపివై ఉన్నావు. నీ ఐశ్వర్యములు అద్భుతములైనవి. వానిని నీవు మాత్రమే చెప్పగలవు.

దీపికా -: ఏవం వక్తారం భగవంత మభిముఖీకృత్యాఽథ పృచ్ఛతి (వక్తు మితి) అత్ర - త్వం - ఆత్మానం ఇతి పదే పూర్వశ్లోకా దను షంజనీయే, త్వమేవ, అశేషేణ = కృత్స్న్యేన నిరంకుశైశ్వర్యాదినా - విశి ష్టం త్వాం, వక్తుం = వ్యంజయితుం, అర్హసి = యోగ్యోఽసి, వక్తవ్యత్వే హేతు మాహ, హి = యస్మాత్కారణాత్, ఆత్మవిభూతయః - ఆత్మనః = తవ, విభూతయః = ఐశ్వర్యాణి, దివ్యాః = అద్భుతాని, వక్తృచ్ఛ్రవణేన తృప్తిర్న జాయత ఇతి భావః, యాభిః విభూతిభిః = నియమనైశ్వర్యైః, ఉపలక్షిత స్త్వం, ఇమాన్, లోకాన్ = స్థావరజంగమాత్మకాని జగంతి, వ్యాప్య = నియంతృత్వేనాఽంతః ప్రవిశ్య, తిష్ఠసి = వర్తసే ॥ 16 ॥

శ్లో॥ *కథం విద్యా మహం యోగీ; త్వాం సదా పరిచింతయన్ ,*
*కేషు కేషు చ భావేషు; చిన్త్యోఽసి భగవన్మయా ॥* 17

టీ -: భగవన్ = ఓ భగవానుడా; అహం = నేను; యోగీ = భక్తి యోగనిష్ఠుడనై; త్వాం = నిన్ను; సదా = ఎల్లప్పుడు; పరిచింతయన్ = ధ్యానించుటకు ఉపక్రమించినవాడనై; కథం = ఎట్లు; విద్యాం = తెలిసి కొందును; కేషు కేషు భావేషు చ = ఏయే భావములయందు; మయా = నాచే; చింత్యః + అసి = ధ్యానింపబడదగియున్నావు.

తా -: భగవన్ నేను భక్తియోగనిష్ఠుడనై సర్వదా నిన్ను ధ్యానింప యత్నించుచున్నాను పరిపూర్ణైశ్వర్యాదివిశిష్టుడవైన నిన్ను ఏయే భావ ములకు నియామకునిగా ఎట్లు తెలిసికొనగలను?.

దీపికా -: "కథ" మిత్యాది శ్లోకద్వయేన ప్రశ్నస్య ప్రయోజనం ప్రశ్నకారణం ప్రష్టవ్యార్థాంశ్చ వదన్నుత్తరం ప్రార్థయతే, హే భగవన్, అహం, యోగీ=భక్తియోగనిష్ఠస్సన్, త్వాం=పరిపూర్ణైశ్వర్యకల్యాణగుణ విశిష్టం భవంతం, సదా=భక్తివశా దవిరతం, పరిచింతయన్=పరిచింత యితుం, కథం=కేనప్రకారేణ, విద్యాం=జానీయాం, కించ మయా త్వం,కేషుకేషు=భావేషు బుద్ధి జ్ఞానాఽసమ్మోహాదివ్యతిరిక్తేషు కేషుకేషు భావేషు, చింత్యః=నియంతృతయా చింతనీయః, అసి ॥ 17 ॥

*శ్లో॥ విస్తరేణాత్మనో యోగం; విభూతిం చ జనార్దన।*
*భూయః కథయ తృప్తిర్హి; శృణ్వతో నాఽస్తి మేఽమృతమ్॥ 18*

టీ -: జన + అర్దన=ఓ శ్రీకృష్ణా;ఆత్మనః=నీయొక్క;యోగం= జగత్కారణత్వాదిగుణయోగము (సంబంధము) ను; విభూతిం చ= జగన్నియమనమును; భూయః=మరల; విస్తరేణ = సవిస్తరముగ; కథయ = చెప్పుము. అమృతం = అమృతప్రాయమైన నీ మాహాత్మ్య మును; శృణ్వతః=వినుచున్న; మే=నాకు; తృప్తిః=సంతృప్తి; నాఽ స్తి హి=లేదు కదా.

తా -: జనార్దన; నీ వైభవమును మరల విస్తరించి తెలుపుము. అమృతప్రాయమైన నీమాహాత్మ్యమును ఎంత విన్నను తృప్తి కలుగుట లేదు.

దీపికా -: హే జనార్దన=ఆశ్రితజనాఽభీష్టప్రాపక, ఆత్మనః = స్వస్య, యోగం - అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే॥ ఇత్యాదినా సంక్షేపేణ పూర్వముక్తం స్రష్టృత్వాదిగుణయోగం, విభూ తిం=నియమనం చ, భూయః = పునః, విస్తరేణ = శబ్దప్రపంచేన, కథయ, హి = యస్మాత్కారణాత్, అమృతం = శబ్దతోఽఽర్థతశ్చ అమృతవదత్యంతభోగ్యభూతం త్వదీయం తన్మాహాత్మ్య ప్రతిపాదనం, శృణ్వతః, మే=మమ, తృప్తిః=పర్యాప్తిః, నాఽస్తి ॥ 18 ॥

శ్రీ భగవానువాచ -:

శ్లో॥ *హన్త! తే కథయిష్యామి; విభూతీ రాత్మన శ్శుభాః ।*
*ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యన్తో విస్తరస్య మే ॥* 19

టీ -: హన్త=అహా; కురుశ్రేష్ఠ = అర్జున; ఆత్మనః = నాయొక్క; శుభాః = మంగళకరములైన; విభూతీః =(విధేయములైన) ఐశ్వర్యములను; ప్రాధాన్యతః = ప్రాధాన్యమునుబట్టి; తే = నీకొఱకు; కథయిష్యామి = చెప్పెదను. మే = నాయొక్క; విస్తరస్య = మాహాత్మ్యవిస్తరమునకు; అంతః = ముగింపు; న = లేదు.

తా -: అర్జున; మంగళప్రదములైన నా (వశ్య) విభూతులను నీకు సవిస్తరముగ తెలిపెదను. ఎంత వర్ణించిచెప్పినను అవి తరుగవు.

దీపికా -: ఏవ మత్యుత్కా పృచ్ఛంత మర్జునం ప్రత్యతిప్రసన్నో భగవాంస్తస్యాఽఽభిజాత్యవర్ణనముఖేనోపదేశయోగ్యతాందర్శయన్నుత్తరం ప్రతిజానీతే (హంతేతి) సంక్షేపేణ మద్విభూతిశ్రవణా దతృప్తః పునః ప్రష్టా లోకేఽతిదుర్లభోఽద్య మమ లబ్ధ ఇతి భగవాన్ స్వస్య హర్షాతిశయం సూచయతి (హంతేతి) హే కురుశ్రేష్ఠ=కురువంశప్రదీప, తే = అనసూయాయ ప్రీయమాణాయ తృప్తాయ తుభ్యం, ప్రాధాన్యతః - ప్రాధాన్యేన - ఉత్కృష్టత్వేనోపలక్షితాః, శుభాః = కల్యాణీః, ఆత్మనః = మమ, విభూతీః = నియమనవిషయాన్ పదార్థాన్, కథయిష్యామి, నను విస్తరేణ కథయేతి పృచ్ఛంతం ప్రతి ప్రాధాన్యతః కథయిష్యామీతి కథముచ్యత ఇత్యత్రాహ(నాస్తీతి)మే=మమ, విస్తరస్య = గుణవిభూతిగోచరశబ్దప్రపంచస్య, అంతః=అవసానం, నాఽస్తి, ప్రతిపాద్యగుణవిభూతీనా మానంత్యాద్విస్తరేణ వక్తుం శ్రోతుం చాఽశక్యమిత్యర్థః॥19॥

శ్లో॥ *అహ మాత్మా గుడాకేశ; సర్వభూతాశయస్థితః ।*
*అహమాదిశ్చ మధ్యం చ; భూతానా మన్త ఏవ చ ॥* 20

టీ -: గుడాకా + ఈశ = అర్జున; అహం = నేను; ఆత్మా = అంతరాత్మనై; సర్వభూత + ఆశయస్థితః = సకలప్రాణులహృదయమున ఉన్నవాడను. భూతానాం = ప్రాణులయొక్క; ఆదిః + చ = సృష్టికర్తను; మధ్యం చ = రక్షకుడను; అంతః + చ = ప్రళయకారకుడను; అహం + ఏవ = నేనే.

తా -: అర్జున; నేను సకలప్రాణుల హృదయములయందు అంతరాత్మగా ఉండి; ఆత్మ శరీరమునువలె వానిని ధరించి నియమించి వానికి శేషినై యున్నాను. వాని సృష్టి స్థితిలయములకు కారకుడను నేనే.

దీపికా -: ఆత్మనో యోగం విభూతిం చేతి పృష్ట మర్థద్వయం విస్తరేణ వక్తు మసంభవాత్సంగ్రహేణ తస్యోత్తర మాహ (అహమితి) హే గుడాకేశ, అహం ఆత్మా సన్, సర్వభూతాశయస్థితః - సర్వేషాం భూతానాం = ప్రాణినాం మమ శరీరీరభూతానాం, ఆశయే = హృదయే, స్థితః, భవంతి భావా భూతానా మిత్యాద్యుక్త సర్వభూతప్రవర్తనరూపం విభూతిశబ్దనిర్దిష్టం మమ నియమనం రాజ్ఞాం భృత్యాదినియమన మివ న పృథగవస్థాయ - కింతు మమ శరీరభూతేషు ప్రాణిష్వాత్మతయాఽవస్థాయేతి భావః, ఏవం విభూతిప్రశ్నస్య సంగ్రహేణోత్తరముక్త్వా యోగప్రశ్నస్యాఽపి సంగ్రహేణోత్తర మాహ (అహమితి) అహం = సమస్త కల్యాణగుణాకరోఽహమేవ, భూతానాం = మమ శరీరభూతానాం ప్రాణినాం, ఆదిశ్చ = ఉత్పత్తిహేతుశ్చ, మధ్యం చ = ఉత్పత్తిప్రళయమధ్యస్థితిహేతుశ్చ, అంత ఏవ చ = ప్రళయహేతుశ్చ, అనేన సంగ్రహేణ యోగప్రశ్నస్యాఽప్యుత్తర ముక్తం భవతి ॥ 20 ॥

*శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణుః జ్యోతిషాం రవి రంశుమాన్ ।*
*మరీచిర్మరుతామస్మి నక్షత్రాణా మహం శశీ ॥* 21

టీ -: అహం = నేను; ఆదిత్యానాం = ద్వాదశాదిత్యులలో; విష్ణుః = విష్ణువు అను పేరుగలిగిన ఉత్కృష్టుడనైన ఆదిత్యుడను; జ్యోతిషాం =

జగత్ప్రకాశములైన జ్యోతిస్సులలో; అంశుమాన్ = ప్రశస్తకిరణములు గల; రవిః = సూర్యుడను. మరుతాం = సప్తమరుద్దేవతలలో (వాయువులలో); మరచిః = మరీచి అనువాడను; నక్షత్రాణాం = నక్షత్రములలో; శశీ = చంద్రుడను.

తా -: నేను ద్వాదశాదిత్యులలో విష్ణువును. జగత్తును ప్రకాశింప జేయు జ్యోతిస్సులలో సూర్యుడను. సప్తమరుద్దేవతలలో మరీచిని. నక్షత్రములలో చంద్రుడను (మరుద్దేవతలు 7 గణములుగ విభజింప బడియున్నారు. ప్రతిగణము మరల 7 అవాంతరగణములుగ విభజింప బడినది. కావున $7 \times 7 = 49$ మంది మరుత్తులు)

దీపికా -: ఏవం భగవతస్స్వశరీరభూతేషు సర్వేష్వాత్మతయాఽవస్థానం తత్తచ్ఛబ్దసామానాధికరణనిర్దేశహేతుం ప్రతిపాద్య ప్రధాన భూతాన్ విభూతివిశేషాన్ సామానాఽధికరణ్యేన నిర్దిశన్విస్తరేణోత్తరమాహ (ఆదిత్యానామితి) ఆదిత్యానాం = ద్వాదశసంఖ్యానాం సూర్యాణాం మధ్యే, విష్ణుః = విష్ణునామక ఉత్కృష్ట ఆదిత్యః, అహం, జ్యోతిషాం = జగత్ప్రకాశకపదార్థానాం మధ్యే, అంశుమాన్ = ప్రశస్తకిరణః, రవిః = ఆదిత్యః, అహం, మరుతాం = దితిపుత్రాణా మేకోన పంచాశద్వాయూనాం మధ్యే, మరీచిః = ఉత్కృష్టో మరీచినామా వాయుః అహం, అస్మి, నక్షత్రాణాం = అశ్విన్యాదీనాం పతిః, శశీ = చంద్రః, అహం॥12॥

శ్లో॥ *వేదానాం సామవేదోఽస్మి; దేవానా మస్మి వాసవః।*
*ఇంద్రియాణాం మనశ్చాఽస్మి; భూతానా మస్మి చేతనా॥* 22

టీ -: వేదానాం = వేదములలో; సామవేదః = గీతిప్రధానమైన సామవేదమునై; అస్మి = ఉన్నాను; దేవానాం = దేవతలలో; వాసవః = ఇంద్రుడనై; అస్మి = అగుచున్నాను. ఇంద్రియాణాం = పదునొకండు ఇంద్రియములలో; మనః + చ = మనస్సుగ; అస్మి = ఉన్నాను. భూతానాం = ప్రాణులలో; చేతనా = చైతన్యముగ; అస్మి = ఉన్నాను.

తా -: వేదములలో గీతప్రధానమైన సామవేదముగ; దేవతలలో పరమైశ్వర్యశాలియైన ఇంద్రుడుగ; ఇంద్రియములలో బంధమోక్షము లకు రెండింటికి మూలమైన మనస్సుగ; ప్రాణులలో చైతన్యముగ నేను ప్రకాశించుచున్నాను. (పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియ ములు మనస్సు కలిసి పదునొకండు ఇంద్రియములు.)

దీపికా -: వేదానాం = ఋగ్యజుస్సామాథర్వణాం మధ్యే, సామ వేదః = గానప్రధానతయా సహస్రశాఖాత్మకతయా చోత్కృష్టస్సామ వేదః అహం అస్మి దేవానాం = స్వర్గిణాంమధ్యే, వాసవః = త్రైలో క్యాధిపత్యరూప పరమైశ్వర్యసంపన్నతయోత్కృష్ట ఇంద్రః అహం అస్మి, ఇంద్రియాణాం = ఏకాదశానాం మధ్యే, మనశ్చ = విషయ స్పృహానైస్పృహ్య దశాభేదేన బంధమోక్షయకారణతయోత్కృష్టం మనశ్చ అహం అస్మి, భూతానాం = చేతనావతాం ప్రాణినాం, చేతనా = బుద్ధిః అహం అస్మి ॥ 22 ॥

శ్లో॥ *రుద్రాణాం శంకరశ్చాస్మి; విత్తేశో యక్షరక్షసామ్ ।*
*వసూనాం పావకశ్చాఽస్మి; మేరుశ్శిఖరిణా మహమ్ ॥* 23

టీ -: రుద్రాణాం = ఏకాదశరుద్రులలో; శంకరః + చ = శంకరు డనుగ; అస్మి = ఉన్నాను. యక్షరక్షసాం = యక్షులలోను రాక్షసులలోను; విత్త + ఈశః = ధనపతియైన కుబేరుడనైయున్నాను. వసూనాం = అష్ట వసువులలో; పావకః + చ = పావకుడు అను ఉత్తమవసువుగ; అస్మి = ఉన్నాను; శిఖరిణాం = పర్వతములలో; మేరుః = మేరుపర్వతముగ; అస్మి = ఉన్నాను.

తా -: ఏకాదశరుద్రులలో శంకరుడు; యక్షరక్షస్సులలో కుబే రుడు; అష్టవసువులలో పావకుడు; పర్వతములలో మేరుపర్వతము నేనే.

దీపికా -: రుద్రాణాం = ఏకాదశానాం రుద్రాణాం మధ్యే, శంకరశ్చ = సమస్తజనసుఖకరత్వేన ప్రశస్తశ్శంకరనామా రుద్రశ్చ, అహం అస్మి, యక్షరక్షసాం = యక్షాణాం రాక్షసానాం చ, పతిః, విత్తేశః = నవనిధిస్వామిత్వేనోత్కృష్టః కుబేరః, అహం, వసూనాం = అష్టసంఖ్యాకానాం వసూనాం మధ్యే, పావకః = ఉత్కృష్టః పావకనామా వసుశ్చ, అహం, శిఖరిణాం = రత్నకాంచనమయ ప్రశస్త శిఖరాణాం పర్వతానాం మధ్యే, మేరుః = సురాలయతయా ప్రశస్తో మేరుపర్వతః, అహం ॥ 23 ॥

*శ్లో॥ పురోధసాం చ ముఖ్యం మాం; విద్ధి పార్థ! బృహస్పతిమ్,*
*సేనానీనా మహం స్కన్ద! స్సరసా మస్మి సాగరః॥* 24

టీ -: పార్థ = అర్జున; పురోధసాం = పురోహితులలో; ముఖ్యం = ఉత్కృష్టుడైన; బృహస్పతిం చ = బృహస్పతినిగ; మాం = నన్ను; విద్ధి = తెలిసికొనుము. సేనానీనాం = సేనానాయకులలో; స్కందః = కుమారస్వామిని; అహం = నేనే. సరసాం = జలాశయములలో; సాగరః = సముద్రముగ. అస్మి = (నేనే) ఉన్నాను.

తా -: పురోహితులలో వాక్పతియగు బృహస్పతి; సేనాఽధిపతులలో కుమారస్వామి; జలాశయములలో సముద్రము నేనే.

దీపికా-: హే పార్థ, పురోధసాం = పురోహితానాం మధ్యే, ముఖ్యం = వాచస్పతిత్వేన ప్రధానం బృహస్పతిం చ మాం విద్ధి = జానీహి, సేనానీనాం = చమూపతీనాం మధ్యే, స్కందః = దేవసేనాపతిత్వేనోత్కృష్టః కుమారస్వామీ, అహం, సరసాం = స్థాస్నుసలిలాశయానాం మధ్యే, సాగరః = అగాధత్వవిపులత్వాదినా ప్రశస్తస్సముద్రః అహం అస్మి ॥24॥

*శ్లో॥ మహర్షీణాం భృగు రహం; గిరా మస్మ్యేక మక్షరమ్,*
*యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి; స్థావరాణాం హిమాలయః॥* 25

టీ -: మహా + ఋషీణాం = మహర్షులలో; భృగుః = భృగుమహర్షిని; అహం = నేనే. గిరాం = వాక్కులలో; ఏకం + అక్షరం = 'ఓమ్' అనుప్రసిద్ధమైనప్రణవాక్షరముగ. అస్మి = ఉన్నాను. యజ్ఞానాం = యజ్ఞములలో; జపయజ్ఞః = జపయజ్ఞమై; అస్మి = ఉన్నాను. స్థావరాణాం = పర్వతములో; హిమాలయః = హిమవత్పర్వతముగ; అస్మి = ఉన్నాను

తా -: మహర్షులలో భృగుమహర్షి శబ్దములలో ఓంకారము; యజ్ఞములలో జపయజ్ఞము, పర్వతములలో హిమవత్పర్వతము నేనే.

దీపికా -: మహర్షీణాం = మరీచిప్రముఖానాం మధ్యే, భృగుః = భృగునామా మహర్షిః అహం, గిరాం = అర్థవచ్ఛబ్దానాం మధ్యే, ఏక మక్షరం = ఓమిత్యేకాక్షరం బ్రహ్మేతి శ్రుతిప్రసిద్ధః పరబ్రహ్మరూపోత్కృష్టాఽర్థాభిధాయిత్వేన ప్రశస్తః ప్రణవః అహం, యజ్ఞానాం మధ్యే, జపయజ్ఞః = జపరూపో యజ్ఞః అహం అస్మి, జపయజ్ఞో హి సర్వేష్వపి యజ్ఞేషు ప్రశస్తతమః. విధియజ్ఞా జ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణై రితి వచనాత్, సర్వాశ్రమసాధారణ్యాత్, "జప్యేనాఽపితు సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాఽత్ర సంశయః, కుర్యాదన్యన్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యత" ఇతి విధురాదేరపి సిద్ధిహేతుత్వేనాఽవగతత్వాచ్చ, అత్ర వేదాంతాచార్యైస్తాత్పర్యచంద్రికాయాం జపయజ్ఞస్యైవ ప్రాశస్త్యం సమర్థితం - తథాహి "జపయజ్ఞస్య ప్రాశస్త్య మన్యత్ర ప్రసిద్ధం, విధియజ్ఞా జ్జపయజ్ఞో విశిష్టో దశభి ర్గుణైరితి, కించ, కుర్యాద్ ఘృతపశుం సంఙ్గే కుర్యాత్పిష్టపశుం తథా, నత్వేవ తం వృథా హంతుం పశుమిచ్ఛేత్కథంచనేతి, పశుయజ్ఞైః కథం హింస్రైర్మాదృశో యష్టు మర్హతి, హింసాత్మకైస్తు కిం తస్య యజ్ఞైః కార్యం మహాత్మనః, ప్రస్వాపే చ ప్రబోధే చ పూజితో యేన కేశవ ఇత్యాది వచనబాహుళ్యా దహింసాత్మకయజ్ఞానర్హాణాం హింసాత్మకయజ్ఞానుజ్ఞానం, తత్రాఽపి విధితః ప్రవృత్తే రపకారాద్యనభిసంధానా దుపకారశ్రుతేర్దేవతాప్రీణనత్వాచ్చ న ప్రత్యవాయః, ఫలార్థినాం తు తత్ఫల

మల్ప మస్థిరం దుఃఖమిశ్రం చ, అహింసాత్మకాస్తు యజ్ఞా విశిష్టాధికారి సాధ్యాః భగవతోఽత్యప్రీణనత్వా దపవర్గప్రత్యాసన్నాః, అతఏవ హ్యుపరిచరవస్వాదయః పిష్టపశుభి రిష్టవంతః, ఏవమితరేషు యజ్ఞేషు హింసాదిప్రసంగా దధికారవిశేషాదినా విషయవ్యవస్థాపన మిత్యాద్యల్మహాన్ క్లేశః, జపయజ్ఞే తు తత్ప్రసంగాఽభావాత్ - అవ్యాపకార్థప్రతీత్యా సబీజయోగద్వారా సమాధాన నివేశనాచ్చ యజ్ఞాంతరేభ్యో జపయజ్ఞః ప్రశస్తతమః, సర్వాశ్రమసాధారణ్యాత్ "జప్యేనాపి తు సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాఽత్ర సంశయః, కుర్యాదన్యన్నవా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యత" ఇతి విధురాదేరపి సిద్ధిహేతుత్వాచ్చేతి". స్థావరాణాం, పర్వతమాత్రాణాం మధ్యే, హిమాలయః = పర్వతరాజత్వేన ప్రసిద్ధః ప్రశస్తో హిమవాన్, అహం ॥ 25 ॥

శ్లో॥ *అశ్వత్థ స్సర్వవృక్షాణాం; దేవర్షీణాం చ నారదః,*
*గంధర్వాణాం చిత్రరథః; సిద్ధానాం కపిలో మునిః ॥* **26**

టీ -: సర్వవృక్షాణాం = సమస్తవృక్షములలో; అశ్వత్థః = రావిచెట్టును; దేవర్షీణాం = దేవర్షులలో; నారదః + చ = నారదుడను; గంధర్వాణాం = గంధర్వులలో; చిత్రరథః = చిత్రరథుడను; సిద్ధానాం = సిద్ధులలో; కపిలః మునిః = కపిలమహర్షిని.

దీపికా -: సర్వవృక్షాణాం - మధ్యే, అశ్వత్థః = ప్రదక్షిణాదినా పూజ్యతయా ప్రసిద్ధః ప్రశస్తః పిప్పలవృక్షః అహం; దేవర్షీణాం-మధ్యే, నారదశ్చ = బ్రహ్మపుత్రత్వేన ప్రశస్తో నారదనామా దేవర్షిశ్చ అహం, గంధర్వాణాంమధ్యే, చిత్రరథః అహం, సిద్ధానాం = సిద్ధిమతాం జ్ఞానినాం మధ్యే, కపిలః = "ఋషిం ప్రసూతం కపిలం మహాంతం" ఇతి శ్రుతిసిద్ధోత్కర్షః కపిలనామా మునిః అహం ॥ 26 ॥

శ్లో॥ *ఉచ్చైశ్శ్రవస మశ్వానాం; విద్ధి మా మమృతోద్భవమ్,*
*ఐరావతం గజేంద్రాణాం; నరాణాం చ నరాఽధిపమ్ ॥* **27**

టీ -: అశ్వానాం = గుఱ్ఱములలో; అమృత + ఉద్భవం = నీటి సముద్రమునుండిపుట్టిన; ఉచ్చైశ్శ్రవమను (ఇంద్రుని) గుఱ్ఱమునుగ; విద్ధి = తెలిసికొనుము. గజ + ఇంద్రాణాం = శ్రేష్ఠములైనగజములలో; ఐరావతం = ఐరావతమనుపేరుగల (ఇంద్రుని) గజమునుగను; నరాణాం = మానవులలో; నర + అధిపం = రాజునుగను; విద్ధి = తెలిసికొనుము.

దీపికా -: అశ్వానాంమధ్యే, అమృతోద్భవం,అమృతాత్ = మందరమథ్యమానాత్సముద్రజలాత్, ఉద్భవః = జన్మ, యస్య తం తథోక్తం, జన్మత ఉత్కృష్టం, ఉచ్చైశ్శ్రవసం = ఉచ్చైశ్శ్రవోనామక మింద్రాశ్యం, మాం విద్ధి, గజేంద్రాణాం = గజశ్రేష్ఠానాం దిగ్గజానాం మధ్యే, అమృతోద్భవ మైరావతం = ఇంద్రవాహనభూతం గజేంద్రం, మాం, విద్ధి, నరాణాం = మనుష్యాణాం మధ్యే, నరాధిపం = సర్వనిర్వాహకత్వేన ప్రసిద్ధం ప్రశస్తం రాజానం చ, మాం విద్ధి ॥ 27 ॥

శ్లో॥ *ఆయుధానామహం వజ్రం; ధేనూనా మస్మి కామధుక్ ।*
*ప్రజనశ్చాస్మి కందర్పః; సర్పాణా మస్మి వాసుకిః ॥* 28

టీ -: అహం = నేను;ఆయుధానాం = ఆయుధములలో; వజ్రం = వజ్రాయుధముగను; ధేనూనాం = గోవులలో; కామధుక్ = కామధేనువుగను; అస్మి = ఉన్నాను; ప్రజనః = (ప్రాణుల) జన్మకు కారణమైన; కందర్పః + చ = మన్మధుడుగను; సర్పాణాం = సర్పములలో; వాసుకిః = వాసుకిగను; అస్మి = ఉన్నాను,

దీపికా -: ఆయుధానాం = సుదర్శన నందకాది వ్యతిరిక్తాఽర్వాచీనాయుధానాం మధ్యే, వజ్రం = పర్వతభేత్తృతయా ప్రశస్తం వజ్రాయుధం అహం, ధేనూనాం = దోగ్ధ్రీణాం మధ్యే, కామధుక్ - కామాన్ దోగ్ధీతి కామధుక్ - సకలకామితార్థదోగ్ధృతయా ప్రశస్తా స్వర్ధేనుః,అహం, అస్మి, ప్రజనయతీతి ప్రజనః - ప్రజనన హేతుతయా ప్రశస్తః, కండ

ర్పశ్చ=మన్మథశ్చ, అహం, అస్మి, తస్య ప్రజననహేతుత్వరూపాతిశయః మదధీన ఇత్యర్థః, సర్పాణాం - ఏకశిరసాం పన్నగానాం మధ్యే, వాసుకిః సముద్రమథనరజ్జుతయాఽవస్థితో వాసుకినామా సర్పః, అహం, అస్మి ॥ 28 ॥

*శ్లో॥ అనన్తశ్చాఽస్మి నాగానాం వరుణో యాదసా మహమ్ ।*
*పితౄణా మర్యమాచాఽస్మి యమ స్సంయమతా మహమ్॥ 29*

టీ -: నాగానాం=(అనేకశిరస్సులుగల)సర్పములలో; అనన్తః + చ=ఆదిశేషుడనై; అస్మి=ఉన్నాను. యాదసాం = జలజంతువులలో; వరుణః=(ఆ జలజంతువులకు అధిపతియైన) వరుణుడను. పితౄణాం=పితృదేవతలలో; అర్యమా చ=అర్యమ అను పితృదేవుడనుగ; అహం=నేను; అస్మి=ఉన్నాను; సంయమతాం = దండించువారిలో; అహం=నేను; యమః = యముడను.

దీపికా-: నాగానాం=బహుశిరసాం పన్నగానాం మధ్యే, అనన్తః= భగవత్తల్పతయా ఫణాసహస్రధృత ధరణీమండలతయా చ ప్రశస్త శ్శేషనామకో నాగశ్చ, అహం, అస్మి, యాదసాం=జలజంతూనాం, పతిత్వేన ప్రశస్తః, వరుణశ్చ, అహం, పితౄణాం = అగ్నిష్వాత్తాదీనాం మధ్యే, పితృరాజత్వేన ప్రసిద్ధః ప్రశస్తః అర్యమా చ, అహం అస్మి, సంయమతాం = సంయచ్ఛతాం, దండయితాం మధ్యే, యమః = వైవస్వతః, అహం ॥ 29 ॥

*శ్లో॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్ ।*
*మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్॥ 30*

టీ -: దైత్యానాం=దైత్యులలో; ప్రహ్లాదః+చ = ప్రహ్లాదుడనై; అస్మి=ఉన్నాను. కలయతాం=పరానర్థమును ఎదురుచూచువారిలో; కాలః = కాలపురుషుడనైఉన్నాను; అహం=నేను; మృగాణాం=మృగ

ములలో; మృగ + ఇంద్రః + చ = సింహముగ ఉన్నాను. పక్షిణాం= పక్షులలో; వైనతేయః = గరుత్మంతుడను.

దీపికా -: దైత్యానాం=దితిసుతానాం మధ్యే, సాధూపమానత్వేన ప్రసిద్ధః, ప్రహ్లాదశ్చ, అహం, అస్మి, కలయతాం = పరాఽనర్థసమయ ప్రతీక్షాణాం మధ్యే, కాలః=మృత్యుః, అహం, మృగాణాం = హరిణా దీనాం మధ్యే, మృగేంద్రః=సింహశ్చ, అహం, అస్మి, పక్షిణాం మధ్యే, వైనతేయః = వేగాతిశయ వేదమయత్వాదినోత్కృష్టః, గరుడశ్చ, అహం, అస్మి ॥ 30 ॥

*శ్లో॥ పవనః పవతామస్మి; రామశ్శస్త్రభృతా మహమ్ ।*
*ఝషాణాం మకరశ్చాఽస్మి; స్రోతసా మస్మి జాహ్నవీ ॥* 31

టీ -: పవతాం=సంతతగమనస్వభావము గలవానిలో; పవనః= వాయువునై; అస్మి=ఉన్నాను. శస్త్రభృతాం = శస్త్రములను ధరించిన వారిలో; రామః + చ=రాముడను. ఝషాణాం = మత్స్యములలో; మకరః + చ=మొసలియునై; అస్మి=ఉన్నాను. స్రోతసాం = ప్రవాహ ములలో; జాహ్నవీ = గంగానదినై; అస్మి=ఉన్నాను.

దీపికా -: పవతాం=సతతగమనశీలానాంమధ్యే, పవనః = తార కాద్యజస్రపరిభ్రమణహేతుత్వేనప్రశస్తోవాయుః, అహం, అస్మి, శస్త్ర భృతాం = శస్త్రధారిణాంమధ్యే, రామః = పరశురామస్యాపిజేతారావ ణాంతకోరామః, అహం, అస్మి, అత్రరామగతశస్త్రభృత్త్వమాత్రవిభూతిః, రామశబ్దవాచ్యస్య భగవద్విభూతితాయోగ్యస్య చేతనస్యా చేతనస్య వా వస్త్వంతరస్యాసంభవాదితిబోధ్యం, ఝషాణాం = మత్స్యానాంమధ్యే, మత్స్యరాజతయాప్రసిద్ధః, మకరశ్చ, అస్మి, స్రోతసాం = ప్రవాహాణాం మధ్యే, జాహ్నవీ=విష్ణుపాదోద్భవస్యసర్వజ్ఞశిరోధృతత్వత్రైలోక్య ప్రవృ త్త్యాదిభిరతిశయితాగంగా, అహం, అస్మి ॥ 31 ॥

శ్లో॥ సర్గాణా మాదిరన్తశ్చ; మధ్యం చైవాఽహ మర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం; వాదః ప్రవదతా మహమ్॥ 32

టీ -: అర్జున = అర్జున; సర్గాణాం = సృజింపబడు పదార్థములలో; ఆదిః = సృజించు వర్గము; అంతః + చ = సంహరించు వర్గము. మధ్యం చ = రక్షించు వర్గమున్ను; అహం + ఏవ = నేనే; విద్యానాం = విద్యలలో; అధ్యాత్మవిద్యా = బ్రహ్మవిద్యను నేనే; ప్రవదతాం = జల్పవితండాది వాదములను గావించువారిలో. వాదః = తత్త్వనిర్ణయమును కలిగించు వాదమును; అహం = నేనే.

హే అర్జున, సృజ్యంత ఇతి సర్గాః - సర్వదేశకాలవర్తినః సృజ్య పదార్థాః, తేషాం, ఆదిః = తత్ర స్రష్టృవర్గః, అంతః = తత్ర సంహర్తృ వర్గశ్చ, మధ్యం = తత్ర పాలయితృవర్గశ్చ, అహమేవ, విద్యానాం మధ్యే అధ్యాత్మవిద్యా = జీవపరమాత్మయాథాత్మ్యవిద్యా, అహం, ప్రవదతాం = జల్పవితండాదికథాం కుర్వతాం, వాదః = తత్త్వనిర్ణయాయ ప్రవృత్తా కథా, అహం ॥ 32 ॥

శ్లో॥ అక్షరాణా మకారోఽస్మి; ద్వన్ద్వస్సామాసికస్య చ,
అహమేవాఽక్షయః కాలః; ధాతాఽహం విశ్వతోముఖః॥ 33

టీ -: అక్షరాణాం = అక్షరములలో; అకారః + అస్మి = అకారమై యున్నాను. సామాసికస్య చ = సమాససముదాయములలో; ద్వంద్వః = (ఉభయపదార్థప్రధానమైన) ద్వంద్వసమాసమునైయున్నాను. అక్షయః = ఆద్యంతములు లేని; కాలః = (క్షణముహూర్తాదిరూపమైన) కాలము; అహం + ఏవ = నేనే. విశ్వతః + ముఖః = నాలుగుప్రక్కల ముఖములు గల; ధాతా = సృష్టికర్తయైన (చతుర్ముఖ) బ్రహ్మయు. అహం = నేనే.

దీపికా -: అక్షరాణాం = వర్ణానాం మధ్యే, అకారః = అకారో వై సర్వా వాగితి సర్వవర్ణోత్పాదకత్వేన శ్రుతిసిద్ధో వర్ణః, అహం, అస్మి,

సామాసికస్య = సమాసానా మవ్యయీభావాదీనాం సమూహస్సామాసికః, తస్య - సామాసికస్య మధ్యే, ద్వంద్వః = ద్వంద్వాఖ్య స్సమాసశ్చ అహం, సహి సర్వపదార్థప్రధానత్వేన పూర్వోత్తరాన్యపదార్థ ప్రధానేభ్య స్సమాసాంతరేభ్య ఉత్కృష్టః, అక్షయః = ఆద్యంతరహితః కాలశ్చ అహమేవ, విశ్వతోముఖః = చతుర్ముఖః, ధాతా = సర్వస్రష్టా హిరణ్యగర్భశ్చ అహ మేవ ॥ 33 ॥

శ్లో॥ మృత్యుస్సర్వహరశ్చాఽహ; ముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం; స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ 34

టీ -: సర్వహరః = సకలప్రాణులను హరించు; మృత్యుః + చ — యమకింకరుడను; అహం = నేనే. భవిష్యతాం = పుట్టబోవువారికి; ఉద్భవః + చ = పుట్టుకయు; అహం = నేనే; నారీణాం = స్త్రీలలో; శ్రీః = లక్ష్మీదేవియు; కీర్తిః = కీర్తియు; వాక్ + చ = సరస్వతీదేవియు; అహం = నేనే (లక్ష్మి కీర్తి వాక్కు అను ఈ ముగ్గురు భగవదసాధారణశక్తులు.) స్మృతిః = జ్ఞాపకశక్తియు; మేధా = ధారణారూపమైన బుద్ధియు; ధృతిః = ధైర్యము; క్షమా = ఓర్పును, అహం = నేనే. (ఇచటస్మృత్యాదిపదములు స్మృత్యాదుల అధిష్ఠానదేవతలను బోధించును)

దీపికా -: సర్వహరః = సర్వేషాం ప్రాణినాం హరః, మృత్యుః = యమకింకరశ్చ, అహం - భవిష్యతాం = ఉత్పత్స్యమానానాం, ఉద్భవాఖ్యం కర్మ చ, అహం, నారీణాం మధ్యే, శ్రీః = లోకమాతృత్వేన నారీణాముత్తమా లక్ష్మీః అహం, కీర్తిః = కీర్తినామ్నీ అహం, వాక్ = వాఙ్నామ్నీ చ అహం, ఏతాస్తిస్రో భగవదసాధారణశక్తయః, స్మృతిః = అనుభూతార్థగోచరాయాః ధియోఽధిదేవతాఽపి అహం, మేధా = ధారణావత్యాః ధియోఽధిదేవతాఽపి అహం, ధృతిః = సంతోషః, ధైర్యం వా, తదభిమానిదేవతాఽప్యహం, క్షమా = తితిక్షా - తదభిమానిదేవతాఽపి అహం ॥ 34 ॥

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం; గాయత్రీ ఛన్దసా మహమ్,
మాసానాం మార్గశీర్షోఽహం; ఋతూనాం కుసుమాకరః ॥ 35

టీ -: తథా = అట్లే; సామ్నాం = సామగానములలో; బృహత్ + సామ = బృహత్సామము అనబడు గానవిశేషమైయున్నాను. ఛందసాం = ఛందస్సులలో; అహం = నేను; గాయత్రీ = గాయత్రీఛదస్సునై యున్నాను. అహం = నేను; మాసానాం = మాసములలో; మార్గశీర్షః = మార్గశీర్షమాసమైయన్నాను. ఋతూనాం = ఆఱు ఋతువులలో; కుసుమ + ఆకరః = వసంతఋతువునై యున్నాను.

దీపికా -: సామ్నాం = ఋగక్షరసంస్కారరూపాణాం గానానాం మధ్యే, బృహత్సామ = "బృహచ్చ వా ఇదమగ్రే రథంతరం చాస్తాం వాక్చవైతన్మనశ్చాస్తాం వాగ్వై రథంతరం మనో బృహది" త్యాదిశ్రుతి సిద్ధోత్కర్షం బృహన్నామకం గానం చ అహం, ఛందసాం = ఛందోవిశిష్ట మంత్రాణాం మధ్యే, గాయత్రీ = వేదమాతృత్వేన శ్రుతిషు ఛందోవిచిత్యాం చ ప్రపంచితోత్కర్షా గాయత్ర్యాఖ్య ఛందోవిశిష్టా చతుర్వింశత్యక్షరా త్రిపదా ఋక్ అహం, మాసానాం - ద్వాదశానాం మధ్యే, మార్గశీర్షః = వర్షగర్భాధానకాలత్వాత్, కేశవాదిషు ద్వాదశసు ప్రథమస్య కేశవస్య మాసత్వాత్, వ్రతారంభకాలత్వా చ్చోత్కృష్టో మార్గశీర్షాఖ్యో మాసః అహం, ఋతూనాం - షణ్ణాం మధ్యే, కుసుమాకరః = అనతిశీతోష్ణతయా కోకిలాలాప మలయమారుత వివిధకుసుమవాసనాభిశ్చ సర్వప్రాణిసుఖ హేతుత్వాత్- "వసంతాదౌ బ్రాహ్మణోఽగ్నీనాదధీత - వసంతే బ్రాహ్మణ ముపనయీత - వసంతే వసంతే జ్యోతిషా యజేత" "వసంతే దీక్షయే ద్విప్రం" ఇత్యాదిశ్రౌతస్మార్త కర్మానుష్ఠానకాలత్వేనాఽవగతత్వాచ్చ ప్రశస్తో వసంతర్తుః అహం ॥ 35 ॥

శ్లో॥ ద్యూతం ఛలయతా మస్మి; తేజస్తేజస్వినా మహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి; సత్త్వం సత్త్వవతా మహమ్॥ 36

టీ -: ఛలయతాం=వంచకులలో; ద్యూతం + అస్మి = జూదమునై యున్నాను. తేజస్వినాం = తేజోవంతులలో; అహం = నేను; తేజః=తేజస్సునైయున్నాను. జయః + అస్మి = (జయశీలురలో) జయమునైయున్నాను. వ్యవసాయః + అస్మి=ప్రయత్నశీలురలో ప్రయత్నమునైయున్నాను. సత్త్వవతాం = దృఢచిత్తులలో; సత్త్వం=దృఢచిత్తమునై; అహం అస్మి=నేను ఉన్నాను.

దీపికా -: ఛలయతాం = ఛలం కుర్వతాం - క్రయవిక్రయఋణ సంగరాదివ్యాపారైః పరస్పరం వంచనం కుర్వతాం, వంచనాస్పదేషూక్తవ్యాపారేషు మధ్యే, ద్యూతం=అక్షదేవన ఛాగచరణాయుధయుద్ధాది నిర్జీవ సజీవ సమస్తద్యూతం అహం, తస్యాఽనాయాసేన ధర్మాఽవిరోధేన చ సమస్త పరధన హరణసాధనత్వేన ప్రశస్తత్వాదితి భావః, తేజః=పరాభిభవనసామర్థ్యం - ఏషామస్తీతి తేజస్వినః, తేషాం సంబంధి తేజః అహం, జయశీలానాం జయః అహం అస్మి, తేజో జయయో రుత్కర్షః స్ఫుటః, వ్యవసాయః-అధ్యవసాయనిష్ఠేతి యావత్, సః అహం, వ్యవసాయో హి- "యథా వై నిస్తిష్ఠత్యథ కరోతి. నాఽతిష్ఠన్ కరోతి నిస్తిష్ఠన్నేవ కరోతి నిష్ఠాత్వేవ విజిజ్ఞాసితవ్యే" త్యాదినాఽవ్యవధానేన ప్రవృత్త్యాది హేతుతయాఽవగంతవ్యత్వా త్ప్రశస్త ఇతి భావః, సత్త్వం=మహామనస్త్వం, తద్వతాం, సత్త్వం అహం ॥ 35 ॥

శ్లో॥ *వృష్ణీనాం వాసుదేవోఽస్మి; పాణ్డవానాం ధనంజయః ।*
*మునీనా మప్యహం వ్యాసః; కవీనా ముశనా కవిః ॥* 37

టీ -: వృష్ణీనాం = వృష్ణివంశ్యులలో; వాసుదేవః + అస్మి = వసుదేవుని కుమారుడనైయున్నాను. పాండవానాం = పంచపాండవులలో; ధనంజయః=అర్జునుడనైయున్నాను. అపి = మరియు; అహం = నేను; మునీనాం = మననముచేత తత్త్వయాథాత్మము నెఱింగినవారిలో. వ్యాసః=పరాశరుని పుత్రుడైన వ్యాసుడను. కవీనాం=విద్వాంసులలో ఉశనాకవిః = శుక్రుడు అను విద్వాంసుడను.

దీపికా -: వృష్ణీనాం = వృష్ణికులజాతానాం పురుషాణాం మధ్యే, వాసుదేవః = వసుదేవసూనుః, తదీయాని-వసుదేవగృహే చతుర్భుజతయాఽవతరణం-శైశవ ఏవ పూతనా, శకట; యమళార్జున, కేశి, బక, ప్రలంబ, ధేనుకా, కాళియాది నిగ్రహః - సప్తరాత్రం గోవర్ధనోద్ధరణేన గోపగోపీజనానా మింద్రకృతాఽశ్మవర్షా న్నివారణం - పరలోకగత సాందీపనిపుత్రాహరణం ఇత్యేవమాదీ న్యమానుషచేష్టితాని వాసుదేవశబ్దేన వివక్షితాని, తాని. అహం = మద్విభూతిభూతాని, ధర్మిణస్తు రామస్యేవ స్వావతారత్వేన స్వవిభూతిత్వాఽయోగాదితి బోధ్యం, ఇదం చాఽర్జునస్య సువిదితమేవ నోపదేశ్యమితి దృష్టాంతార్థం, ఏవంచ - యథా వృష్ణీనాం మధ్యే వాసుదేవోఽహం తథా, పాండవానాం - పంచానాం మధ్యే, ధనంజయః = దిగ్విజయపూర్వకరాజసూయాఽర్థ ధనాహరణేన దేవతాసార్వభౌమసుతత్వేన మయాఽవసారథినా ప్రవర్త్యమానరథక రథికత్వేన చ ప్రశస్తోఽర్జునస్త్వం చ, అహం మద్విభూతిః, మునీహం - మననేనాఽర్థతత్త్వయాథాత్మ్యదర్శినాం మధ్యే, వ్యాసః = పారాశర్యః అహం, "సహోవాచ వ్యాసః పారాశర్య" ఇతి శ్రుతిప్రసిద్ధా ప్తతమత్వరూపోత్కర్షః పారాశర్యః, కవీనాం = విపశ్చితాం మధ్యే, ఉశనాః = శుక్రోనామ కవి రస్మి, సహి నీతిశాస్త్రప్రవర్తకత్వా త్ప్రశస్తః ॥ 37 ॥

శ్లో॥ *దండో దమయతా మస్మి; నీతి రస్మి జిగీషతామ్॥*
*మౌనం చైవాఽస్మి గుహ్యానాం; జ్ఞానం జ్ఞానవతా మహమ్॥38*

టీ -. దమయతాం = శిక్షించువారిలో; దండః = శిక్షగా; అస్మి = ఉన్నాను; జిగీషతాం = జయింపగోరువారిలో; నీతిః = సామదానభేద దండరూపమైన రాజనీతినై; అస్మి = ఉన్నాను. గుహ్యానాం = రహస్య గోపనోపాయములలో; మౌనం ఏవ చ = మౌనమునై; అస్మి = ఉన్నాను; జ్ఞానవతాం = జ్ఞానవంతులలో; జ్ఞానం అస్మి = జ్ఞానమునైయున్నాను. (శిక్ష సర్వపాపహర మగుటచే అది భగవత్స్వరూపము.)

దీపికా -: దమయతాం = నియమాఽతిక్రమే యథాఽధికారం సర్వస్వహరణాదిరూపం దండం కుర్వతాం సంబంధీ, దండః = నిగ

హః అహం, సహి నియమాఽతిక్రమజనిత పాపనిర్హరణేన పురుషస్య నైర్మల్యాపాదకతయా ప్రశస్తః, జిగీషతాం=జయేచ్ఛూనాం, నీతిః= జయోపాయభూత సామాద్యుపాయప్రయోగకౌశలరూపా అహం, తస్యాః జయహేతుత్వరూపోఽతిశయస్స్పష్టః, గుహ్యానాం = గోపనాఽర్హాణా మర్థానాం సంబంధిషు గోపనోపాయేషు, మౌనం=వాఙ్ముద్రణం అహం, మౌనే హి సతి హృది స్థితేషు రహస్యార్థేషు న కశ్చిదపి ప్రకటీ భవతి, ఉక్తిప్రత్యుక్త్యాదినిమిత్తః కలహోఽపి పరైర్న ప్రసజ్యత ఇతి తస్యాఽతిశయః, జ్ఞానవతాం=తత్త్వజ్ఞానవతాం, జ్ఞానం=తత్త్వజ్ఞానం చ అహం, తద్ధి జ్ఞానీ త్వాత్మైవ మే మత మిత్యుక్తరీత్యా భగవత్ప్రీతి విషయతాపాదనద్వారా మోక్షసాధనత్వా దుత్కృష్టం ॥ 38 ॥

శ్లో॥ *యచ్చాఽపి సర్వభూతానాం; బీజం తదహ మర్జున।*
*న తదస్తి వినా యత్స్యాత్; మయా భూతం చరాచరమ్॥* 39

టీ -: అర్జున=ఓ అర్జున; యత్=ఏది;సర్వభూతానాం=సమస్త ప్రాణులకు; బీజం=కారణమో; తత్+అపి చ=అదియును;అహం= నేనే, యత్=ఏది; మయా వినా=(సర్వాంతర్యామినైన) నన్ను విడిచి; స్యాత్=ఉండునో; తత్=అట్టి; చర+అచరం = స్థావరజంగమరూప మైన; భూతం=భూతసముదాయము; న+అస్తి=లేదు.

తా -: అర్జున; సమస్తభూతములకు సర్వవిధకారణము నేనే. సర్వము నాకు శరీరము. సర్వమునకు నేను అంతరాత్మను. నేను అంతరాత్మగ లేని వస్తు వేదియు లేదు.

దీపికా -: సర్వభూతానాం=నిత్యం సృజ్యమానానాం నరతిర్యగాది సర్వావస్థాఽవస్థితానాం ప్రాణినాం, యచ్చ=పరోక్ష మపరోక్షం చ, బీజం=తత్తదుపాదానకారణతయా స్థితం ద్రవ్యం అస్తి, హే అర్జున, తదపి అహ మేవ, అహమాదిశ్చేత్యాదినా నైమిత్తికప్రాకృతసర్గోపాదానాదిసర్గాణాం - అది రంతశ్చేతి నిత్యసర్గే స్రష్టృవర్గస్య చోక్తత్వాదిహ

నిత్యసర్గోపాదానకారణమాత్రం బీజమిత్యనేన వక్తుం యుక్తం, మయా, వినాభూతం=శరీరతయాఽంత రననుప్రవిష్టం, యత్, చరాఽరం= జంగమస్థావరం స్యాత్, తద్వస్తు నాఽస్తి, సర్వమపిభూతజాతం మయా శరీరతయాఽధిష్ఠితమేవేత్యర్థః, స్వవ్యతిరిక్త వస్తుసత్తానిషేధపరత్వం- అహమాత్మా గుడాకేశేత్యాద్యుపక్రమవిరోధా దేవమేవ యోజనా న్యాయ్యా ॥ 39 ॥

శ్లో॥ నాఽన్తోఽస్తి మమ దివ్యానాం; విభూతీనాం పరన్తప,
ఏష తూద్దేశతః ప్రోక్తః; విభూతే ర్విస్తరో మయా॥ 40

టీ -: హే పరంతప=ఓ అర్జున; మమ = నాయొక్క; దివ్యానాం = మంగళకరములైన; విభూతీనాం = నియామ్యవస్తువులకు, అంతః=అంతము (పరిచ్ఛేదము); నాఽస్తి=లేదు. విభూతేః=నియామ్యవస్తుసముదాయముయొక్క; ఏషః=ఈ; విస్తరః + తు = వివరణము; ఉద్దేశతః=సంక్షేపముగ; మయా=నా చేత; ప్రోక్తః = చెప్పబడినది.

తా -: అర్జున; దివ్యములైన నా విభూతులకు 'ఇంత'అను అవధి లేదు. ఇపుడు సంగ్రహముగ నీకు వానిని వివరించితిని.

దీపికా -: నిశ్శేషవచనాఽశక్యతాం ప్రాగుక్తాం స్మారయతి (నేతి) హే పరంతప, దివ్యానాం=కల్యాణీనాం మమ, విభూతీనాం = నియామ్యవస్తూనాం, అంతః=ఇయత్తాలక్షణః+పరిచ్ఛేదః నాఽస్తి, ఏషః, విభూతేః విస్తరస్తు, ఉద్దేశతః=సంక్షేపేణ, ప్రోక్తః ॥ 40 ॥

శ్లో॥ యద్యద్విభూతిమత్సత్త్వం; శ్రీమ దూర్జిత మేవ వా,
తత్తదేవాఽవగచ్ఛ త్వం; మమ తేజోఽంశసంభవమ్॥ 41

టీ -: విభూతిమత్=నియామ్యవస్తువిశిష్టమైనదియు; శ్రీమత్= కాంతి (సంపద) కలదియు; ఊర్జితం+ఏవ వా=ఉత్తరోత్తరశుభప్రద మైనదియు నగు;యత్+యత్=ఏయే;సత్త్వం=ప్రాణిసముదాయము,

అస్తి=ఉన్నదో; తత్+తత్=అయా ప్రాణిసమూహము; మమ=నా యొక్క; తేజః+అంశసంభవం=సామర్థ్యలేశముచే జనించినదానినిగ; త్వం=నీవు; అవగచ్ఛ=తెలిసికొనుము.

తా -: నియమనయోగ్యత కాంతి (సంపద) ఉత్తరోత్తరశుభప్రద శక్తి గల ప్రాణిసముదాయ మంతయు నా తేజోలేశమున జనించిన దని తెలిసికొనుము.

దీపికా -: ఏవం ప్రాధాన్యత ఇత్యుపక్రమ్య ప్రపంచిత ముప సంహరతి (యద్యదితి) విభూతిమత్ = నియమ్యవస్తుసంపన్నం, శ్రీమత్=కాంతిమత్, నియామ్యజన భరణోపయోగి ధనధాన్యసంపన్నం వా, ఊర్జితం=బలవత్, 'వా'శబ్దశ్చాఽర్థః,అధికతయోత్తరోత్తరశ్రీలాభాయ కల్యాణారంభేషూద్యుక్త మేవ చ, నతు కదాచిదప్యుద్యోగా దుపరత మిత్యర్థః, యద్యత్=సర్వం జంతుజాతం, తత్తత్=సర్వం, మమ= సర్వగోచరాఽభంగురాఽఘటిత ఘటకసామర్థ్యస్యేత్యర్థః, తేజోఽంశ సంభవం=తేజసః - నియమనసామర్థ్యస్య, అంశః=లేశః, సంభవః= కారణం, యస్య తత్తథోక్త మేవ, అవగచ్ఛ = జానీహి, యథా శైలాం దోళనసమర్థస్య చండమారుతస్య తూలతృణధారణాదికం వేగలేశమాత్ర కార్యం - తద్వదితి భావః ॥ 41 ॥

శ్లో॥ *అథవా బహునైతేన; కిం జ్ఞానేన తవాఽర్జున ।*
*విష్టభ్యాఽహమిదం కృత్స్నం; మేకాఽంశేన స్థితో జగత్ ॥ 42*

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణాఽర్జునసంవాదే విభూతియోగో నామ
దశమోఽధ్యాయః.

టీ -: అర్జున=అర్జున; అథవా=అయినను; ఏతేన=ఈ చెప్పబడు చున్న; బహునా=విస్తృతమైన; జ్ఞానేన=జ్ఞానముచేత; తవ = నీకు;

కిమ్ = ఏమి ప్రయోజనము?. అహం = నేను; కృత్స్నం = సమగ్రమైన; ఇదం జగత్ = ఈ జగత్తును; ఏక + అంశేన = నా సామర్థ్యములోని స్వల్పభాగముచేత; విష్టభ్య = ధరించి; స్థితః = ఉన్నాను.

తా -: అర్జున; నా విభూతివిస్తరమును ఎంత చెప్పినను తఱుగదు. ఈ చరాఽచరప్రపంచ మంతయు నా శక్తిలోని స్వల్పభాగము చేతనే ధరింపబడియున్నది.

దీపికా - ఏవం ప్రాధాన్యత ఇత్యుపక్రాంత ముపసంహృత్యాఽథ సంక్షేపా దప్యతిసంక్షేపేణ ప్రధానాఽప్రధాన సమస్త విభూతి సంగ్రహ మాహ (అథవేతి) అథవేత్యతిసంక్షేపరూప పక్షాంతరారంభే, హే అర్జున, బహూనా - పృథక్ పృథక్ ఉచ్యమానేన - మయాఽవిరతం కథ్యమానేన తవ; త్వయా చ పృథక్పృథక్ - జ్ఞాతేన - అవిరతం జ్ఞాయమానేన, ఏతేన = విభూతివిస్తరేణ, కిం సాధ్యం ప్రయోజనం కిం, అనంతానాం విభూతీనాం పర్యవసానజ్ఞానరూపం ప్రయోజనం న సిద్ధ్యతీతి భావః, అహం, ఇదం = కార్యకారణోభయావస్థ స్థూలసూక్ష్మచిదచిద్వస్త్వాత్మకం కృత్స్నం జగత్, ఏకాఽంశేన - ఏకేన = అత్యల్పేన, అంశేన = మన్నియమనసామర్థ్యాఽయుతాఽయుతభాగేన, విష్టభ్య = యథా స్థితిప్రవృత్త్యాదిషు మత్సంకల్ప మతిలంఘ్య స్వైరం న వ్యాప్రియేత తథాఽధిష్ఠాయ స్థితః, ఏవం సంగ్రహేణ జానీహీతి భావః ॥42॥

ఇతి శ్రీభగవద్గీతాభాష్యార్థ సంగ్రహ తాత్పర్యదీపే శ్రీవరవరముని విరచితాయాం బాలబోధిన్యపరాభిధానాయాం గీతార్థ సంగ్రహ దీపికాయాం దశమోఽధ్యాయః.

— o —

శ్రీరస్తు

గీతాఽర్థ సంగ్రహః

శ్లో॥ స్వకళ్యాణగుణాఽనన్త్య కృత్స్నస్వాధీనతామతిః।
భక్త్యుత్పత్తి వివృద్ధ్యర్థం విస్తీర్ణా దశమోదితా ॥

అర్థ -: భక్తి + ఉత్పత్తి వివృద్ధి + అర్థం = (భగవంతునియందు) భక్తి కలుగుటకు; కలిగిన భక్తి వర్ధిచెందుటకునై; స్వకళ్యాణగుణ + అనన్త్య; కత్స్నస్వాధీనతామతిః = తన (భగవంతునియొక్క) కళ్యాణ గుణముల అనన్తత్వము; చేతనాఽచేతనాత్మకమైన సమస్తప్రపంచము తనస్వాధీనమున నుండును అను జ్ఞానము; విస్తీర్ణా = విశదముగ; దశమ + ఉదితా = దశమాఽధ్యాయమున ఉపదేశింపబడినది.

తా -: భగవంతుడు ఈ దశమాధ్యాయమునందు భక్తులలో భగవద్భక్తి జనించి వృద్ధిచెందుటకై తన కల్యాణగుణముల అనన్తత్వమును (అపరిచ్ఛిన్నత్వమును) సర్వప్రపంచము తన విభూతియై (విధేయమై) యుండుటను విస్తరించి ఉపదేశించినాడు.

---

శ్రీ రస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భగవద్గీతామృతము

## ఏకాదశాఽధ్యాయము — విశ్వరూప సందర్శనయోగము

అర్జున ఉవాచ -:

శ్లో॥ మదనుగ్రహాయ పరమం; గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచస్తేన; మోహోఽయం విగతో మమ ॥ 1

టీ -: మత్ + అనుగ్రహాయ = నన్ను అనుగ్రహించుటకొఱకు; పరమం = మిక్కిలి; గుహ్యం = రహస్యమైనది; అధ్యాత్మసంజ్ఞితం = ఆధ్యాత్మము (ఆత్మకుసంబంధించినది) అనుపేరుగలదియైన; యత్ + వచః = "నత్వేవాఽహం జాతు నాసం" (అ. 2. శ్లో. 12) అనుశ్లోకము మొదలుకొని. "తస్మాద్యోగీభవాఽర్జున (అ. 6. శ్లో. 46) అనుశ్లోకపర్యంతము; యత్ + వచః = ఏవాక్యము (విషయము) ఉక్తం = చెప్పబడినదో, తేన = దానిచేత; అయం = ఈ ఆత్మవిషయకమైన; మమ = నాయొక్క మోహః = భ్రమము; విగతః = సమగ్రముగ నశించినది.

తా -: భగవన్; "నత్వేవాఽహం జాతు నాసం" అని ప్రారంభించి "తస్మాద్యోగీభవాఽర్జున" అనునంతవరకు నీవు గావించిన ఉపదేశము వలన ఆత్మవిషయకమైన నా భ్రాంతి సంపూర్ణముగ నశించినది.

దీపికా -: ఏవం భక్తియోగనిష్పత్తయే తద్వివృద్ధయే చ స్వేతర సకలస్వభావవిలక్షణేన భగవదసాధారణేన కల్యాణగుణగణేన సహ భగవతస్సర్వాత్మకత్వే సర్వస్య జగతస్తచ్ఛరీరతయా తదాయత్త స్వరూప స్థితిప్రవృత్తిత్వే చ కథితే సతి తచ్ఛ్రుత్వాఽఽస్తిక్యాతిరేకాత్ - తత్తథైవేతి నిశ్చిత్య యథాశ్రుతాకారవిశిష్టం భగవంతం సాక్షాత్కర్తుకామోఽర్జున అహ॥

మదనుగ్రహాయ = మమ దేహాత్మమోహోపహతస్య, అనుగ్రహాయ = అనుగ్రహం కర్తుం, మదనుగ్రహైక ప్రయోజనపరతయేత్యర్థః, పరమం గుహ్యం = అతిరహస్యం, అధ్యాత్మసంజ్ఞితం = ఆత్మాన మధికృత్య ప్రవృత్తతయాఽధ్యాత్మ మితి సంజ్ఞాయుక్తం, యద్వచః = నత్వేవాఽహం జాతు నాఽస మిత్యారభ్య - తస్మాద్యోగీ భవార్జున - ఇత్యేతదంతం వాక్యం త్వయోక్తం, తేన వాక్యేన, అయం - ఆత్మవిషయః, మమ మోహః = భ్రమః, విగతః = సవాసనం వినాశిత ఇత్యర్థః ॥ 1 ॥

శ్లో॥ భవాఽప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్త్రాక్ష; మాహాత్మ్యమపి చాఽవ్యయమ్॥ 2

టీ -: కమలపత్రా + అక్ష = తామరఱేకులవంటి నేత్రములు గల ఓ శ్రీకృష్ణా; భూతానాం = సకలప్రాణులకు; త్వత్తః = నీవలన కలుగు; భవ + అప్యయౌ = ఉత్పత్తివినాశములు; మయా = నాచేత; విస్తరశః = సవిస్తరముగ; శ్రుతౌహి = వినబడినవిగదా; అవ్యయం = వినాశము లేని; మాహాత్మ్యం + అపి = (నీ) మాహాత్మ్యమున్ను (వినబడినది).

తా -: పుండరీకాక్ష; (ఏడవ అధ్యాయము మొదలుకొని పదియవ అధ్యాయమువరకు) సకలచరాఽచరప్రపంచముయొక్క సృష్టి స్థితి సంహారములకు నీవే కారణమని; నీవు సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ సర్వాధారత్వ సర్వశేషిత్వాద్యనన్తకల్యాణగుణ విశిష్టుడవని నీ మాహాత్మ్యము సమగ్రముగ వినియున్నాను.

దీపికా -: ఏవం ప్రథమషట్కాఽర్థ స్సూచితః, అథ సప్తమాద్యధ్యాయచతుష్టయోక్త మర్థ మనువదతి ।

హే కమలపత్రాక్ష = పుండరీకదళాఽమలాయతేక్షణ, హి = యస్మాత్, భూతానాం = దేవమనుష్యాది సమస్తజంతూనాం, త్వత్తః = పరమాత్మనస్సకాశాత్, భవాఽప్యయౌ = ఉత్పత్తిప్రళయౌ, విస్తరశః = ప్రపంచేన, మయా శ్రుతౌ, అవ్యయం = కాలతో విషయుతస్సంఖ్యాతః ప్రకర్షతశ్చాఽవధిరహితం, మాహాత్మ్యం చ = శేషిత్వ పరత్వ సర్వాధారత్వ సర్వప్రవర్తయితృత్వాదిరూపస్త్వన్మహిమా చ విస్తరశః శ్రుతః, 'హి' శబ్దోఽత్ర వక్ష్యమాణభగవద్రూప దిదృక్షా హేతుత్వ మేతదర్థశ్రవణస్య సూచయతి ॥ 2 ॥

శ్లో॥ *ఏవ మేతద్యథాఽఽత్థ త్వం; మాత్మానం పరమేశ్వర,*
*ద్రష్టు మిచ్ఛామి తే రూపం; మైశ్వరం పురుషోత్తమ ॥* 3

టీ -: హే పరమేశ్వర = సర్వేశ్వరుడవైన శ్రీకృష్ణ; త్వం = నీవు; ఆత్మానం = నిన్ను గురించి; యథా = ఎట్లు; ఆత్థ = చెప్పితివో; ఏతత్ = ఇది; ఏవం = ఇట్లే (అని అవధృతం = నిశ్చయింపబడినది). హే పురుష +

ఉత్తమ = భక్తుల దోషములను పరిగణింపని) ఓ ఉత్తమపురుష; తే = నీయొక్క; ఐశ్వరం = ఈశ్వరసంబంధమైన; రూపం = రూపమును; ద్రష్టుం = దర్శించుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా -: బ్రహ్మరుద్రేంద్రాదులకును అధిపతివైన నీవు తెలిపిన నీ మాహాత్మ్యము సర్వము సర్వథా సత్యమని నిశ్చయించుకొంటిని. ఆశ్రిత వత్సలుడవైన శ్రీకృష్ణా; అనన్తకళ్యాణగుణవిశిష్టమై ఈశ్వరత్వనిరూపక మైన నీ (విశ్వ) రూపమును దర్శింప గోరుచున్నాను.

దీపికా -: హే పరమేశ్వర = ఈశ్వరత్వేన ప్రసిద్ధానాం బ్రహ్మ రుద్రాదీనా మపీశ్వర, అతివిశ్వసనీయవచనో హి భవానితి భావః, ఆత్మా నం = త్వాం, యథా = యేన ప్రకారేణ కల్యాణగుణవిభూతివిశిష్టత్వ రూపేణ,ఆత్థ = బ్రవీషి, ఏతత్ = త్వత్స్వరూపస్య త్వదుక్తాకారవిశిష్టత్వం, ఏవం = ఇత్థం, సత్యమేవ; నాఽన్యదిత్యర్థః, హే పురుషోత్తమ, ఆశ్రిత జనే తదిష్టప్రదానవిరోధి దోషదర్శనం హి కాపురుషలక్షణం, భవాం స్తూత్తమపురుషతయాఽఽశ్రితవత్సలత్వేన తత్ప్రీత్యనీకాకార ఇతి భావః, తే = తవ, ఐశ్వరం = ఈశ్వరాఽసాధారణం, రూపం = కల్యాణ గుణవిభూతివిశిష్టం విగ్రహం, ద్రష్టుం = చక్షుషా సాక్షాత్కర్తుం, ఇచ్ఛామి = అభిలషామి, పూర్వశ్లోకద్వయే భగవతా పూర్వముక్తానా మర్థా నాం యథావ దనువాదేనాఽర్జునస్య కృతజ్ఞతా సూచితా,అస్మిన్ శ్లోకే తు- ఏవ మేతదితి భగవదుక్తార్థే విశ్వాసకథనా దాస్తిక్యం సూచితం, ద్రష్టు మిచ్ఛామీతి భగవదుక్తాకారవిశిష్టతద్రూపదిదృక్షాకథనా ద్భగవత్కల్యాణ గుణవిభూతి శ్రవణోచితభక్తివివృద్ధిస్సూచితా ॥ 3 ॥

శ్లో॥ *మన్యసే యది తచ్ఛక్యం; మయా ద్రష్టు మితి ప్రభో,*
*యోగేశ్వర! తతో మే త్వం; దర్శయాత్మాన మవ్యయమ్ ॥* 4

టీ -: యోగ + ఈశ్వర = జ్ఞానశక్త్యాదిగుణవిశిష్టుడవైన; ప్రభో = స్వామీ; తత్ = అట్టి రూపము; మయా = నాచేత; ద్రష్టుం = సాక్షాత్క

రించుటకు; శక్యం=సాధ్యమైనది ఇతి=అని; మన్యసే యది=తలంచి నచో; తతః=దానిని (అ సంకల్పమును) బట్టి; త్వం = నీవు; ఆత్మానం=నిన్ను; మే=నాకు;అవ్యయం=సమగ్రముగ;దర్శయ=సందర్శింపజేయుము.

తా -: ప్రభూ; జ్ఞానశక్త్యాదికల్యాణగుణవిశిష్ట మైన నీ యొక్క ఆ రూపమును నేను దర్శించుటకు తగినవాడినని నీవు తలంచినచో ఒక్కమారు నాకు దర్శింపజేయుము. (ఆశ్రితవత్సలుడైన సర్వేశ్వరుడు సంకల్పించినచో అతని దివ్యరూపమును దర్శించుట అసాధ్యముకాదు. "యమేవైషవృణుతే తేన లభ్యః" అనిగదాశ్రుతిప్రమాణము.)

నన్వశక్యాఽర్థవిషయణీయం త్వదిచ్ఛేత్యాంశంక్యాహ —

హే ప్రభో, యోగేశ్వర - యోగః - జ్ఞానశక్త్యాదిగుణయోగః, తస్య ఈశ్వర=నిర్వాహక-గుణపరిపూర్ణేత్యర్థః, తత్ = త్వత్స్వరూపం, మయా ద్రష్టుం=సాక్షాత్కర్తుం, శక్య మితి మన్యసే యది - సంకల్పయసి చేత్, తతః=త్వత్సంకల్పాద్ధే తోః, ఆత్మానం త్వత్స్వరూపం, అవ్యయం=గుణ విభూతివిగ్రహేషు ద్రష్టు మిష్టేష్వశేషం యథాతథా, మే=శరణాగతస్య మమ, త్వం దర్శయ, స్వయత్నేన ద్రష్టు మిచ్ఛతాం హి దుష్కరం త్వద్దర్శనం, యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వా మితి శ్రుత్యుక్తరీత్యా స్వసంకల్పేన త్వమేవ త్వాం దర్శయితుం ప్రవృత్తశ్చేత్కిం తత్ర దౌష్కర్య మితి భావః ॥ 4 ॥

శ్రీభగవానువాచ -:

శ్లో॥ *పశ్య మే పార్థ రూపాణి; శతశోఽథ సహస్రశః ।*
*నానావిధాని దివ్యాని; నానావర్ణాకృతీని చ ॥* 5

టీ -: పార్థ=అర్జున; శతశః=నూఱుల కొలదియు; సహస్రశః=వేల కొలదియు; నానావిధాని=అనేకవిధములై; దివ్యాని = అప్రాకృత ములై; నానావర్ణ+ఆకృతీని చ=అనేకవిధములైన వర్ణములు(రంగులు)

ఆకారములు కలిగిన; మే = నాయొక్క; రూపాణి = రూపములను; అథ = సమగ్రముగ; పశ్య = చూడుము.

తా -: అర్జున; నా అనన్తరూపములను సమగ్రముగ దర్శింపుము.

దీపికా -: ఏవం కౌతూహలాఽన్వితేన సహర్షగద్గదకంఠేన పార్థేన ప్రార్థితో భగవానాహ ।

హే పార్థ, శతశః సహస్రశః - శతాని సహస్రాణి చ, పరవ్యూహ విభవాద్యనంతాఽవస్థావంతీత్యర్థః, నానావిధాని - ప్రత్యేకం భూషణాయుధలాంఛన భుజసంఖ్యాది నానాప్రకారవంతి, దివ్యాని = అప్రాకృతాని, నానావర్ణాకృతీని చ - నానా = అనేకప్రకారాః, వర్ణాః = శుక్ల రక్తాదిరూపాణి, ఆకృతయః = సురనరతిర్యగాది సమానసంస్థానాని చ, యేషాం తాని తథోక్తాని చ, నానావర్ణాకృతిత్వం చ వాసుదేవాదిషు చతసృషు మూర్తిషు యుగభేదేన సితరక్తపీతకృష్ణరూపపరివృత్తేః, అవతారాంతరేషు చ తత్తత్ఫలార్థినా మనుసంధానాఽనుగుణ రూపత్వేనాఽవస్థానాచ్చ ద్రష్టవ్యం. మే = మమ, రూపాణి = విగ్రహాణి, పశ్య = వీక్షస్వ, యథా ద్రక్ష్యసి తథా కరిష్యామీత్యభిప్రాయః, రాగప్రాప్తేఽర్జునస్య భగవద్దర్శనే ప్రవర్తనాఽయోగాత్, అథ శబ్దోఽత్ర కార్త్స్న్యపరః, అథ పశ్య = కార్త్స్న్యేన పశ్యేత్యర్థః ॥ 5 ॥

శ్లో॥ పశ్యాదిత్యాన్ వసూన్రుద్రాన్ అశ్వినౌ మరుతస్తథా ।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ 6

టీ -: భారత = అర్జున; ఆదిత్యాన్ = ద్వాదశాదిత్యులను; వసూన్ = అష్టవసువులను; రుద్రాన్ = ఏకాదశరుద్రులను; అశ్వినౌ = అశ్వనీదేవతల నిద్దరిని; మరుతః = నలువదితొమ్మిదిమంది మరుద్దేవతలను; పశ్య = చూడుము. తథా = అట్లే; అదృష్టపూర్వాణి = ఇదివరలో ఎచ్చట చూడబడని; బహూని = అనేకములైన; ఆశ్చర్యాణి = అద్భుతములను; పశ్య = చూడుము.

తా -: అర్జున; నాయందు సకలదేవతలు ఎట్లు నెలకొనియున్నారో చూడుము. ఇట్లే నీవు మున్నెన్నడు చూచి యెఱుగని అద్భుతములను కూడ నాయందు చూడుము.

దీపికా -: హే భారత, ఆదిత్యాన్ - ద్వాదశ, వసూన్ - అష్టౌ, రుద్రాన్ - ఏకాదశ, అశ్వినౌ = ద్వౌ, మరుతః = ఏకోనపంచాశతం వాయూన్, పశ్య - మమ రూపే సాక్షాత్కురు, ఇదం జగతి ప్రత్యక్ష దృష్టానాం శాస్త్రదృష్టానాంచాఽన్యేషా మపి వస్తూనా ముపలక్షణం, తథా అదృష్టపూర్వాణి - ఇతఃపూర్వం సర్వేషు లోకేషు శాస్త్రేషు చాఽదృష్టాని బహూని ఆశ్చర్యాణి పశ్య, దర్శనక్రియాయా స్సకృదుక్త్యైవ చారితార్థ్యేఽప్యదృష్టపూర్వాణా మాశ్చర్యతయా ప్రాధాన్యేన దర్శనీయత్వజ్ఞాపనాయ పునరుక్తిః ॥ 6 ॥

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం; పశ్యాఽద్య సచరాఽచరమ్ ।
మమ దేహే గుడాకేశ; యచ్చాఽన్యద్ద్రష్టు మిచ్ఛసి ॥ 7

టీ -: గుడాకా + ఈశ = అర్జున; అద్య = ఇపుడు; మమ = నా యొక్క; ఇహ దేహే = ఈ దేహమునందు; ఏకస్థం = ఒకచోట జేరియున్న; సచర + అచరం = చరాఽచరములతో గూడిన; కృత్స్నం = సమగ్రమైన; జగత్ = జగత్తును; పశ్య = చూడుము, అన్యత్ = ఇతరమైన; యత్ = దేనిని. ద్రష్టుం = చూచుటకు; ఇచ్ఛసి = కోరుచున్నావో. (దానిని) పశ్య = చూడుము.

తా -: అర్జున; నాకు అనేకదేహములు గలవు. వానిలో ఒక్క దేహమునందు ఈ చరాఽచరప్రపంచము ఎట్లు అమరియున్నదో చూడుము. ఇట్లే ఇంకను నీవు చూడగోరువానిని సైతము చూడుము.

దీపికా -: ప్రదర్శయిష్యమాణే స్వకీయరూపే కృత్స్నస్య జగతో నిబిడవృత్తిశంకాం నివర్తయితు మాహ —

హే గుడాకేశ, అద్య=ఇదానీం, ఇహ = మయా ప్రదర్శయిష్యమాణే, మమ దేహే=ఏకస్మిన్ విగ్రహే, ఏకస్థం - ఏకస్మిన్ సంస్థితం, సచరాఽచరం = జంగమస్థావరసహితం, కృత్స్నం=అశేషం, జగత్, పశ్య; కించ, అన్యత్=ఉక్తాదన్యత్, యత్ ద్రష్టుం ఇచ్ఛసి. తదపి పశ్యేత్యన్వయః ॥ 7 ॥

శ్లో॥ నతు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ 8

టీ - అనేన = ఈ; స్వచక్షుషా + ఏవ తు = ఈ నీ కంటితోనే; మాం=నన్ను; ద్రష్టుం = చూచుటకు; న శక్యసే = సమర్థుడవు కావు; తే=నీకు; దివ్యం=అప్రాకృతమగు; చక్షుః = నేత్రమును; దదామి= ఇచ్చుచున్నాను. మే=నాయొక్క; ఐశ్వర్యం=ఈశ్వరత్వమునకు సంబంధించిన; యోగం=అనంతకల్యాణగుణ విభూతి విగ్రహయోగమును; పశ్య=చూడుము.

తా -: ఈ ప్రాకృతమైన నీ నేత్రముతో నా రూపమును దర్శింపజాలవు. కావున నీకు దివ్యమైన నేత్రము నిచ్చెదను. దానితో దర్శింపుము.

దీపికా -: త్వం తు, అనేనైవ=పరిమితవిషయగ్రాహిణా ఇతరనిరపేక్షేణ, స్వచక్షుషా = త్వదీయేన మాంసచక్షుషా, మాం = మదుక్తాకారవిశిష్ట మప్రమేయం మద్రూపం ద్రష్టుం, న శక్యసే= న శక్తో భవిష్యసి, న మాంస చక్షు రభివీక్షతే త మితి శ్రుతేరితి భావః, 'తు' శబ్దేన-అహం తు మద్రూపం దర్శయిష్యామీతి వ్యజ్యతే, తే=తవ, దివ్యం=అప్రాకృతం మద్రూపదర్శనసమర్థం, చక్షుః=నేత్రం దదామి, తేన దివ్యచక్షుషా, మే = మమ, ఐశ్వరం=అసాధారణం, యోగం = అనంతకల్యాణగుణ విభూతివిగ్రహయోగం పశ్య ॥ 8 ॥

సంజయ ఉవాచ -:

శ్లో॥ *ఏవముక్త్వా తతో రాజన్; మహాయోగేశ్వరో హరిః ।*
*దర్శయామాస పార్థాయ; పరమం రూప మైశ్వరమ్ ॥* 9

టీ -: రాజన్=ఓ ధృతరాష్ట్రమహారాజా; మహాయోగ+ఈశ్వరః = అత్యాశ్చర్యకరములైన గుణవిభూత్యాదియోగమునకు ఈశ్వరుడైన; హరిః=శ్రీకృష్ణుడు; ఏవం=ఈ విధముగా; ఉక్త్వా = పలికి; తతః=అటుపిమ్మట; ఐశ్వరం = (తన) ఈశ్వరత్వమునకు సంబంధించిన; పరమం=మిక్కిలి ఉత్కృష్టమైన; రూపం=రూపమును; పార్థాయ=అర్జునునికొఱకు; దర్శయామాస=చూపించెను.

తా -: ధృతరాష్ట్రమహారాజా; అత్యాశ్చర్యగుణచేష్టితాదులు గల శ్రీకృష్ణుడు. ఆ విధముగ పలికి తన అసాధారణరూపమును అర్జునునికి దర్శింపజేసెను.

దీపికా-: ఏవం ప్రతిజ్ఞాయ తతః కృష్ణః కిం కృతవానితి పృచ్ఛంతం ధృతరాష్ట్రం సంజయ ఉవాచ —

హే రాజన్ ధృతరాష్ట్ర, రాజ్ఞాం ఖల్వద్భుతవృత్తాంతనివేదనముచితమతి భావః, మహాయోగేశ్వరః - మహతాం=అత్యాశ్చర్యాణాం, యోగానాం=కల్యాణగుణవిభూత్యాదియోగానాం, ఈశ్వరః=నియంతా, స్వాయత్తీకృత సకలాశ్చర్యయోగ ఇత్యర్థః, హరిః = తన్మాతులసుతత్వ ప్రయుక్త వాత్సల్యాతిరేకేణ తత్సారథ్యేఽవస్థాయాఽపి తద్విరోధినిర్హరణే వ్యాప్రియమాణో భగవాన్ కృష్ణః, ఏవం=పశ్య మే పార్థ రూపాణీత్యాది ప్రకారేణ ఉక్త్వా, తతః=తదనంతరం, పార్థాయ=పృథాయాః పితృష్వసుః కుంత్యాః పుత్రాయాఽర్జునాయ, పరమం=నిరతిశయం, ఐశ్వరం=స్వాఽసాధారణం, రూపం = వివిధవిచిత్ర నిఖిలజగదాశ్రయ విగ్రహం, దర్శయామాస=దివ్యచక్షుర్విషయం చకార ॥ 9 ॥

శ్లో॥ అనేకవక్త్రనయన మనేకాఽద్భుతదర్శనమ్,
అనేకదివ్యాభరణం; దివ్యాఽనేకోద్యతాయుధమ్॥ 10

శ్లో॥ దివ్యమాల్యాఽంబరధరం; దివ్యగన్ధాఽనులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ; మనన్తం విశ్వతో ముఖమ్॥ 11

టీ -: అనేకవక్త్రనయనం = అనేకములైన ముఖములు నేత్రములు గలది; అనేక + అద్భుతదర్శనం = అనేకములగు అద్భుతములైన దర్శనములు గలది; అనేకదివ్య + అభరణం = అనేకవిధములై అప్రాకృతములైన కిరీటకుండలాద్యాభరణములు గలది; దివ్య + అనేక + ఉద్యత + అయుధం = అప్రాకృతములై అనన్తములై పైకి ఎత్తబడియున్న ఆయుధములు గలది; దివ్యమాల్య + అంబరధరం = అప్రాకృతములైన పుష్పమాలికలను వస్త్రములను గలది; దివ్యగంధ + అనులేపనం = విలక్షణమైన సుగంధపు మైపూత గలది; సర్వ + ఆశ్చర్యమయం = సకలవిధములైన ఆశ్చర్యములకు ఆశ్రయమైనది; అనన్తం = అపరిచ్ఛిన్నము; విశ్వతః + ముఖం = అన్నివైపుల మొగములు గలది; దేవం = ప్రకాశమానము అయిన (తన రూపమును దర్శింపజేసెను).

తా -: అనేకములైన ముఖములు అభరణములు ఆయుధములు గలిగి దివ్యములైన వస్త్రచందన మాలికాదులచే అలంకృతమై సర్వాశ్చర్యనిలయమై అపరిచ్ఛిన్నమై ప్రకాశించుచున్న తన రూపమును శ్రీకృష్ణుడు అర్జునునికి చూపించెను.

దీపికా -: తద్రూపం కీదృశ మిత్యత్రాహ —

అనేకవక్త్రనయనం-అనేకాని=బహూని, వక్త్రాణి=ముఖాని, నయనాని=నేత్రాణి చ, యస్య తథోక్తం, అనేకాఽద్భుతదర్శనం - అనేకాఽద్భుతం దర్శనం యస్య తదనేకాద్భుతదర్శనం - అనవధికాశ్చర్యతయా దృశ్యమాన మిత్యర్థః, అనేకదివ్యాభరణం - అనేకాని = అనేకజాతీయాని, దివ్యాని=అప్రాకృతతయా స్వోచితాని చ, అభరణాని =

కిరీటకుండలాదీని భూషణాని, యస్య తత్ = అనేకదివ్యాభరణం, దివ్యాఽనేకోద్యతాయుధం - దివ్యాని = అప్రాకృతాని, అనేకాని = నానా జాతీయాని, ఉద్యతాని = ఆశ్రితవిరోధి నిరసనోన్ముఖీకృతాని చ, ఆయుధాని యస్య తత్ - దివ్యానేకోద్యతాయుధం దివ్యమాల్యాఽంబరధరం - దివ్యాని = స్వోచితాని, మాల్యాని = కుసుమస్రజః, అంబరాణి = వస్త్రాణి చ - ధరతీతి దివ్యమాల్యాంబరధరం, దివ్యగంధాఽనులేపనం - దివ్యగంధాని = అప్రాకృతసౌరభాణి, అనులేపనాని = చందనకుంకుమ కస్తూరికాదీని, యస్య తత్ - దివ్యగంధాఽనులేపనం, సర్వాశ్చర్యమయం = ఆశ్చర్యభూత సర్వతత్త్వాశ్రయ మిత్యర్థః, దేవం = ద్యోతమానం, అనంతం = కాలత్రయవర్తి నిఖిలజగదాశ్రయతయా దేశకాలపరిచ్ఛేదాఽనర్హం, విశ్వతోముఖం = విశ్వదిగ్వర్తిముఖం, అనేకవక్త్రేత్యుక్తమేవాఽత్ర వివిత్రయత ఇత్యపౌనరుక్త్యం, ఏతాదృశం రూపం దర్శయామాసేతి పూర్వేణాఽన్వయః ॥ 10, 11 ॥

శ్లో॥ *దివి సూర్యసహస్రస్య; భవేద్యుగప దుత్థితా ।*
*యది భాస్సదృశీ సా స్యా; ద్భాస స్తస్య మహాత్మనః ॥* 12

**టీ -:** దివి = ఆకాశమునందు; సూర్యసహస్రస్య = వేయిసూర్యుల యొక్క; భాః = కాంతి; యుగపత్ = ఒక్కమారుగ; ఉత్థితా భవేత్ యది = ఉద్భవించినచో; సా = (అట్టి) ఆ కాంతి; తస్య మహాత్మనః = ఆ మహాత్ముని యొక్క; భాసః = కాంతికి; సదృశీ = సమానమైనది; స్యాత్ = అగును.

**తా -:** ధృతరాష్ట్రమహారాజా; వేయిసూర్యుల కాంతితో ఆ మహాత్ముని ఆ దివ్యరూపము భాసించినది. (వ్యాసభగవానుని అనుగ్రహముచే సంజయుడు ఆ దివ్యరూపమును దర్శింపగలిగినాడు)

**దీపికా -:** దేవశబ్దనిర్దిష్టస్య భాస్వరత్వస్య నిరతిశయత్వరూపం విశేషమాహ దివి = ఆకాశే, సూర్యసహస్రస్య = సహస్రశబ్దోఽత్రాఽఽనంత్య

వాచీ, అనంతసూర్యాణామిత్యర్థః, భాః = కాంతిః, యుగపత్ = ఏకకాల ఏవ, ఉత్థితా = ఉదితా, భవేద్యది, సా = భాః, తస్య = భగవతః, మహాత్మనః = మహతో విగ్రహస్య, భాసః = తేజసః. సదృశీ = సమా, స్యాత్, అభూతోపమేయం, అసదృశం తత్తేజ ఇత్యర్థః, అత్ర భగవద్వ్యాస ప్రసాదలబ్ధ దివ్యచక్షుషా సంజయేనాప్యేతద్రూపం దృష్టమితి ప్రతీయతే- కథమన్యథా- ఇత్థం భగవద్విగ్రహకాంత్యతిశయవర్ణన ముపపద్యతే ॥12॥

శ్లో॥ *తత్రైకస్థం జగత్కృత్స్నం; ప్రవిభక్త మనేకధా,*
*అపశ్యద్దేవదేవస్య; శరీరే పాండవస్తదా॥* 13

టీ -: పాండవః = అర్జునుడు; తదా = అపుడు; అనేకధా = అనేక విధములుగ; ప్రవిభక్తం = విభజింపబడిన; కృత్స్నం = సమగ్రమైన; జగత్ = జగత్తును; దేవదేవస్య = దేవదేవుడైన శ్రీకృష్ణునియొక్క; తత్ర దేహే = ఆ దేహమునందు; ఏకస్థం = ఏకదేశమున నున్నదానినిగ; అపశ్యత్ = దర్శించెను.

తా -: నానావిధములనున్న జగత్తును శ్రీకృష్ణుని ఆ విశ్వరూపమునందు శ్రీకృష్ణుని అనుగ్రహముచేత అర్జునుడు దర్శించెను.

దీపికా -: తత్ర = అనంతాయామవిస్తారేఽపరిమితతేజస్కే ఆనంతాశ్చర్యమయే, దేవదేవస్య = మనుష్యాణాం దేవవద్దేవానా మపి బ్రహ్మ రుద్రాదీనాం ద్రష్టుమశక్యస్య భగవతః, శరీరే = దేహే, ఏకస్థం = ఏకదేశ స్థితం, అనేకధా = వివిధవిచిత్ర భోక్తృభోగ్యభోగోపకరణ భోగస్థానాది బహుప్రకారైః, ప్రవిభక్తం = భిన్నం, కృత్స్నం = ప్రకృతిపురుషాత్మకం సర్వం జగత్, తదా = తస్మిన్కాలే, పాండవః అపశ్యత్ = భగవత్ప్రసాదలబ్ధ తద్దర్శనానుగుణ దివ్యచక్షుషా దదర్శ ॥ 13 ॥

శ్లో॥ *తతస్స విస్మయావిష్టో; హృష్టరోమా ధనంజయః,*
*ప్రణమ్య శిరసా దేవం; కృతాంజలి రభాషత॥* 14

టీ -: తతః = పిమ్మట; విస్మయ + ఆవిష్టం = ఆశ్చర్యముతో కూడినవాడు; హృష్టరోమా = రోమాంచితుడైన; సః ధనంజయః = ఆ అర్జునుడు; దేవం = విశ్వరూపియై యున్న శ్రీకృష్ణుని; శిరాసా = శిరస్సుచేత; ప్రణమ్య = నమస్కరించి; కృత + అంజలిః = అంజలిఘటించినవాడై; అభాషత = పలికెను.

తా -: భగవంతుని ఆ విశ్వరూపమును చూచి ఆశ్చర్యభరితుడైన అర్జునుడు పులకాంచితగాత్రుడై భగవంతునికి నమస్కరించి ఇట్లు పలికెను.

దీపికా -: సః ధనంజయః = అర్జునః, తతః - తస్మాత్, అదృష్టపూర్వ భగవద్దివ్యవిగ్రహ దర్శనాద్ధేతోః, విస్మయావిష్టః - విస్మయేన = ఆశ్చర్యేణ, అద్భుతరసదాయినా, ఆవిష్టః = ఆక్రాంతః, అత ఏవ, హృష్టరోమా - హృష్టాని = స్తబ్ధాని రోమాణి యస్య తథోక్తస్సన్, దేవం = ఏకదేశేనైవ కృత్స్నజగదాశ్రయభూతం స్వాఽసాధారణం విగ్రహం ప్రదర్శయితార మాశ్చర్యైకనిధిం సంపన్నం, శిరసా - కిరీటితయా జగద్విదితేన మూర్ధ్నా సహ, ప్రణమ్య = దండవత్పునః పునర్భూతలే పతిత్వా కృతాంజలిస్సన్, అభాషత = ఉవాచ ॥ 14 ॥

అర్జున ఉవాచ -:

శ్లో॥ *ప్రశ్యామి దేవాంస్తవ దేవ; దేహే*
*సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్ ।*
*బ్రహ్మాణమీశం కమలాసనస్థం;*
*ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్* ॥ 15

టీ -: దేవ = శ్రీకృష్ణ; తవ దేహే = నీ శరీరమునందు; సర్వాన్ దేవాన్ = సకలదేవతలను; తథా = అట్లు; భూతవిశేషసంఘాన్ = ప్రాణివిశేషముల సముదాయములను; బ్రహ్మాణం = చతుర్ముఖబ్రహ్మను; కమల + ఆసనస్థం = కమలాసనుని (బ్రహ్మయొక్క) అనుసరించి

యుండు; ఈశం=రుద్రుని; సర్వాన్+ఋషీన్ చ=సకలమహర్షులను; దివ్యాన్=విశిష్టములైన; ఉరగాన్=వాసుకితక్షకాది సర్పరాజములను; పశ్యామి=చూచుచున్నాను.

తా -: శ్రీకృష్ణ; నీ యీ దివ్యదేహమునందు సకలప్రాణివిశేషములను బ్రహ్మరుద్రులను దేవతలను మహర్షులను సర్పరాజములను చూచుచున్నాను.

దీపికా -: హే దేవ,తవ, దేహే=దివ్యవిగ్రహే, సర్వాన్=కర్మజానాజానజాంశ్చ సమస్తాన్, దేవాన్=ద్వాదశాదిత్యాన్, త్రయస్త్రింశతం వా, తథా, సర్వాన్ భూతవిశేషసంఘాన్=ప్రాణివిశేషసమూహాన్, అత్ర విశేషోపాదానం క్రిమికీటదంశమశకాది క్షుద్రజంతువ్యావర్తనాయ, తత్సంబంధస్య హేయత్వా దస్మదాది ప్రాకృతశరీరసాధారణత్వాచ్చ, బ్రహ్మాణం = అండాఽధిపతిం చతుర్ముఖం, కమలాసనస్థం-కమలాసనే-బ్రహ్మణి స్థితం, తన్మతే స్థితం, ఈశం = రుద్రం, ఈశపదవ్యవధానా దాసనపదవైయర్థ్యాచ్చ కమలాసనస్థ మిత్యస్య బ్రహ్మవిశేషణత్వాఽయోగాత్, నచేశపదమపి చతుర్దశభువన నియంతృవాచితయా బ్రహ్మవిశేషణం, బ్రహ్మాణమితి పుంలింగబ్రహ్మశబ్దే నైవ చతుర్ముఖాఽసాధారణేన తస్యాఽర్థతస్సిద్ధేః, బ్రహ్మశబ్దవత్ ద్రష్టవ్యదేవతాంతరపరత్వే స్వారస్యాఽతిశయాచ్చ, దివ్యాన్=ప్రాకృత సర్పవిలక్షణాన్ సర్వాన్ ఉరగాంశ్చ=వాసుకితక్షకప్రముఖాన్ సర్పాంశ్చ పశ్యామి ॥ 15 ॥

శ్లో॥ అనేకబాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్,
నాఽన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప! ॥ 16

టీ -: విశ్వ + ఈశ్వర = చేతనాఽచేతనాత్మకప్రపంచమునకు నియామకుడవైన; విశ్వరూప=ఓ జగచ్ఛరీరక; అనేకబాహు + ఉదర

వక్త్రనేత్రం=అనేభుజములు ఉదరములు ముఖములు కలిగిన; అనన్తరూపం=అంతము లేని రూపములు గలిగిన; త్వాం=నిన్ను; సర్వతః=అంతట; పశ్యామి=చూచుచున్నాను. పునః=మరల; తవ=నీయొక్క; అంతం=అంతమును; న=చూడకున్నాను. మధ్యం = మధ్యమును; న=చూడకున్నాను. ఆదిం=మొదలును; న=చూడకున్నాను.

తా -: జగత్తును శరీరముగ గలిగి అందు అంతర్యామివై ఆ జగత్తును నియమించుస్వామీ; అనేకభుజములు ఉదరములు ముఖములు గలిగి అపరిచ్ఛిన్నమైయున్న నీ రూపమును నీ అనుగ్రహమువలన అంతట చూచుచున్నాను. కాని నీ విశ్వరూపముయొక్క ఆదిమధ్యాఽన్తములను దర్శింపలేకున్నాను.

దీపికా -: విశ్వేశ్వర - విశ్వస్య = చిదచిదాత్మకస్య జగతః, ఈశ్వర=అంతర్వ్యాప్య నియంతః, అనేన విశ్వరూపత్వహేతు శరీరిత్వముక్తం, అంతఃప్రవిశ్య నియంతా హి శరీరీతి భావః, హే విశ్వరూప=విశ్వశరీర, అనేకబాహూదరవక్త్రనేత్రం, అనేకాని=బహూని,బాహవః=భుజాః, ఉదరాణి=కుక్షయః, వక్త్రాణి=ముఖాని, నేత్రాణి=చక్షూంషి చ, యస్య తం తథోక్తం, అనంతరూపం - అనంతాని = దేశకాలపరిచ్ఛేదరహితాని, రూపాణి యస్య తం త్వాం, సర్వతః = సమంతాత్, పశ్యామి, త్వత్ప్రసాదలబ్ధదివ్యచక్షుష్ట్వా దితి భావః, అనంతరూపత్వమేవోపపాదయతి (నాఽంతమితి) తవ, అంతం పునః=ఉత్తరావధిం తు, న పశ్యామి, ఆదిం = పూర్వావధిం చ న పశ్యామి, మధ్యం చ న పశ్యామి, ఆద్యంతోభయనిరూపణీయత్వా న్మధ్యస్య తయోరభావే మధ్యాఽభావోఽప్యర్థసిద్ధ ఇత్యర్థః, భవత్ప్రసాదలబ్ధ దివ్యచక్షుషో మమ యోగ్యాఽనుపలంభా దాదిమధ్యాంతాస్తవ తురంగస్య శృంగవన్న విద్యంత ఇత్యవధారయామీతి భావః ॥ 16 ॥

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ;
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా
ద్దీప్తాఽనలాఽర్కద్యుతి మప్రమేయమ్ ॥ 17

టీ -: తేజః + రాశిం = తేజస్సుల రాశియైనవాడవు; సర్వతః = అంతట; దీప్తిమంతం = ప్రకాశించువాడవు; దీప్త + అనల + అర్క ద్యుతిం = ప్రజ్వరిల్లెడి అగ్నిసూర్యుల కాంతిగలవాడవు; దిర్నిరీక్షం = చూచుటకు అసాధ్యమైనవాడవు; అప్రమేయం = ఇట్టివాడు ఇంతటివాడు అని తెలిసికొన సాధ్యముకానివాడవు అయిన; త్వాం = నిన్ను; కిరీటినం = కిరీటమును ధరించినవానినిగ, గదినం = గదను ధరించినవానినిగ, చక్రిణం చ = సుదర్శనచక్రము గలవానినిగను; పశ్యామి = చూచుచున్నాను.

తా -: తేజోరాశివై అంతట ప్రకాశించుచు ప్రజ్వరిల్లుచున్న అగ్నిసూర్యుల కాంతిగల్గి దుర్నిరీక్షుడవైన నిన్ను కిరీటగదాచక్రధారినిగ చూచుచున్నాను.

దీపికా -: తేజోరాశిం = తేజసాం సమూహరూపం, సర్వతో దీప్తిమంతం = సర్వత్రాపి ప్రభాయోగినం, దీప్తాఽనలార్కద్యుతిం-దీప్తానాం, అనలానాం = అగ్నీనాం, అర్కాణాం = సూర్యాణాం చ. ద్యుతిరివ ద్యుతిర్యస్య తం తథోక్తం, అత్ర బహువచనాంతయో రనలార్కపదయో రితరేతరయోగ ద్వంద్వాశ్రయణాత్ ద్వంద్వావగతేతరేతరసాహిత్యస్య వివక్షితత్వాచ్చ పరస్పరసహిత యుగపద్దీప్యమానాఽనేకాగ్నిసూర్యసమద్యుతిత్వం లభ్యతే, తేన పూర్వం దివి సూర్యసహస్రస్యేత్యసదృశత్వముక్త్వా ఇహాఽనలార్కసదృశత్వ ముచ్యత ఇతి శంకా చ నాఽస్తి, అత్ర ద్యుతిశబ్దేన కిరణరూపం తేజ ఉచ్యతే, అతో న దీప్తిమంత మిత్యనేన పునరుక్తిః, అప్రమేయం - ఈదృశ ఇయానితి పరిచ్ఛేత్తు మశక్యం, దీప్తాఽనలార్కద్యుతిత్వాదేవ, సమంతాత్ = సర్వతః, దుర్నిరీక్షం =

క్వాపిదపి, విగ్రహప్రదేశే నిరీక్షితు మశక్యం, ఏవ మదృష్టపూర్వ రూప దర్శనేఽపి త్వదసాధారణై శ్చిహ్నై స్త్వాం స మస్మాతులసుత ఏవాఽ యమితి ప్రత్యభిజానామీతి భావః ॥ 17 ॥

శ్లో॥ త్వ మక్షరం పరమం వేదితవ్యం;
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్।
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే॥ 18

టీ -: వేదితవ్యం=తెలియదగిన; పరమం = ఉత్కృష్టమైన; అక్షరం=అక్షరము అనబడు తత్త్వము; త్వం = నీవే; అస్య = ఈ; విశ్వస్య = ప్రపంచమునకు; పరం=గొప్ప,నిధానం=అధారము;త్వం= నీవే; అవ్యయః = స్వరూపరూపగుణవిభూతులచే మార్పులేనివాడవు; శాశ్వతధర్మగోప్తా = వేదవిహితములైనశాశ్వతధర్మములను రక్షించు వాడవు; త్వం=నీవే; సనాతనః = సనాతనుడైన; పురుషః = పురుషు డవును; త్వం=నీవే (అని); మే = నాకు; మతః =తెలియబడితివి.

తా -: భగవన్ చేతనాఽచేతనములకంటె ఉత్తముడవై నీవు ముముక్షుజనులచే ఉపాసింపదగియున్నావు. ఈ ప్రపంచమునకంతటికి అధారము నీవే. నీకు మరియొక అధారము లేదు. నీవు సదా ఏకరూపు డవు. ధర్మరక్షకుడవు. సనాతనపురుషుడవు అని తెలిసికొనుచున్నాను.

దీపికా -: వేదితవ్యం - "ద్వే విద్యే వేదితవ్యే పరా చాఽపరా చే" తిముండకోపనిషదాదిషు వేదితవ్యతయా నిర్దిష్టం, పరమం - 'అక్ష రాత్పరతః పరః' ఇత్యుక్తరీత్యా ప్రకృతేః పరాజ్జీవాదపి పరం, అక్షరం- 'అథ పరా, యయా తదక్షర మధిగమ్యత' ఇత్యాది శ్రుతిప్రసిద్ధ మక్షర శబ్దవాచ్యం వస్తు త్వమేవ, నాఽన్యః, అస్య-ప్రత్యక్షాదిప్రమాణసిద్ధస్య, విశ్వస్య=జంగమాఽజంగమాత్మకస్య జగతః, పరం = అనన్యాధారం, నిధీయతేఽస్మిన్నితి నిధానం - 'సర్వాధారం విష్ణుసంజ్ఞం ధామే' త్యుక్త

రీత్యా ఆధారభూతం వస్తు, "ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రా స్వర్పితాః" "ఆధారభూతం విశ్వస్య" ఇత్యాద్యుక్త జీవవ్యవచ్ఛేదార్థః పరశబ్దః, త్వమేవ, అవ్యయః - "తదవ్యయం యద్భూతయోనిం పరి పశ్యంతి ధీరాః" "అనంత మవ్యయం కవిం" ఇత్యాదౌవ్యయరహిత తయోక్తః, స్వరూపతో గుణతో విభూతితశ్చ సతతైకరూప ఇత్యర్థః, శాశ్వతధర్మగోప్తా - శాశ్వతస్య=నిత్యస్య, ధర్మస్య = శాస్త్రచోదితస్య వర్ణాశ్రమోచితధర్మస్య, గోప్తా ఏవమాదిభి రవతారైః రక్షకః, త్వమేవ, "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" "యదాయదా హి ధర్మస్య" ఇతి హి త్వయోక్తమితి భావః, సనాతనః=శాశ్వతశ్చ, పురుషః - యేనాఽక్షరం పురుషం వేద సత్యం" "వేదాఽహమేతం పురుషం మహాంతం" "పరాత్పరం పురుష ముపైతి దివ్యం" ఇత్యాదిషు జ్ఞేయతయోపాస్యతయా ప్రాప్యతయా చ శ్రుతః పురుషశబ్దవాచ్యః, త్వమేవ, మే మతః - మయా జ్ఞాతః, సాక్షాత్కృత ఇతి యావత్, అత్ర శ్లోకే త్వమితి ప్రాచీన మాంస చక్షుః ప్రతిపన్నాకారాఽనువాదః, అక్షర మిత్యాదితః దివ్యచక్షుర్విషయభూతో యదుకులతిలక స్త్వమేవేదానీం పరవిద్యావేదితవ్యాఽక్షరత్వ సమస్తజగదాధారత్వ శాశ్వతధర్మగోప్తృత్వా వ్యయత్వ పురుషత్వై రౌపనిషదాకారై ర్భవత్ప్రసాదాత్సాక్షాత్కృతోఽసీతి భావః ॥ 18 ॥

శ్లో॥ అనాదిమధ్యాన్త మనన్తవీర్య
మనన్తబాహుం శశిసూర్యనేత్రం,
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపన్తం॥ 19

టీ -: అనాదిమధ్య+అన్తం=ఆదిమధ్యాంతరహితుడవు; అనన్త వీర్యం=నిరవధికములైన వీర్యాదిగుణములు కలవాడవు; అనన్త బాహుం = అనేకభుజములు గలవాడవు; శశిసూర్యనేత్రం = చంద్ర సూర్యులవంటి నేత్రములు కలవాడవు; దీప్తహుతాశవక్త్రం = ప్రజ్వ

రిల్లెడు కాలాగ్నివంటి ముఖము గలవాడవు, స్వతేజసా = నీ తేజస్సుచేత; ఇదం విశ్వం = ఈ జగత్తును; తపన్తం = తపింపచేయుచున్నవాడవునైన; త్వాం = నిన్ను; పశ్యామి = దర్శించుచున్నాను.

తా -: నీవు ఆదిమధ్యాన్తరహితుడవు. అవధిలేని జ్ఞానశక్త్యాది గుణములు కలవాడవు. చంద్రసూర్యులవలె ఆనందమును భయమును కల్గించు నేత్రములు గలవాడవు. (ఆ నేత్రములు రాక్షసులకు భయంకరములు దేవతలకు ఆనందదాయకములు) లోకములను సంహరింప ఉద్యుక్తమైన కాలాగ్నివంటి ముఖము గలవాడవు. తేజస్సుచే ప్రపంచమును తపింపచేయుచున్నవాడవు. ఇట్టి నిన్ను నీ అనుగ్రహమున దర్శించుచున్నాను.

దీపికా -: అనాదిమధ్యాంతం = ఉత్పత్తిస్థితినాశరహితం, "నాఽంతం న మధ్య" మిత్యాదికం స్వరూపవిషయం, ఇదం తు విగ్రహవిషయ మిత్యపౌనరుక్త్యం, అనంత వీర్యం యస్య త మనంతవీర్యం, వీర్యగ్రహణం జ్ఞానబలాదే రుపలక్షణార్థః, అనవధికాఽతిశయ జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తితేజోనిధి మిత్యర్థః, అనంతబాహుం - అనంతాః = అసంఖ్యేయాః, బాహవః = బాహూదరవక్త్రనేత్రం, యస్య తం తథోక్తం, పూర్వం బాహూదరాది నానాత్వమాత్ర ముక్తం, అనేకేత్యుక్తేః, ఇహ త్వనంతేత్యుక్తే ర్బాహ్వాదీనాం సంఖ్యానివృత్తి రితి న పునరుక్తిః, శశిసూర్యనేత్రం- శశివత్సూర్యవచ్చ ప్రసాదప్రతాపయుక్తాని నేత్రాణి యస్య తం, "రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః" ఇతి వక్ష్యమాణరీత్యా నమస్కారాదిప్రవణేషు దేవాదిషు ప్రసాదః, తద్విపరీతేష్వ సురరాక్షసాదిషు చ ప్రతాప ఇతి విభాగః, దీప్తహుతాశవక్త్రం = జ్వలిత కాలానలవత్సంహారోన్ముఖాని వక్త్రాణి యస్య తం తథోక్తం, స్వతేజసా స్వస్య పరాఽభిభవనసామర్థ్యేన, ఇదం విశ్వం = జగత్, తపంతం = అభిభవంతం, త్వా = త్వాం, పశ్యామి, యథోపదేశం సాక్షాత్కరోమీత్యర్థః, శాఖామూలబహుత్వేపి కాండైక్యాత్ వృక్షవద్బాహూదరాది భేదేఽపి భేదోక్తిరహిత కటిప్రదేశైక్యాదిహ రూపైక్యమితి మంతవ్యం ॥19॥

శ్లో॥ ద్యావాపృథివ్యో రిద మన్తరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ 20

టీ -: ద్యావాపృథివ్యోః = ఆకాశముయొక్క భూమియొక్కయు; ఇదం + అంతరం = ఈ మధ్యభాగము; ఏకేన త్వయా = నీ ఒక్కనిచేత; వ్యాప్తం హి = వ్యాపింపబడియున్నదిగదా; సర్వాః = సమస్తములైన; దిశః + చ = దిక్కులున్ను (నీచే వ్యాపింపబడియున్నవి.) మహాత్మన్ = ఓ మహాత్మా; ఉగ్రం = భయంకరమైనది; అద్భుతం = ఆశ్చర్యకరమైనదియు నగు; తవ = నీయొక్క; ఇదం రూపం = ఈ రూపమును; దృష్ట్వా = చూచి; లోకత్రయం = అనుకూలురు ప్రతికూలురు మధ్యస్థులు అని మువ్విధములనున్న జనము; ప్రవ్యథితం = మిక్కిలి భయపడియున్నది.

తా -: మహాత్మా; ఊర్ధ్వాధోలోకములను అన్నింటిని వ్యాపించియున్న నీ రూపమును జూచి అనుకూలురు ప్రతికూలురు మధ్యస్థులు అను భేదము లేక అందరు భయభ్రాంతులై ఉన్నారు. నీ ఈ రూపము అత్యాశ్చర్యకరము అతిభయంకరము నైయున్నది (భగవంతుడు అర్జునునకువలె దేవతాదులకును విశ్వరూపసందర్శనయోగ్యమగు దివ్యచక్షువును అనుగ్రహించినందున వారును దర్శింపగల్గినారని భావము).

దీపికా -: ఏవంభూతం త్వాం దృష్ట్వా దేవాదయోఽహంచాఽత్యంతభీతాః భవామ ఇత్యాహ —

ద్యావాపృథివ్యో రిత్యత్ర ద్యుశబ్దేనోపరితనలోకా లక్ష్యంతే, పృథివీశబ్దేనాఽధస్తన లోకా లక్ష్యంతే, తథా చ - ద్యావాపృథివ్యోః - చతుర్దశానామపి లోకానాం, ఇదం, అంతరం = అవకాశః, ఏకేన త్వయా - అతి మహావిగ్రహేణ భవతా, వ్యాప్తం = ఆక్రాంతం, సర్వాః దిశశ్చ వ్యాప్తాః,

హే మహాత్మన్ - అపరిచ్ఛేద్యమనోవృతే, ఉగ్రత్వాదివ దయమప్యేకో భయహేతు రిత్యాశయః, ఇదం=అనంతాయామవిస్తారం, అద్భుతం= అత్యాశ్చర్యం, ఉగ్రం=అతికరాళం, తవ, రూపం=విగ్రహం దృష్ట్వా, లోకత్రయం - లోకానాం - లోకవర్తినాం యుద్ధదిదృక్షయాఽఽగతానాం దేవాఽసురయక్షరాక్షసాదీనాం, త్రయం అనుకూల ప్రతికూల మధ్యస్థ రూపం త్రితయం, ప్రవ్యథితం=అత్యంతభీతం, అహం చ ప్రవ్యథితః, "దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహ" మితి వక్ష్యమాణాఽనుసారాత్; హి శబ్దః పూర్వాఽరస్యోత్తరార్థం ప్రతి హేతుత్వం ద్యోతయతి, యుద్ధ దిదృక్షయాఽఽగతానాం దేవాసురాణా మప్యర్జునస్యేవ భగవతా దివ్య చక్షుఃప్రదానా త్సమస్త జగదాశ్రయ భగవద్రూపసాక్షాత్కార ఉప పద్యతే, దేవాదీనామపి దివ్యచక్షుఃప్రదానం తు, తేషామపి భగవద్రూప దిదృక్షాసంభవా త్సర్వేషామపి యుగపదేవ భగవద్దివ్యరూపదర్శనప్రాపక ప్రాగ్భవీయసుకృతవిశేషపరిపాక సన్నిపాతా దర్జునాయ సర్వవంద్యత్వ సర్వభూతభయాపహత్వాది స్వకీయ నిరకుశైశ్వర్యప్రకాశరూప ప్రకృ తోపయోగాచ్చేతి మంతవ్యం ॥ 20 ॥

శ్లో॥ అమీ హి త్వా సురసఙ్ఘా విశన్తి
కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి।
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసఙ్ఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥ 21

టీ -: అమీ సురసంఘాః=ఈ దేవతాసముదాయములు; త్వా= నిన్ను; విశన్తి=సమీపించుచున్నవి; కేచిత్=కొందరు, భీతాః = భయ పడినవారై; ప్రాంజలయః=సమస్కరించుచు; గృణన్తి = స్తుతించు చున్నారు; మహర్షిసిద్ధసంఘాః=మహర్షులయొక్క సిద్ధులయొక్కయు సంఘములు;స్వస్తి + ఇతి=స్వస్తి అని;ఉక్త్వా=పలికి; పుష్కలాభిః= సమగ్రములైన; స్తుతిభిః=స్తోత్రములచేత; త్వాం=నిన్ను; స్తువన్తి= కీర్తించుచున్నారు.

తా -: నిన్ను చూడవచ్చిన దేవతలు నిన్ను సమీపించుచున్నారు. వారిలో కొందరు భయముతో నీకు అంజలి ఘటించుచున్నారు. మహర్షులు సిద్ధులు నీకు మంగళములను ఆశాసించుచున్నారు.

దీపికా -: అమీ సురసంఘాః = దేవసమూహాః, త్వా = త్వాం, విశంతి = ప్రవిశంతి, అత్రేదం భగవత్ప్రవేశనం "యత్ప్రయంత్యభిసంవిశంతి" త్యాదావివ న ప్రళయార్థం; స్తుత్యాదిసమభివ్యాహారాత్, ధార్తరాష్ట్రాణామివాఽఽసన్నోపసంహారాఽభావాచ్చ, అపితు సమీపాగమనరూప సేవామాత్రం, సురశబ్దశ్చాత్ర న దేవమాత్రవాచీ, కేచిద్భీతా ఇతి ధార్ష్ట్యరహితానాం పృథగభిధానాత్, యే త్వద్భుతభగవద్రూపదర్శనేప్యక్షోభ్యహృదయా హర్షవంత ఉత్కృష్టా బ్రహ్మాదయః, త ఇహ సురశబ్దేనోచ్యంతే, తథా చ, అమీ బ్రహ్మాద్యుత్కృష్ట దేవసమూహాస్సమస్తజగదాశ్రయ త్వదవలోకనహృష్టమనస స్త్వత్సమీప మాగచ్ఛంతీత్యర్థః, 'హి' శబ్దోఽవధారణార్థః, త్వామేవేత్యర్థః, కేచిత్ బ్రహ్మాదివద్ధార్ష్ట్యరహితా దేవాః, భీతాః = అత్యద్భుతోగ్రభవదాకార విలోకనజనితభీతయః, ప్రగతాః అంజలయః యేషాం తే ప్రాంజలయః = బద్ధాంజలయశ్చ సంతః, గృణంతి = స్వజ్ఞానాఽనుగుణం స్తుతిరూపాణి వాక్యాన్యక్రమ ముచ్చారయంతీత్యర్థః, కేచిదిత్యస్య సామాన్యవిషయస్యాపి సురసంఘాఽవిషయేష్వన్యతమవిషయత్వం, కేచిదితి పృథక్కరణస్య సముదాయవిశేష వ్యపేక్షాయాం జాత్యంతరాఽనుపాదానా త్సురసంఘానాం ప్రస్తుతత్వా త్సురవ్యతిరిక్తానాం భీత్యా పలాయనస్య వక్ష్యమాణత్వేన భీతాః ప్రాంజలయో గృణంతీత్యస్యాఽన్యథాఽనుపపత్త్యా చ, మహర్షిసిద్ధసంఘాః మహర్షిసంఘాః - భృగ్వాదిగణాః, సిద్ధసంఘాః = సనకసనందనాదయః, స్వస్తీత్యుక్త్వా = మంగళాశాసనం కృత్వా పుష్కలాభిః = సమగ్రాభిః, త్వదనురూపాభి రిత్యర్థః, స్తుతిభిః = గుణప్రకర్షవ్యాజంకోక్తిభిః త్వాం స్తువంతి ॥ 21 ॥

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।
గన్ధర్వ యక్షాఽసుర సిద్ధ సఙ్ఘాః
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ 22

టీ -: రుద్ర + ఆదిత్యాః = రుద్రులు ఆదిత్యులు; వసవః = వసువులు; యే సాధ్యాః చ = సాధ్యులు అనబడువారును; విశ్వే = విశ్వేదేవతలు; అశ్వినౌ = అశ్వినీదేవతలు; మరుతః + చ = మరుద్దేవతలు; ఊష్మపాః + చ = పితృదేవతలు, గంధర్వయక్ష + అసురసిద్ధసంఘాః = గంధర్వులు యక్షులు అసురులు సిద్ధులు అను వీరిసముదాయములు; సర్వే చ ఏవ = వీరందరును; విస్మితాః = ఆశ్చర్యము నందినవారై; త్వాం = నిన్ను; వీక్షన్తే = దర్శించుచున్నారు.

తా -: రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినులు, మరుత్తులు పితృగణములు, గంధర్వయక్షరాక్షససిద్ధ సమూహములు నిన్ను ఆశ్చర్యముతో చూచుచున్నారు.

దీపికా -: రుద్రాదిత్యాః = ఏకాదశరుద్రాః ద్వాదశాదిత్యాః, వసవః = అష్టవసవః, సాధ్యా నామకేచేన దేవయోనయః. విశ్వే = విశ్వదేవాః, అశ్వినౌ ద్వౌ, మరుతః = ఏకోనపంచాశద్వాయవః, ఊష్మపాః = పితరః, ఊష్మభాగా హి పితర ఇతి శ్రుతేః, గంధర్వయక్షాఽసురసిద్ధ సంఘాశ్చ యే సంతి తే సర్వే చ విస్మితాః = ఆశ్చర్యావిష్టాస్సంతః, త్వామేవ వీక్షంతే ॥ 22 ॥

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్ ।
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాః స్తథాఽహమ్ ॥ 23

టీ -: మహాబాహో = మహాబాహూ; బహువక్త్రనేత్రం = అనేక ముఖములు నేత్రములు గలది; బహుబాహు + ఊరుపాదం = అనేక భుజములు తొడలు పాదములుగలది; బహు + ఉదరం = అనేకము లైన ఉదరములు గలది; బహుదంష్ట్రాకరాళం = అనేకములైన కోరలచే భయంకరమైనదియును అగు; తే = నీయొక్క; మహత్ + రూపం = గొప్పరూపమును; దృష్ట్వా = చూచి; లోకాః = ప్రజలెల్లరు; ప్రవ్యథితాః = అత్యంతము భయమును చెందుచున్నారు; అహం = నేనుకూడ; తథా = అట్లే (భయపడుచున్నాను).

తా -: అనేకములైన ముఖములు నేత్రములు బాహువులు ఊరువులు పాదములు ఉదరములు కలిగి అనేకములైన కోరలచే భయంకరమైన నీ ఈ రూపమును ప్రజలు చూచి ఓ మహాబాహూ భయముతో వణకుచున్నారు. నేనును భయపడుచున్నాడను.

దీపికా -: హే మహాబాహో, బహువక్త్రనేత్రం = బహుముఖనయనం, బహుబాహూరుపాదం - బహవః బాహవః - భుజాః, ఊరవః, పాదాశ్చ యస్య తం తథోక్తం, బహూదరం - బహూన్యుదరాణి యస్య తం, బహుదంష్ట్రాకరాళం - బహ్వీభిః దంష్ట్రాభిః కరాళం = అతి భీషణాకారం, మహత్ = అపరిచ్ఛేద్యం, తే = తవ, రూపం దృష్ట్వా, లోకాః - పూర్వోక్తాః ప్రతికూలాఽనుకూలమధ్యస్థభేదేన వివిధా యుద్ధ దిదృక్షయాఽఽగతా జనాః, ప్రవ్యథితాః = అత్యంతభీతాః, తథా, అహం చ = యేనైతద్రూపదర్శనం ప్రార్థితం, యదర్థమిదం రూపం భగవతాఽ దర్శి, తాదృశోఽహం చ ప్రవ్యథితః ॥ 23 ॥

శ్లో॥ *నభస్స్పృశం దీప్త మనేకవర్ణం*
*వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రం,*
*దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాఽన్తరాత్మా*
*ధృతిం న విన్దామి శమం చ విష్ణో॥* 24

టీ -: విష్ణో = ఓ సర్వవ్యాపీ; నభః + స్పృశం = పరమాకాశము నంటియున్నవాడవు; దీప్తం = ప్రకాశించువాడవు; అనేకవర్ణం = వివిధములైన వర్ణములు (రంగులు) గలవాడవు; వ్యాత్త + ఆననం = తెఱవబడిన నోళ్ళు గలవాడవు; దీప్తవిశాలనేత్రం = ప్రకాశించు విశాలనేత్రములు గలవాడవు అయిన; త్వాం = నిన్ను; దృష్ట్వా = చూచి; ప్రవ్యథిత + అంతరాత్మా = మిక్కిలి భీతిజెందిన మనస్సు గలవాడనై; ధృతిం = శరీరధారణమును; శమం చ = శాంతిని; న విందామి = పొందలేకున్నాను.

తా -: ఓ మహావిష్ణూ; ప్రకృతిమండలాऽతీతమైన పరమాకాశము వరకు వ్యాపించి నలుదెసల కాంతిని వెదజల్లుచు అనేకవర్ణములను గలిగి తెఱవబడియున్న నోళ్ళతోను సంతోషమును భయమును కలిగించు నేత్రములతోను ఒప్పుచున్న నిన్ను చూచి చెదరిన మనస్సుకలవాడనై శరీరమును ధరింపలేకున్నాను, శాంతిని పొందలేకున్నాను.

దీపికా -: హే విష్ణో = సర్వవ్యాపిన్, నభస్స్పృశం నభః స్పృశతీతి నభస్స్పృక్, తం తథా, అత్ర నభశ్శబ్దేన 'తదక్షరే పరమే వ్యోమన్ని' త్యాదిశ్రుతిసిద్ధస్త్రిగుణప్రకృత్యతీత శ్శుద్ధసత్త్వమయః పరమాకాశ ఉచ్యతే, నతు ప్రాకృతాకాశః, తత్స్పర్శస్య "ద్యావాపృథివ్యోరిద మంతరం హి వ్యాప్త" మితి పూర్వముక్తత్వేన పునరుక్తిప్రసంగాత్, దీప్తం = తేజోరాశితయా సర్వదేశవ్యాపిప్రభాయోగినం, అనేకవర్ణం - అనేకే, వర్ణాః = సితరక్తపీతాదయః యస్య తం తథోక్తం, వ్యాత్తాననం - వ్యాత్తాని = వివృతాని, జగద్గ్రసనోన్ముఖతయాऽవస్థితాని, ఆననాని = ముఖాని యస్య తం, దీప్తవిశాలనేత్రం - దీప్తాని = ఆశ్రితాऽనాశ్రిత రూప విషయభేదేన సౌమ్యాऽసౌమ్యదీప్తిమంతి, విశాలాని = విపులాని, నేత్రాణి యస్య తం, త్వాం దృష్ట్వా, ప్రవ్యథితః = అత్యంతభీతః, అంతరాత్మా = మనః, యస్య సః ప్రవ్యథితాంతరాత్మా సన్, ధృతిం = శరీరధారణం,, న విందామి = న లభే, ప్రశిథిలసర్వాऽవయవో భవామీత్యర్థః, శమం = మనస ఇంద్రియాణాం శాంతిం చ, న విందామి, వ్యాకు

లీభవామీత్యర్థః, అత్రాత్మశబ్దనిర్దిష్టస్య మనసోఽన్తరత్వం "తస్మాద్వా ఏతస్మాత్ప్రాణమయాత్, అన్యోఽంతర ఆత్మా మనోమయ" ఇతి శ్రుత్యుక్త రీత్యాఽన్నమయప్రాణమయాఽపేక్షయా ద్రష్టవ్యం, అచేతనేఽపి మనసి చేతనధర్మ భీవ్యపదేశశ్చేతనత్వారోపేణ భీత్యతిశయద్యోతనార్థః ॥24॥

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలాఽనలసన్నిభాని,
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ! జగన్నివాస॥ 25

టీ -: దేవ + ఈశ = ఓ బ్రహ్మాదిదేవాఽధిపతీ: జగత్ + నివాస = ఓ జగదాధార; దంష్ట్రాకరాళాని = కోఱలచే భయంకరములు; కాల + అనలసన్నిభాని = ప్రళయకాలాఽగ్నిసమానములు అయిన; తే = నీ యొక్క; ముఖాని = ముఖములను; దృష్ట్వా + ఏవ = చూచినంతనే; దిశః = దిక్కులను; న జానే = ఎఱుగలేకున్నాను; శర్మ చ = సుఖమును; న లభే = పొందలేకున్నాను; ప్రసీద = అనుగ్రహింపుము.

తా -: బ్రహ్మదులకును అధిపతివై జగత్తులకు ఆధారభూతుడవైన ఓ ప్రభూ; కోరలచే బయంకరములై ప్రళయ కాలాగ్నులవలె ప్రజ్వరిల్లుచున్న నీ ముఖములను చూచి దిగ్భ్రాంతుడ నగుచున్నాను (రక్షణ పొందుటకు గత్యంతరమును కానలేకున్నాను) సుఖము కలుగుట లేదు. నన్ను కరుణింపుము.

దీపికా -: అవయవాఽంతరేభ్యో ముఖానా మతిభయంకరత్వం వ్యంజయన్నాహ —

దంష్ట్రాకరాళాని - దంష్ట్రాభిః, కరాళాని = అతిభీషణాని, కాలానలసన్నిభాని చ = కాలానలస్య - ప్రళయకాలాగ్నేః, సదృశాని చ, తద్వత్సర్వసంహారే ప్రవృత్తానీత్యర్థః, తే = తవ, ముఖాని దృష్ట్వైవ, నతు త్వత్తః, కించిదుపమర్దం ప్రాప్యేత్యర్థః, దిశః, న జానే = న వేద్మి,

యాసు దిక్షు స్థిత్వా త్వద్దర్శనేన స్వస్థో భవేయమిత్యర్థః, యద్వా 'దిక్' శబ్దో గత్యంతరపరః, దిశః - త్వదన్యాం గతిర్న జాన ఇత్యర్థః, శమం చ=సుఖం చ, న లభే=న ప్రాప్నోమి, ఏవం స్వాఽవస్థాం నివేద్య యథోపదేశం సాక్షాత్కృత భగవదాకారాఽనువాదపూర్వక మాత్మన స్స్వస్థతాం ప్రార్థయతే 'ప్రసీదే'తి, హే జగన్నివాస=జగతాం-సర్వేషాం, స్వవిగ్రహైకదేశేన నివాసభూత, దేవేశ=దేవానాం బ్రహ్మాదీనామపి మహేశ్వర, ప్రసీద=యథాఽహం స్వస్థో భవేయం తథామయి ప్రసాదం కురు ॥ 25 ॥

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః ।
భీష్మోద్రోణస్సూతపుత్రస్తథాఽసౌ
సహాఽస్మదీయైరపి యోధముఖ్యైః ॥ 26

టీ -: అమీ సర్వే=ఈ సమస్తమైన; ధృతరాష్ట్రస్య పుత్రాః= ధృతరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదులు; భీష్మః=భీష్మాచార్యులు; ద్రోణః=ద్రోణాచార్యులు; అసౌ సూతపుత్రః=ఈ కర్ణుడును; సర్వైః= సమస్తములైన; అవనిపాలసంఘైః+సహ+ఏవ = రాజసముదాయ ములతో కూడను; తథా=అట్లే; అస్మదీయైః+యోధముఖ్యైః+ సహ= మనవారైన ముఖ్యయోధులతోకూడను; (త్వా హి విశన్తి = నిన్నే ప్రవే శించుచున్నారు.)

తా -: ఈ దుర్యోధనాదులు భీష్మద్రోణులు కౌరవపక్షముననున్న తక్కిన రాజులు మన పక్షమున గల వీరయోధులును నీలో ప్రవేశించు చున్నారు.

దీపికా -: ఏవం సర్వస్య జగతస్సృష్టిస్థితిప్రవృత్తితాం దర్శ యతా భగవతా పార్థసారథినా రాజవేషకంచుకితానాం ధార్తరాష్ట్రాణాం పాండవేష్వనుప్రవిష్టానాం చాఽసురాఽంశానాం సంహారేణ భూభారాఽవ

తరణే స్వమనీషితే స్వేనైవ కరిష్యమాణే పార్థాయ దర్శితే; స చ పార్థో భగవతస్సర్వం స్రష్టృత్వాదిక మైశ్వర్యం చ సాక్షాత్కృత్యాఽస్మిన్నేవ సర్వాత్మని భగవతి ధార్తరాష్ట్రాదీనా ముపసంహార మనాగతమపి తత్ప్రసాదలబ్ధేన దివ్యేన చక్షుషా సాక్షాత్కుర్వన్నిదం ధార్తరాష్ట్రవిషయం వచన మాహ —

అమీ సర్వే ధృతరాష్ట్రస్య పుత్రాః = దుర్యోధనాదయః, భీష్మః, ద్రోణః, తథా, అసౌ, సూతపుత్రః = కర్ణశ్చ, అవనిపాలసంఘైస్సహైవ-దుర్యోధనాదిపక్షీయైః రాజసమూహైస్సర్వైస్సహైవ, అస్మదీయైః = అస్మత్పక్షీయైః, కైశ్చిత్, యోధముఖ్యైరపి సహ, త్వా హి = త్వామేవ, విశంతీత్యుత్తరశ్లోకా దనుషంజనీయం, త్వయ్యేవ ప్రలీయంత ఇత్యర్థః, నాఽస్య శ్లోకస్య ఉత్తరశ్లోకేనైకవాక్యతా, అత్ర త్వా ఇతి భగవతః కర్మత్వేన నిర్దేశా దుత్తరశ్లోకే వక్త్రాణాం కర్మత్వేన నిర్దేశాత్ ॥ 26 ॥

శ్లో॥ *వక్త్రాణి తే త్వరమాణా విశన్తి*
*దంష్ట్రాకరాలాని భయానకాని,*
*కేచిద్విలగ్నా దశనాన్తరేషు*
*సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాంగైః* ॥ 27

టీ -: త్వరమాణాః = త్వరపడుచున్న ఈ దుర్యోధనాదులు; దంష్ట్రాకరాళాని = కోరలచే వికృతముగనున్నవి; భయానకాని = భయంకరములైనవి అయిన; తే = నీయొక్క; వక్త్రాణి = ముఖములను, విశన్తి = ప్రవేశించుచున్నారు; కేచిత్ = (వారిలో) కొందఱు; చూర్ణితైః = ముక్కలుగచేయబడిన, ఉత్తమాంగైః = శిరస్సులచేత; దశన + అన్తరేషు = కోరలమధ్యలో విలగ్నాః = తగులుకొన్నవారుగ; సందృశ్యన్తే = చూడబడుచున్నారు.

తా -: ఈ యోధులందరు త్వరత్వరగ నీ ముఖములలో ప్రవేశించుచున్నారు. వీరిలో కొందరు నీకోరలలో చితికిన తలలతో చిక్కియున్నారు.

దీపికా -: తేషాం భగవతి ప్రవేశం వివృణోతి —

అమీ = దుర్యోధనాదయః, త్వరమాణాః = సత్వరాస్సంతః, అనేన విశేషణేన ధార్తరాష్ట్రాణా మపరాధక్రౌర్యాతిశయమూలకం భగవతా శీఘ్రసంహరణం వ్యజ్యతే, దంష్ట్రాకరాళాని = దంష్ట్రాభిః కరాళాని = వికృతాని, భయానకాని = భయంకరాణి, తే = తవ, వక్త్రాణి = ఆస్యాని, విశంతి, నాశాయ వక్త్రేష్వంతః పతంతీత్యర్థః, కేచిత్ = తేష్వన్యతరే రాజానః, చూర్ణితైః = భగవద్దంతఘాతేన చూర్ణీకృతైః, ఉత్తమాంగైః = శిరోభిః, ఉపలక్షితాః, దశనాఽంతరేషు = త్వదీయదంతాఽవకాశేషు, విలగ్నాః = సక్తాస్సంతః సందృశ్యంతే, అత్ర పూర్వశ్లోకే "అమీ సర్వే ధృతరాష్ట్రస్య పుత్రాస్సర్వైస్సహైవాఽవనిపాలసంఘై" రితి పాఠేతు శ్లోకద్వయమేక వాక్యమేవ, అయమేవ పాఠో యుక్తః శబ్దానామాకర్షోత్కర్షాదిక్లేశాభావాదితి స ఏవాదృతశ్శ్రీభాష్యకారైః, పాఠాంతరమపి దృశ్యతే; వ్యాఖ్యాతం చ కైశ్చిదితి తదపి వ్యాఖ్యాతమ్ ॥ 27 ॥

శ్లో॥ యథా నదీనాం బహవోఽమ్బువేగా
స్సముద్ర మేవాఽభిముఖా ద్రవన్తి।
తథా తవాఽమీ నరలోకవీరాః
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥ 28

టీ -: నదీనాం = నదులయొక్క; బహవః = అనేకములైన; అంబువేగాః = జలప్రవాహములు; యథా = ఏ విధముగ; సముద్రం + ఏవ = సముద్రమునుగూర్చియే; అభిముఖాః = అభిముఖములై; ద్రవన్తి = ప్రవహించుచున్నవో; తథా = అట్లే; అమీ = ఈ; నరలోకవీరాః = మనుష్యలోకమునందలి వీరులు; తవ = నీయొక్క; అభివిజ్వలన్తి = అంతట జ్వలించుచున్న; వక్త్రాణి = ముఖములను; విశన్తి = ప్రవేశించుచున్నారు.

తా -: సముద్రమువైపునకు మహానదులు ప్రవహించురీతిని ఈ భూలోకవీరులు ప్రజ్వరిల్లుచున్న నీ ముఖములవైపుగ పరగెత్తి ప్రవే

శించుచున్నారు. (నదులు సముద్రమునందు లయమును పొందునట్లు వీరును నీయందు లయమును పొందుచున్నారు.)

దీపికా -: ధార్తరాష్ట్రాదీనాం సత్వరం భగవద్వక్త్రప్రవేశే దృష్టాంత ద్వయ మాహ యథేత్యాదిశ్లోకద్వయేన —

యథా, బహవః = భూయాంసః, నదీనాం అంబువేగాః, వేగ శబ్దోఽత్ర వేగవత్ప్రవాహపరః, జలప్రవాహ ఇత్యర్థః, సముద్రం ప్రత్యేవ అభిముఖాస్సంతః నాశాయ, ప్రవహంతి = గచ్ఛంతి, నదీనాం నాశోనామ పృథగ్భూత ప్రవాహాకారత్యాగః, తథా అమీ నరలోక వీరాః - నరలోకే = మనుష్యలోకే, వీరాః = యోధాః, రాజాన ఇత్యర్థః, స్వయమేవ త్వరమాణాః, అభివిజ్వలంతి = అభితో దీప్యమానాని, తవ వక్త్రాణి, నాశాయ విశంతి ॥ 28 ॥

శ్లో॥ *యథా ప్రదీప్తం జ్వలనం పతంగాః*
*విశన్తి నాశాయ సమృద్ధవేగాః ।*
*తథైవ నాశాయ విశన్తి లోకా*
*స్తవాఽపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥* 29

టీ -: పతంగాః = మిడుతలు; సమృద్ధవేగాః = మిక్కిలివేగము గలవై; నాశాయ = (తమ) వినాశముకొరకు; ప్రదీప్తం = మండుచున్న; జ్వలనం = అగ్నిని; యథా = ఎట్లు; ప్రవిశన్తి = ప్రవేశించునో; తథైవ = అట్లే; నాశాయ = ఆత్మనాశముకొఱకు; లోకాః = ఈ మనుష్యులు; సమృద్ధ వేగాః = అధిక వేగము గలవారై; తవ = నీయొక్క; వక్త్రాణి = ముఖము లను; విశన్తి = ప్రవేశించుచున్నారు.

తా -: మిడుతలు వేగముగ మంటలలో బడి నశించురీతిని; ఈ వీరులును మండుచున్న నీ ముఖములయందు నాశమునకై ప్రవేశించు చున్నారు.

దీపికా -: యథా, పతంగాః = శలభాః, నాశాయ = భస్మీభావాయ, సమృద్ధవేగాః = సంపూర్ణవేగాః స్వయమేవ త్వరమాణాస్సంత ఇత్యర్థః, ప్రదీప్తజ్వలనం - ప్రదీప్తం = ప్రకర్షేణ దీప్యమానం, జ్వలనం = పావకం విశంతి, పతంగాదీనాం ప్రదీపాదిషు పక్షవేగాదభి ర్నాశకత్వ స్యాఽపి కదాచిత్సంభవా త్తద్వ్యవచ్ఛేదాయ ప్రదీప్తవిశేషణం, తథైవ, లోకాః = రాజలోకా అపి సమృద్ధవేగాస్సంతః, నాశాయ = నాశం ప్రాప్తుం, తవ వక్త్రాణి విశంతి, అత్ర స్వేచ్ఛయా పునర్నివర్తితు మశక్తత్వేన నదీప్రవాహదృష్టాంతః, నాశస్య స్వేచ్ఛానుకూలవ్యాపార హేతుకత్వవ్యంజనాయ పతంగదృష్టాంతః, అపి చ సర్వప్రవేశేఽప్య పూర్వత్వవివక్షయా సముద్రనిదర్శనం, సహసా విధ్వంసనాయ జ్వలనోదాహరణం ॥ 20 ॥

శ్లో॥ *లేలిహ్యసే గ్రసమానస్సమన్తా*
*ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః।*
*తేజోభి రాపూర్య జగత్సమగ్రం*
*భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో! ॥* 30

టీ -: హే విష్ణో = ఓ విష్ణూ; జ్వలద్భిః = ప్రజ్వరిల్లుచున్న; వదనైః = ముఖములచేత, సమగ్రాన్ = సమస్తములైన; లోకాన్ = రాజులను; గ్రసమానః = మింగుచున్నవాడవై; లేలిహ్యసే = ఆస్వాదించుచున్నావు; తవ = నీయొక్క; ఉగ్రాః = భయంకరములైన; భాసః = కిరణములు; తేజోభిః = తమకాంతులచే; సగ్రం = సమగ్రమైన; జగత్ = జగత్తును; అపూర్య = నింపి; ప్రతపన్తి = తపింపచేయుచున్నవి.

తా -: సర్వవ్యాపివైన ప్రభూ; ఈ రాజులనందరిని ప్రజ్వరిల్లుచున్న నీ ముఖములచే మింగి ఆ రక్తసిక్తములైన పెదవులను కోపముతో మాటిమాటికి నాకికొనుచున్నావు. ఇట్టి నీ తేజస్సు ప్రపంచమునంతట వ్యాపించి తపింపచేయుచున్నది.

దీపికా -: స్వయమేవ త్వరమాణా ఇత్యనేన తత్సంహరణే భగవతోఽత్యంత నిర్వ్యాపారత్వశంకాం నిరాకరోతి —

సమగ్రాన్ = యుద్ధాయ సమవేతాన్, లోకాన్ = రాజజనాన్, జ్వలద్భిః = దీప్యమానైః, వదనైః, గ్రసమానః = భక్షయన్, సమంతాత్ = సర్వతః, తద్రుధిరాఽవసిక్తం సర్వ మోష్ఠపుటాదిప్రదేశమిత్యర్థః, లేలిహ్యసే = కోపవేగేన జిహ్వయా పునఃపునర్లేహనం కరోషి. హే విష్ణో, ఉగ్రాః = అతిఘోరాః, తవ భాసః = రశ్మయః, తేజోభిః = స్వకీయప్రకాశైః, సమగ్రం = సర్వం జగత్, ఆపూర్య = ఆవృత్య, ప్రతపంతి = సంతాపయంతి, గ్రసనార్థం పచంతీత్యర్థః, సంహరణే తత్తచ్చేతనానాం యుద్ధాదివ్యాపారవిశేషో నిదానం, తద్ధేతుకకోపాదివిశిష్టస్తు భగవాన్ సంహరతీతి భావః ॥ 30 ॥

*శ్లో॥ ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో*
*నమోఽస్తు తే దేవవర! ప్రసీద,*
*విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం*
*నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥* 31

టీ -: హే దేవవర = ఓ దేవోత్తమా; ఉగ్రరూపః = భయంకరమైన రూపముగల; భవాన్ = నీవు, కః = ఎవడవు; తే = నీకు; నమః అస్తు = నమస్కార మగుగాక; ఆద్యం = సృష్ట్యాదియందున్న; భవన్తం = నిన్ను విజ్ఞాతుం = తెలిసికొనుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను; తవ = నీయొక్క; ప్రవృత్తిం = ఈ ప్రవర్తనను; న ప్రజానామి హి = ఎరుగలేకున్నానుగదా; మే = నాకు; ఆఖ్యాహి = చెప్పుము; ప్రసీద = అనుగ్రహింపుము.

తా -: దేవదేవోత్తమా, ఈ భయంకరరూపముతో నున్న నీ వెవ్వడవు?. నీవు ఈ ప్రపంచమునకు మూలపురుషుడవు. నీ ఈ ప్రవర్తనకు కారణ మేమిటో తెలుపుము. నీకు నమస్కరించుచున్నాను. అనుగ్రహింపుము. ("ఈ ఘోరరూపమును ప్రదర్శించుటకు కారణమేమి? తెలుపుము. నీ ప్రసన్నమైన రూపమును దర్శింపజేయుము" అని భావము.)

దీపికా -: ఏవ మత్యంతఘోరాకారదర్శనం సోఢు మశక్నువన్నర్జున స్సైన్వైశ్వర్యప్రకాశన ప్రవృత్తస్య భగవత ఏతాదృశఘోరరూపావిష్కారె తాత్పర్యకథనం పునః ప్రసన్నరూపపరిగ్రహార్థం ప్రసాదం చ ప్రార్థయతే —

హే దేవవర = బ్రహ్మరుద్రాదిసమస్తదేవతాసార్వభౌమ, ఏతేన నమస్కారశేషిత్వం వ్యంజితం, తే=తుభ్యం, నమః, అస్తు, ఉగ్ర రూపః = అతిభయంకరవిగ్రహః భవాన్ కః, తవ నిరకుశైశ్వర్యం సాక్షాత్కర్తు మర్థయమానస్య భక్తస్య మమ ఘోరరూపావిష్కరణే కోవాఽభిప్రాయ ఇతి ప్రశ్నారః, ఉపదేశసాక్షాత్కారాభ్యామేవ స్వరూపేణ భగవతః ప్రతిపన్నత్వాత్, ఆద్యం=ఆదౌ - సృష్టేః పూర్వం విద్యమానం, సష్టారమిత్యర్థః, అనేన స్వప్రార్థిత భగవత్ప్రదర్శిత స్వసాక్షత్కృత ప్రష్టృత్వాదినిరంకుశైశ్వర్యాణా మంశ ఉక్తః, ఏవంవిధం, భవంతం=త్వాం, విజ్ఞాతుం = కింకర్తుం ప్రవృత్త ఇతి విశిష్య జ్ఞాతుం, ఇచ్ఛామి=అభిలషామి, హి = యస్మాత్కారణాత్, తవ, ప్రవృత్తిం= అభిప్రాయవిషయభూతం ప్రయత్నం న ప్రజానామి, ఆఖ్యాహి=అనేనాఽభిప్రాయేణేదం సంహర్తృరూప మావిష్కృత మిత్యుత్తరం బ్రూహి, ప్రసీద=ప్రసన్నరూపశ్చ భవ ॥ 31 ॥

శ్రీభగవానువాచ -:

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ 32

టీ-: కాలః + అస్మి=ప్రాణుల ఆయుస్సును లెక్కించు మృత్యువునై యున్నాను; లోకక్షయకృత్ = రాజలోకమును నశింపజేయనున్నవాడనై; ప్రవృద్ధః=విజృంభించితిని; లోకాన్=రాజలోకములను; సమా

హర్తుం = సంహరించుటకు; ఇహ = ఇచట; ప్రవృత్తః = వచ్చినవాడనై; అస్మి = ఉన్నాను; ప్రత్యనీకేషు = శత్రుపక్షములయందు; యే యోధాః = ఏ వీరులు; అవస్థితాః = ఉన్నారో; తే సర్వే = వారందరు, త్వా + ఋతే + అపి = నీవులేకున్నను; న భవిష్యన్తి = ఉండరు.

తా -: నేను ప్రాణుల ఆయుర్దాయమును లెక్కించు యముడను. ఈ క్షత్రియవీరులను సంహరింపవచ్చి విజృంభించుచున్నాను. నీవు లేకున్నను వీరి సంహారము తప్పదు.

దీపికా -: ఏవం పార్థేన పృష్టో భగవాన్ పార్థసారథిః - త్వదుద్యోగేన వినాఽపి ధార్తరాష్ట్రప్రముఖాఽశేష రాజలోకం సంహర్తు మహమేవ ప్రవృత్త ఇతి తవ జ్ఞాపయితుం మమ ఘోరరూపావిష్కరణం, తత్జ్ఞాపనం చ త్వా ముద్యోజయితు మితి స్వాఽభిప్రాయమాహ "కాలోస్మి" త్యాదినా శ్లోకత్రయేణ ॥

లోకక్షయకృత్ = లోకసంహర్తా, కలయతి = గణయతి, ప్రాణినా మాయురవసాన మితి కాలః = మృత్యుః; తచ్ఛరీరకః అస్మి, అహం, లోకాన్ = నృపజనాన్, సమాహర్తుం = ఆభిముఖ్యేన సంహర్తుం, అపరోక్షేణ సంహర్తుమిత్యర్థః, అనేన భృత్యద్వారా శత్రునిరసనవ త్పరోక్ష సంహారో వ్యుదస్యతే, ప్రవృత్తస్సన్, ఇహ కురుక్షేత్రే, ప్రవృద్ధః = మహతా ఘోరేణ రూపేణ విజృంభితః అస్మి, అతః ప్రత్యనీకేషు శత్రు సేనాసు, యే, యోధాః = భీష్మద్రోణాదియోద్ధారః అవస్థితాః, తే. సర్వే, త్వా = త్వాం; త్వదుద్యోగం ఋతే = వినాఽపి, న భవిష్యంతి - మత్సంకల్పాదేవ నష్టా భవిష్యన్తి ॥ 32 ॥

శ్లో॥ *తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ*
*జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।*
*మయైవైతే నిహతాః పూర్వమేవ*
*నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥* 33

టీ -: తస్మాత్ = అందువలన; త్వం = నీవు; ఉత్తిష్ఠ = లెమ్ము; శత్రూన్ = శత్రువులను; జిత్వా = జయించి; యశః = కీర్తిని; లభస్వ = పొందుము; సమృద్ధం = సంపూర్ణమైన; రాజ్యం = రాజ్యమును; భుంక్ష్వ = అనుభవింపుము; ఏతే = ఈ దుర్యోధనాదులు; మయా + ఏవ = నాచేతనే; పూర్వం + ఏవ = ముందే; నిహతాః = చంపబడిరి; సవ్యసాచిన్ = ఎడమ చేతితోను శరమును సంధింపగల అర్జునా; త్వం = నీవు; నిమిత్త మాత్రం = నిమిత్తమాత్రుడవు; భవ = అగుము.

తా -: కావున యుద్ధసమర్థుడవైన అర్జునా, లెమ్ము. యుద్ధ మొనర్చి కీర్తిని ఆర్జింపుము. శత్రువులను సంహరించి సంపూర్ణ రాజ్య భోగములను అనుభవింపుము. ముందే ఈ వీరు లందరు నాచేత సంహ రింపబడిరి. ఈ కార్యమునందు నీవు కేవలము నిమిత్తమాత్రు డవు కమ్ము.

దీపికా -: యది మదుద్యోగం వినాఽపి ధార్తరాష్ట్రాదయో నం క్ష్యన్తి - తర్హి కిమర్థం మా ముద్యోజయసీత్యత్రాహ —

తస్మాత్ = మత్ప్రవృత్తే రేతదర్థత్వాద్ధేతోః, త్వం ఉత్తిష్ఠ, తై ర్యోద్ధు మితి శేషః, యశః = దేవైరపి దుర్జయా భీష్మాదయోఽర్జునేన నిర్జితా ఇత్యేవం కీర్తిం లభస్వ, శత్రూన్, జిత్వా = అయత్నేన నిర్జిత్య, సమృద్ధం = సర్వభోగ్యాదిసంపన్నం రాజ్యం భుంక్ష్వ, నన్వేవమ్మమా నృశంస్యభంగః పాపం చ స్యాత్, జయోఽప్యశక్యనిశ్చయ ఇత్యత్రాహ (మయైవేతి) ఏతే = కృతాఽపరాధా ధార్తరాష్ట్రాదయః, పూర్వమేవ = త్వద్యుద్ధోద్యోగాత్ప్రాగేవ, మయైవ నిహతాః = నిహంతుం సంకల్పితాః, స్వసంకల్పస్యాఽమోఘత్వా త్ఫలసిద్ధ్యవినాభావేన నిహతా ఇత్యుక్తిః, హే సవ్యసాచిన్ - సవ్యేనాఽపి కరేణ, సాచయితుం = శరసంధానాదికం కర్తుం, శీల మస్యాస్తీతి సవ్యసాచీ, తస్య సంబుద్ధిః, కరద్వయేనాఽపి యోద్ధుం సమర్థ ఇత్యర్థః, భూభార నిర్హరణార్థం తవేదృశం సామర్థ్యం మయా సంకల్పితమితి భావః, నిమిత్తమాత్రం - తేషాం మత్కర్తృక

హననే త్వం శస్త్రాదికరణస్థానీయః, భవ, ప్రాధాన్యవ్యవచ్ఛేదాయ 'మాత్ర' శబ్దః, భగవానేవాఽత్ర శత్రుసంహరణే ప్రధానకారణం, అహం తు తదుపకరణ మిత్యనుసందధానః పాప నైర్ఘృణ్యా పరాజయశంకాం త్యజేతి భావః, మద్భక్తస్య తవ జయయశోరాజ్యలాభార్థం త్వదుద్యోజన మితి శ్లోకతాత్పర్యం ॥ 33 ॥

శ్లో॥ ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠాః
యుద్ధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్ ॥ 34

టీ -: మయా = నాచేత; హతాన్ = చంపబడిన; (చంపబడుటకై సంకల్పింపబడిన) ద్రోణం చ = ద్రోణాచార్యుని; భీష్మం చ = భీష్మాచార్యుని; జయద్రథం చ = సైంధవుని; కర్ణం = కర్ణుని; తథా = అట్లే; అన్యాన్ = ఇతరులైన; యోధవీరాన్ + అపి = యుద్ధముచేయువీరుల నున్ను; త్వం = నీవు; జహి = సంహరింపుము; మా వ్యథిష్ఠాః = బాధపడకుము; యుద్ధ్యస్వ = యుద్ధ మొనర్పుము; రణే = యుద్ధమునందు; సపత్నాన్ = శత్రువులను; జేతా + అసి = జయింపగలవు.

తా -: ఈ భీష్మద్రోణాదివీరులను నేను ముందే సంహరింప సంకల్పించితిని. కావున వీరిని సంహరించుటకు నీవు బాధపడవలదు. యుద్ధమొనర్పుము. శత్రువులను తప్పక జయింపగలవు.

దీపికా -: అర్జునస్యాఽస్థానస్నేహకారుణ్యాధర్మాధర్మభయమూలం- 'కథం భీష్మమహం సంఖ్యే' ఇత్యాదికం సాక్షాత్ప్రతివదతి —

మయా = సర్వసంహర్త్రా, హతాన్ = హననాయ సంకల్పితాన్, ద్రోణం భీష్మం జయద్రథం, తథా కర్ణం, అన్యాన్ యోధవీరానపి = యోధశ్రేష్ఠానపి త్వం జహి = హన్యాః, మారితమారణే కిం కారుణ్యం; కా ధర్మాదిశంకేతి భావః, నను త్వయా హననాయ సంకల్పితా నపీదానీం

జీవతో భీష్మాదీన్ కథం హన్యా; తథాసతి—మామయం లోకో గురు హంతా బంధు హంతేతి వక్ష్యతి, ఏత జ్జయశ్చాఽతి దుర్లభ ఇత్యా శ్రాహ—మా వ్యథిష్ఠాః = వ్యథాం మా కృథాః. యుధ్యస్వ = స్వవర్ణో చితం ధర్మయుద్ధం కురు, రణే = యుద్ధే, సపత్నాన్—ఆచార్య బంధు రూపానపి ప్రతిపక్షే ప్రవేశేన శత్రుభూతాన్- జేతాఽసి = జేష్యసి, యది ద్రోణాదీ నుదాసీనాంస్త్వం హన్యాః, తదా తవ లోకనిందా స్యాత్, ప్రతిపక్షీభూయ యుధ్యమానాంస్తాన్ స్వవర్ణోచితేన ధర్మయుద్ధేన నిఘ్నత స్తవ లోకనిందాగంధః కశ్చిదపి నాస్తి, మదీయాఽమోఘ సంకల్పేన తేషాం మరణాఽవశ్యంభావా జ్జయోఽపి తవాఽతి సులభ ఇతి భావః ॥ 34 ॥

సంజయ ఉవాచ-:

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఽంజలిర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య॥ 35

టీ-: కిరీటీ = అర్జునుడు, కేశవస్య = బ్రహ్మరుద్రులకును నియామకుడైన శ్రీకృష్ణునియొక్క, ఏతత్ = ఈ వచనం = వాక్య ములను, శ్రుత్వా = విని, నమస్కృత్వా = నమస్కరించి, భీతభీతః = మిక్కిలి భయపడినవాడై, భూయః + ఏవ = మరల, ప్రణమ్య = నమస్కరించి, కృత + అంజలిః = అంజలి ఘటించినవాడై, వేప మానః = వణకుచు, సగద్గదం = గద్గదస్వరముతో, కృష్ణం = శ్రీకృష్ణుని గూర్చి; ఆహ = పలికెను.

తా:- భగవంతుని ఈ మాటలను విని అర్జునుడు భయముతో వణకుచు అంజలి ఘటించి గద్గదస్వరముతో శ్రీకృష్ణుని గూర్చి ఇట్లు పలికెను.

ఏవ మర్జునాయ భగవతా స్వాభిప్రాయే కథితే, తదనంతరం కిం వృత్తమితి ధృతరాష్ట్రేణ పృష్టస్సంజయ ఉవాచ—

కిరీటీ = అర్జునః, కేశవస్య = బ్రహ్మరుద్రాదేరపి నియంతుర్భగవతః, ఏతత్ = స్వాభిప్రాయావిష్కరణరూపం వచనం, నిశమ్య, నమః = నమస్కారం, కృత్వా, భీతభీతః = తద్రూపవ త్తద్వచనస్యాపి రాజలోక సంహారాఽభిప్రాయ కథనరూపత్వేన భయజనకత్వా న్నిరూపణాఽజ్ఞానేన పూర్వమేవ భీతో వచనశ్రవణాదతి భీతస్సన్, భూయ ఏవ ప్రణమ్య = ప్రణిపత్య, కృతాంఽజలిః = సంపుటీకృత కరద్వయస్సన్, వేపమానః = కంపమానః, కృష్ణం = ఆశ్రిత సంసార కర్షణశీలం భగవంతం, సగద్గదం = గద్గదేన వికృత కంఠసర్వేణ సహితం యథాతథా, ఆహ॥ అత్ర నమస్కృత్వేత్యనేన స్వాభిప్రాయావేదక భగవద్వచన శ్రవణాఽనంతర మవశ్యకర్తవ్యః ప్రథమ నమస్కార ఉక్తః, భీతభీతస్య వక్ష్యమాణవాక్యప్రారంభార్థౌ పునః ప్రణామాంఽజలీ, కేశవస్యైతద్వచన మిత్యనేన— స్వయం సర్వస్మాత్పరోఽపి సన్న పేక్షామాత్రేణ స్వవిగ్రహాది ప్రదర్శనవత్స్వాభిప్రాయా విష్కరణమపి కృతవాన్, అహో మహదేత దాశ్రిత వాత్సల్య మస్యేతి వ్యజ్యతే, కిరీటీ నమస్కృత్వేతి పద సంఘట్టనయా భగవచ్చరణారవింద సంబంధేన కిరీట జుష్టం శిరః కృతార్థతాం గతం, అన్యథా భారఃపరం పట్ట కిరీటజుష్ట మప్యుత్తమాంగం న నమేన్ముకుందం" ఇత్యాద్యుక్తరీత్యా తచ్ఛిరసోభారమాత్రం స్యాదితి భావో వ్యజ్యతే ॥ 35 ॥

శ్లో॥ *స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా*
*జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ,*
*రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి*
*సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః॥* 36

టీ.: హృషీక + ఈశ=శ్రీకృష్ణ, జగత్; జగత్తు,(జగత్తునందలి దేవగంధర్వాదులు) తవ = నీ యొక్క, ప్రకీర్త్యా = స్తుతిచేత, ప్రహృ

ష్యతి = మిక్కిలి సంతసించుచున్నది, అనురజ్యతేచ = ప్రీతిచెందు చున్నది, రక్షాంసి = రాక్షసులు, భీతాని = భయపడినవారై, దిశః = దిక్కులను గూర్చి, ద్రవన్తి = పారిపోవుచున్నారు, సర్వేసిద్ధసంఘాః = సిద్ధుల సంఘము లన్నియు, నమస్యన్తి = నమస్కరించుచున్నవి.

తా-: శ్రీకృష్ణ, దేవగంధర్వాదులు నిన్ను కీర్తించుచు ఆనందించు చుండగా రాక్షసులు భయభ్రాంతులై పారిపోవుచున్నారు. సిద్ధులు భక్తితో నమస్కరించుచున్నారు.

హే హృషీకేశ, జగత్—యుద్ధదిదృక్షయా ఽఽగత మనేక దేవ గంధర్వ యక్ష విద్యాధర కిన్నెర కింపురుషాది రూపం, తవ, ప్రకీర్త్యా= త్వన్మాహాత్మ్య ప్రకీర్తనేన, ప్రహృష్యతి = ప్రకృష్టం హర్షం ప్రాప్నోతి, అనురజ్యతే చ = అనురాగం చ కరోతి, త్వదానుకూల్యేన త్వత్ప్రసాద విషయీభావాదితి భావః, అత్ర ప్రహృష్యతీత్యనేన ఆతిథిలాభాదివ త్తాదాత్విక ప్రీతి ర్వివక్షితా, అనురజ్యత ఇతి తు పిత్రాదిషు పుత్రాదివ త్స్నేహ ఇతి న పునరుక్తిః, రక్షాంసి = రాక్షసాః, భీతాని — త్వయి ప్రాతికూల్యేన త్వత్ప్రతాప విషయతయా భయాతురాణి సంతి, దిశః, ద్రవంతి = పలాయంతే, దిశ ఇతి బహువచనేన సర్వా దిశ ఇతి లభ్యతే, సర్వేషా మేక దిక్పలాయనే భగవదనుద్రవణ శంకేతి భావః, వీక్షంతే త్వామితి దేవవదసురాణా మపి భగవద్రూపదర్శనసత్త్వే ద్రక్షసాం భయోపపత్తిః, సర్వే, సిద్ధసంఘాః = సిద్ధాద్యనుకూలవర్గాః, త్వాం, నమస్యంతి చ = ప్రణమంతి చ, జగత్ప్రహృష్యత్యను రజ్యతే చ రక్షాంసి దిశో ద్రవంతి. సిద్ధసంఘా నమస్యంతి చేతి, -యత్— ఇదం సర్వం, స్థానే—యుక్త మిత్యర్థః అయం శ్లోకః శ్రీ విష్ణుపంజరాదిషు వినియుక్తః ప్రసిద్ధమంత్ర ఇత్యాచార్యాః ॥ 36 ॥

శ్లో॥ *కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్*
*గరీయసే బ్రహ్మణోఽప్యాది కర్త్రే।*

అనన్త! దేవేశ! జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్

టీ-: మహాత్మన్ = ఓ మహాత్మా, బ్రహ్మణః + అపి = బ్రహ్మకును, ఆదికర్త్రే = తొలి స్రష్టవు, గరీయసే = గొప్పవాడవునైన, తే = నీకొఱకు, కస్మాత్ = ఎందువలన, న నమేరన్ = (బ్రహ్మాది దేవతలు) నమస్కరింపకుందురు. అనన్త = అపరిచ్ఛిన్నమైన స్వరూపముగలవాడా, దేవ + ఈశ = దేవతలను సైతము నియమించువాడా, జగత్ + నివాస = జగత్తున నివసించువాడా, సత్ + అసత్ = కార్య కారణ దశలను పొందు ప్రకృతి తత్త్వము, త్వం = నీవే తత్ + పరం = ఆ ప్రకృతి తత్త్వముకంటె ఉత్కృష్టమైన, యత్ అక్షరం = ఏజీవతత్త్వము గలదో (అదియు) త్వం = నీవే

తా-: జగత్కారణభూతుడవైన నీకు బ్రహ్మాదులు ఎందుకు నమస్కరింపరు. చేతనాఽచేతన తత్త్వములు రెండును నీవే గదా.

యుక్తతా మేవోపపాదయతి-:

హే మహాత్మన్ = మహావిగ్రహ, బ్రహ్మణోపి = స్వేతరసమస్త దేవజాతేర్మంతవ్యస్య హిరణ్యగర్భస్యాపి, ఆదికర్త్రే = ఆది భూతాయ కర్త్రే, ఉపాదాన నిమిత్తో భయకారణాయ, తే = తుభ్యం, కస్మాచ్చ— హేతోః, న నమేరన్ = న నమస్కుర్యుః, బ్రహ్మాదయ ఇతి శేషః, చకారేణ కస్మాన్న ప్రహృష్యేయుః, నాఽనురజ్యేరన్, కస్మాచ్చ భీతాని రక్షాంసి న ద్రవేయురితి సముచ్చీయతే; బ్రహ్మాఽపేక్షయాఽఽది కర్తృత్వ ముపపాదయతి (అనంతేతి) హే అనంత = అపరిచ్ఛిన్న స్వరూప, దేవేశ = దేవానామపి నియంతః; జగన్నివాస = జగతి నివాసో యస్యేతి విగ్రహః; జగదాధారత్వస్యోత్తర శ్లోకే ప్రతిపాదితత్వాత్; సత్ అసత్— "అసద్వా ఇదమగ్ర ఆసీత్ తతో వై సదజాయత" ఇత్యుక్తరీత్యా భావవికార యోగితయా కార్యావస్థం సచ్ఛబ్దవాచ్యం; అభావవికార యోగితయా

కారణావస్థ మసచ్ఛబ్దవాచ్యం, కార్యకారణభావేనాఽవస్థితం ప్రకృతి తత్త్వం, త్వమేవ, తత్పరం - తస్మాత్ - కార్యకారణోభయావస్థా దచేత నాత్తత్సంస్పృష్టచేతనాచ్చ, పరం - ఉత్కృష్టం, యత్, తదక్షరం - ముక్తాత్మతత్త్వం చ, త్వమేవ ॥ 37 ॥

శ్లో॥ త్వమాదిదేవః పురుషః పురాణః
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనన్తరూప ॥ 38

టీ :: త్వం=నీవే; ఆదిదేవః=సృష్టికర్తవు; పురాణః పురుషః= నిత్యనూతనపురుషుడవు:(లేక సర్వాంతర్యామివి) అస్య=ఈ; విశ్వస్య= ప్రపంచమునకు; పరం నిధానం = ఉత్తమమైన ఆధారము; త్వం= నీవే; వేత్తా=(సర్వమును) తెలిసికొనువాడవు; వేద్యం చ=తెలియబడు పదార్థమున్ను; త్వం అసి=నీవే అయిఉన్నావు; పరం=అత్యుత్కృష్ట మైన; ధామ=ప్రాప్యస్థానమైన వైకుంఠము; త్వం= నీవే;అనన్తరూప= దేశకాలవస్తుపరిచ్ఛేదము లేని స్వరూపముగల శ్రీకృష్ణ; త్వయా=నీచేత; విశ్వం=ప్రపంచము; తతం=వ్యాపింపబడియున్నది.

తా -: భగవన్; నీవు పురాణపురుషుడవు. సర్వస్రష్టవు; ఈ ప్రపంచమునకు ఆధారభూతుడవు. ఈ ప్రపంచమున తెలిసికొనువారు, తెలియబడు పదార్థములు సర్వము నీవే. నీస్వరూపము అపరిచ్ఛిన్నము ప్రపంచమంతయు నీచే వ్యాపింపబడియున్నది. త్రిపాద్విభూతియు నీవే అగుచున్నావు.

దీపికా -: న కేవలం ప్రకృతిపురుషాత్మకతయా త్వం చతుర్ముఖ స్యైవ కారణభూతః, కింతు కృత్స్నస్యాపి జగత ఇతి వదన్ పూర్వోక్త ప్రకృతిపురుషాది సామానాధికరణ్యే నిబంధనమాహ—

